సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 18
25-12-57

Founder : K. NAGESWARA RAO

హేవిళంబి పుష్య, శుద్ధ చతుర్థి బుధవారం

## ★ విషయానుక్రమణిక ★



ముఖచిత్రం:

నిరూపరాయ్





# నేనూ ఆంధ్రుణ్ణే!

మొన్న నవంబరు 6-వ తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురితమైన "నేనాంధ్రుణ్ణి" అనే వ్యాసం ఒక మిత్రుడు నాకు చదివివినిపిస్తూవుంటే (అసలు నేను చదవను లెండి యిటువంటివి. ఒకడు చదివి వినిపించాలసిందే-చదివేఓపిక నాకు లేదు. కారణం నేనూ ఆంధ్రుణ్నే గనుక) మరోమిత్రుడు ఈ వ్యాసం అద్భుతంగా వుంది. ఆంధ్రుల నిజస్థితి వున్నదున్నట్లు వ్రాశాడు. నాకేశక్తి వుంటే అరచయితకు ఒక సువర్ణ కంకణం తగిలించేవాడ్ని (నిజంగా శక్తివుంటే ఒక స్టెయిన్లెస్ స్టీల్ కడియం కూడా తగిలించడు లెండి. కారణం అతను కూడా ఆంధ్రుడే గనుక) అన్నాడు.

ఈ వ్యాసం-దైవం మేలుచేసి - తెలుగులో వుంది గాబట్టి సరిపోయిందిగాని, మరే అరవం బెంగాలీ, ఇంగ్లీషు భాషలలో వున్నా ఆంధ్రులు ఇంతటి మేధావులు అనే విషయం వాళ్ళకు మామూలుగా తెలిసిన దానికంటె హెచ్చుగా సమూలంగా తెలుసుకోడానిక అవకాశం కలగివుండేది. అటువంటి అవకాశం కూడా ఇవ్వడానికి సిద్ధంగా వున్నామంటే మనం ఆంధ్రులంగనుకే!

* * *

మా ఆవిడను చూచి ఒక మిత్రుడు మీ కుటుంబం ఆంధ్ర-అరవ మిశ్రమంగా వుండడం చాలా ఆశ్చర్యంగా వుందన్నాడు. అతనికి ఆశ్చర్యం కలగడంలో తప్పేమీలేదు. మా యిల్లాలు అచ్చు ఏ కుంభకోణంలోనో పుట్టి పెరిగిన అరవపిల్లలాగ కనిపిస్తుంది వేషభాషలలోనే కాకుండా, నడవడికలో కూడాను. నేను అరవదాన్ని వివాహం చేసుకునేటంత అదృష్టం నాకు పట్టలేదన్నాను. ఆంధ్రుడినై పుట్టిన్నీ వేరొకజాతి స్త్రీని పెళ్ళిచేసుకోకపోయే అంతటి దురదృష్టం పట్టిందని వ్యక్తపరుస్తూ మరి నేను కూడా ఆంధ్రుణ్ణేగా!

* * *

ఈ మధ్య నేనొక ఆంధ్ర గ్రంథప్రచురణలశాఖవారికి ఒక చిన్నవ్రాతప్రతి పంపిస్తూ దానిని వారి ప్రచురణలలో అనుబంధ గ్రంథంక్రింద ముద్రించమని, పారితోషికం ఏమీ ఇవ్వకపోయినా పరవాలేదని, నా పేరు అందరికీ తెలుస్తే అంతే చాలునని ప్రాధేయపడుతూ వ్రాశాను. ఇట్లా ప్రాధేయపడ్డానికికూడా కారణం నేనూ పేరుకోసం పాకులాడే ఆంధ్రుణ్నిగనుకనే అనుకోండి. దానికి జవాబుగా వారు సంవత్సరానికి 8 గ్రంథాల చొప్పున రూల్సు ప్రకారం ప్రచురించవలసిన నిర్బంధ గ్రంథప్రచురణలకే అవకాశం లేకపోతూ వుంటే, అనుబంధ గ్రంథప్రచురణ ఎట్లాగండీఅన్నాడు. కాబట్టి సప్లిమెంటుకు స్వస్తికదా అని అనుకోక తప్పిందిగాదు. వున్నదున్నట్లు ఢంకా బజాయించి చెప్పారండి మీరు అని నేనంటే మనం అంతా ఆంధ్రులంగదండీ అన్నాడు!

* * *

భోజనాల సమయంలో వడ్డిస్తూన్న మా అమ్మనుచూచిఒకదూరపు స్నేహితుడుమీరు ఒక వంటమనిషిని కూడా పెట్టుకోడం చాలా మంచిపని చేశారన్నాడు. బహుశా తెలియకనే అనుకోండి. అందుకు నేను కాదనకుండా ఈ విడే మా ఇంట్లో చిన్నప్పటినుంచి వంటచేస్తోంది అన్నాను ఇంగ్లీషులో. తెలుగులో అంటే అప్పుడే చేతులోనున్న ఆహారల పళ్ళెం నాబుర్రమీద ఎత్తేసేదే. పరభాష రావడం ఇట్లా సద్వినియోగం అయింది గదా అని సంతోషించాను. మరి నేనూ ఆంధ్రుణ్ణేగా!

* * *

కచ్చితమైన అరవ వాడిలాగ కనిపించాలని గుండారుకట్టి, ఒక తువాలుమీద వేసుకొని ఉడిపి కాఫీ హోటేలులోకి వెళుతూ అలవాటులేని కారణంచేత గుండారు అడ్డం పడిటిఫిన్ చేస్తున్న ఒకఅరవవాడిమీదపడ్డాను. వాడు నన్ను అరవంలో ఎన్నోతిటడమే కాకుండా, "తెలుగు వెధవకు అరవకట్టేమిటి



ఈనెల 7 వ తేదీన ఏలూరులో పరమపదించిన సుప్రసిద్ధ దేశ సేవకురాలు, శ్రీ ఈదర వేంకట్రావు ధర్మపత్ని శ్రీమతి ఈదర సుబ్బమ్మాదేవి.

అని కూడా హేళన చేశాడట! నాకు అరవం రాకపోయినా ఇంగ్లీషులోనే 'ఎక్స్యూజ్' 'ఎక్స్యూజ్' అనేసి నేనుపైకి వచ్చాను. ఎవరెన్ని తిట్టినా దులిపేసుకోడం ఆంధ్రుడి ప్రధాన లక్షణం కదూమరి!

* * *

నా స్నేహితుడు యీ మధ్య ఒక పెద్ద యింటిపిల్లను పెళ్ళిచేసుకొని, రైల్వే ఉద్యోగం కోసం కుటుంబ సహితంగా వెళ్ళాడు. అక్కడ ఒక పెద్దయిల్లు అద్దెకు తీసుకున్నాడు. ఇంటర్వ్యూకి వెళ్ళేముందు 50 లు ఖర్చుచేసి డ్రెస్సుకుట్టించుకున్నాడు. లంచం రు 300 లు యిచ్చాడు వాడియింటి చుట్టూ 3 మాసాలు తిరిగాడు ఈలోగా పెళ్ళాం మెళ్ళోగొలుసుహరించుపోయింది! ఉద్యోగం కోసం వచ్చి నావంటిమీదవన్నీ వూడ్చేస్తూన్నారేమని భార్య ఏడ్చింది, నిజమైన ఆంధ్రుడి భార్యా గనుక! వాడు కూడా మీనాన్న బ్రతికున్నంత కాలం మనకేం లోటులే అనేశాడు స్పోర్టివ్ గా! మరి పదహారణాల—పొరపాటు-100 నయాపైసల - ఆంధ్రుడు కనుక.

* * *

నన్ను ఒకదఫా తెలిసిన పెద్దమనిషి తన యింట్లో ఏదో శుభకార్యం అని (అదేదో తెలుసుకోడానికి కూడా తీరికవుండదు లెండి (తెలుసుకున్నా జ్ఞాపకం వుంచుకోడం మరో యిబ్బందిగదూ!) రాత్రి సరిగా 8 గంటలకు భోజనానికి రమ్మని ఆహ్వానించాడు నేను నాభార్యతో రాత్రి భోజనం చెయ్యవని చెప్పేశాను. తీరా నేను అక్కడకు వెళ్ళేసరికి బైట ఆకులన్నీ పారేసి వాళ్ళ పనిమనిషిగాబోలు తలుపువేస్తోంది. విందుకు పిలిచిన పెద్దమనిషి సినీమాకు వెళ్ళిపోయాడు నేను తెల్లముఖంతో ఇంటికి చేరుకుని కాఫీ పెట్టించుకు త్రాగి పడుకున్నాను. మా ఆవిడ కారణం అడిగితే Punctuality విషయంలో నేను ఆంధ్రుడ్ని అనేవిషయం జ్ఞాపకంచేసి వూరుకున్నాను.

ఇట్లా చెప్పడానికైతే ఎన్నో వున్నాయి లెండి వినడానికి ఓపికవుండాలిగాని. అసలు చెప్పడానికి మరేమీ వుండకనూ పోవచ్చుకి మొత్తం మీద చెప్పేవాడు వినేవాడు ఇద్దరూ ఆంధ్రులేగా.

—కాంచనపల్లి వెంకటరంగారావు

★




# రాజధానిలో 'సైక్లిస్టుల ప్రజాస్వామ్యం'

"ప్రజాస్వామ్య మంటే రొట్టెలాంటిదనీ, రొట్టెను కోసినట్లే దాన్ని కూడా ముక్కలు ముక్కలుగా కోసి ప్లేట్లలో పెట్టి అందరూ ఆరగించడానికి అందించ వచ్చుననీ చాలామంది దురభిప్రాయపడుతుంటారు. ప్రజాస్వామ్యం ఒక ఉదాత్త లక్ష్యం; ఒక జీవిత విధానం. ఈ లక్ష్యాన్ని సాధించి సార్థకం చేసుకోవాలంటే, పటుతరమైన కృషీ, అదో విశిష్టమైన మానసిక, ఆధ్యాత్మిక పరివర్తనం అవసరం. ఉదాహరణలద్వారా, ఉత్తర్వులద్వారా, ఉదాత్తమైన విద్యా ప్రబోధంద్వారా ప్రజలను ఉత్తేజితులచేసి ఉత్తమమార్గంలో నడిపి, వారికి ఇతోధికంగా సహాయపడవచ్చునని చెప్పడానికి చరిత్రలో బోలెడన్ని నిదర్శనాలున్నవి. కేవలం ఒక రాజ్యాంగాన్ని అమలుజరిపి, లాంఛనప్రాయమైన ఒక పార్లమెంటరీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినంత మాత్రాన ప్రజాస్వామ్యాన్ని ప్రజలమీద ఒలకపోసినట్లు కాదు. ఇంతమాత్రంచేత ప్రజాస్వామ్య పరిపాలనా ప్రయోజనాలు ప్రజల అనుభవానికి వస్తవని చెప్పడానికి చరిత్రలో నిదర్శనా లెక్కడా కనిపించవు.

అయితే, భారతదేశంలో సరిగా ఇదే జరిగింది. 1950 జనవరి 26 వ తేదిన నవభారత రాజ్యాంగాన్ని అమలుజరిపారు. పార్లమెంటుపట్ల బాధ్యత వహించే 'ప్రజాస్వామ్య బద్ధమైన' ప్రభుత్వం ఒకదాన్ని ఏర్పాటుచేశారు. ప్రజల మానసిక ధోరణిని గాని, కాలమాన పరిస్థితులనుగాని, విద్యావ్యాప్తిస్థాయినిగాని పరిగణించకుండా ప్రజలకు 'ఈ ప్రజాస్వామ్యాన్ని' ప్రసాదించడం జరిగింది. దాని ఫలితాలను కళ్లారా చూస్తున్నాము.

ప్రజాస్వామ్యం అంటే ప్రజాభిమతానుసారం పరిపాలనా విధానాన్ని రూపొందించడమే నన్న దృక్పథం సహజసిద్ధమైన దాని అవధులను సైతం అతిక్రమిస్తున్నది. ఫలితం పరిస్థితులు శుద్ధ అయోమయంగా, అవివేకంగా తయారుకావడమే.

ఇందుకు ఉదాహరణగా ఇక్కడ రాజధాని వ్యవహారాలనే తీసుకోవచ్చు. ఇందులో అతిశయోక్తిగాని, ఆశ్చర్యంగాని ఏమీ లేదు. దాదాపు 60 వేల మంది ప్రజలు చట్ట విరుద్ధంగా ప్రభుత్వపు ఎస్టేట్ స్థలాలను ఆక్రమించి తిష్ఠవేసి కూచున్నారు. ఖాళీ చెయ్యమంటే చెయ్యరు. అద్దె సక్రమంగా కట్టమంటేకట్టరు. దాదాపు మూడుకోట్లరూపాయలవరకు అద్దెలు బకాయిపడి వున్నవి. ప్రజాస్వామ్యమంటే ప్రజాభిమతానికి అనుగుణంగా నడుచుకోవడమే కాబట్టి, అద్దెలు చెల్లించకపోవడం, స్థలాలు ఖాళీచేయకపోవడం వీరి అభిమతం. యథా ప్రజా! తథా రాజా! అదే మన నేటిప్రజాస్వామ్యం!

**శ్రీ కృష్ణ**
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

* * *

మోటారుకారుకు 'ఆటో మొబెల్' అన్నదిమారుపేరు. అదేవిధంగా మన ద్విచక్ర శకటం 'సైకిల్'కు మరొక పేరు "ఫూటోమొబెల్!" అని చెప్పుకోవచ్చు. 'ఫూట్' అంటే ఆంగ్లభాషలో 'పాదం' అని అర్థం. ఈఅర్థాన్నే మరికొంచెం పొడిగిస్తే 'సైకిస్'అంటే 'చక్రవిహారి అయిన పాదచారి' అని చెప్పుకోవలసి వస్తుంది.

రాజధానిఅయిన న్యూఢిల్లీలో మన ప్రజాస్వామ్యమంతా ఈ సైక్లిస్టులలోనే మూర్తిభవించిందని చెప్పవచ్చు. రాజవీధులలో మారుమూల సందుగొందులలో వీరి స్వైర విహారాన్ని ప్రత్యక్షంగా చూడవలసిందేగాని వర్ణించలేము. మోటారు కార్లలోవెళ్లేవాళ్లు బార్లుతీర్చివచ్చే ఈ సైక్లిస్టుల బెడదలోనుంచి తప్పించుకోవాలంటే మెల్లమెల్లగా సందుచేసుకుంటూ వానపాములలా పాకిపోవలసిందే తప్ప గత్యంతరం లేదు.

మంత్రిమండలిలో ప్రధానమైన సభ్యులెవరైనా రోడ్లమీద వెళ్ళవలసి వచ్చినప్పుడు సాధారణంగా రహదారులలో రద్దిని తగ్గించడం జరుగుతుంది. కాబట్టి, రాజధాని రహదారులలో 'ఇండియామార్కు ప్రజాస్వామ్యం' ఆచరణలో ఏవిధంగావున్నదీ ఆమంత్రులుచూసే అవకాశం లభ్యం కాదు.

ఇదంతా ఎందుకొచ్చిన రభస! ఢిల్లీ రోడ్లను వాహనయానానికి బంద్ చేసి పూర్తిగా సైక్లిస్టులకే అప్పగించివేస్తే సరిపోదూ? ప్రజాస్వామ్య పరిపాలనా విధానంలో పాలకుల యజమానులు ప్రజలే కాబట్టి మంత్రులు కూడా తమ యజమానులతో మమైక్యమైపోతేసరి. అలా చేస్తే రాజధానిలో 'ప్రజాస్వామ్యం' ఏవిధంగా అమలు జరుగుతున్నదీ వారికి బాగా బోధపడుతుంది. అంతేగాకుండా రహదార్లలో ట్రాఫిక్ కంట్రోల్ కు ఏర్పాటుచేసే పోలీసు బలగంమీదా, రోడ్ల నిర్మాణంమీదా అవుతున్న ఖర్చు ఎంతో కలిసివస్తుంది. పై పెచ్చు అంతర్జాతీయంగా భారతదేశ ఖ్యాతి మరీ మిన్ను ముట్టుతుంది! నగరంలో అధిక సంఖ్యాకులైన సైక్లిస్టులకు దాసోహమని రోడ్లను అప్పగించిందనే ఘనప్రతిష్ఠకూడా భారత దేశానికి వస్తుంది!

* * *

సరే! సైక్లిస్టుల గొడవ అలా వుండనుకోండి. గతవారం ఈ మహానగరంలో ప్రజాస్వామ్య నిర్వచనాలమీద మామూలు మోతాదుకు మించిన తర్జన భర్జనలే జరిగినవి. రాజకీయ, ఆర్థిక, సామ్యవాద, పార్లమెంటరీ సంబంధమైన ప్రజాస్వామ్య విధానాలపై విపుల చర్చలు కొనసాగినవి. ఈ చర్చలలో పాల్గొన్న ప్రతివ్యక్తీ తనదృక్పథం ఒక్కటే సబబయినదనే ధోరణిలో వ్యవహరించాడు.

ర్థికవ్యవహారాలను పరామర్శిస్తూ కొందరు కలగాపులగపు ఆర్థిక వ్యవస్థ (మిశ్రమ ఆర్థిక వ్యవస్థకు మారుపేరు) ప్రయోజనాల ప్రసక్తి తీసుకువచ్చారు. స్వేచ్ఛా వ్యాపారమన్నది బూజు పట్టిన 19వ శతాబ్దపువిధానమని వీరు ఖండించారు. శాంతి భద్రతల రక్షణ విషయంలోమాత్రం 'స్వేచ్ఛావర్తన' వుండడమే ఉదాత్త ప్రజాస్వామ్యానికి ఉత్తమ లక్షణమని వాదించారు.

బర్మా ప్రధాని ఊను ఇక్కడ ఈ ముఖ్య ప్రసంగిస్తూ, శాంతిభద్రతల రక్షణ విషయంలో ప్రభుత్వం ఘోరమైన తప్పిదం చేసిందన్నారు. "పెద్ద ఉప్పెనలా వచ్చిన తిరుగుబాటు కొంత సమసిపోగానే ఆ సమస్యను సమగ్రంగా సంపూర్తిగా అప్పటికప్పుడేపరిష్కరించివేయకుండా ప్రభుత్వం తనదృష్టిని సమాజాభ్యుదయసమస్యలమీదికీ, అభివృద్ధిపథకాలమీదికీ మళ్ళించివేసింది. దీనిఫలితం ఏమిటంటే ప్రభుత్వం రెంటికీ చెడిన రేవడిలా అయింది. ఇటు అభివృద్ధి పథకాల ఆచరణలోనూ విఫలమైంది; అటు శాంతిభద్రతల రక్షణ విషయంలోనూ విఫలమైంది. వ్యవసాయ విస్తరణ కార్యక్రమమంతా వెనుకబడిపోయింది. భూమిని జాతిపరంచేసే కార్యకలాపమంతా దెబ్బతినిపోయింది. పరిస్థితి అంతా నీళ్ళవిరేచనాలతో బాధపడుతున్న రోగికి బలవంతాన బలవర్థక ఔషధాలు పోసినట్లయింది," అని కూడా ఊను అన్నారు.

ఇక్కడ మనపరిస్థితీ అందుకు భిన్నంగా ఏమి లేదేమో? విరేచనాలరోగికి బలవర్ధక ఔషధాలను గుప్పిస్తున్నట్లే కనిపిస్తుంది.

* * *

కేంద్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ సప్తమవార్షిక నివేదికలో ఈ విధంగా ప్రకటించింది:

"కమిషన్ జరిపిన వ్రాతపరీక్షలలో అభ్యర్థులు సమాధానాలు వ్రాసిన తీరు అతి నిరుత్సాహంగా వున్నదని పరీక్షకులు వ్యాఖ్యానించారు. మొత్తంమీద విద్యార్థులు ఏ విషయంలోనూ గ్రాహ్యశక్తిని ప్రదర్శించలేకపోతున్నారు. ప్రశ్నలకు వారు వ్రాసిన సమాధానాలను చదువుతూంటే, విషయాన్ని ముక్కున పెట్టుకొనివచ్చి అమాంతం చీదివేసినట్లే కనిపిస్తుంది. గ్రాహ్యశక్తి శూన్యమనే విషయం ఇంటర్‌వ్యూలలో మరీ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీస్‌కు, పోలీస్ సర్వీస్‌కు, ఫారిన్ సర్వీస్‌కు ఇతర సెంట్రల్ సర్వీసులకూ జరిగే సమిష్టి పరీక్షలకు ఉత్సాహం, తెలివితేటలు, మంచి వర్చస్సు కలిగిన మెరికలలాంటి యువకులే అనేకమంది వస్తున్నారు. ఏ ఆరువేలమందో పరీక్షలకు హాజరైతే వారిలో బహుకొద్దిమందిని (కొన్ని



చెన్నపురి ఆంధ్రమహాసభవారు ఈ నెల 14వ తేదీన సన్మానించిన సందర్భంలో ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ స్పీకరు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, మద్రాసు రాష్ట్రంలో తెలుగును రెండవ రాష్ట్రభాషగా గుర్తించాలని ఉద్ఘాటించారు.

వందలు) మాత్రమే ఉద్యోగాలకు తీసుకోవడం జరుగుతున్నది. మరికొన్ని ఉద్యోగాలకు చిన్నవయస్కులైనవారిని ఎన్నుకోవలసి వచ్చినప్పుడు పరిస్థితి అమిత ఆశాభంగం కలిగిస్తున్నది. వ్రాత పరీక్షలలో మంచి మార్కులు వచ్చి నెగ్గినవారి పనేకమందిని శరీరదార్ఢ్యత పరీక్షలలోనూ, సెలెక్షన్ బోర్డు జరిపే ఇంటర్‌వ్యూలలోనూ నిరాకరించవలసివస్తున్నది. ఈ వ్యవహారంమనవిద్యావేత్తలకు ఒకవిషమపరీక్షలాంటిదనే చెప్పాలి. దీనికంతకూ ప్రస్తుత విద్యావిధానంలో వున్న లోపాలే కారణమని చెప్పవలసివస్తున్నది. క్రిందితరగతిలోనుంచి పైతరగతిలో వేయడానికి అనుసరించే పద్ధతులు, క్రమశిక్షణ, మొదలైన అంశాల ప్రభావం విద్యాప్రమాణ స్థాయిమీద తప్పక వుంటుంది. అందుచేత ప్రస్తుత విద్యావిధానం విద్యార్థుల బుద్ధివికాసానికీ, శీల ప్రతిభావ్యుత్పత్తుల అభివృద్ధికీ ఎంతవరకు దోహదమిస్తున్నదో జాగ్రతగా పరిశీలించాలి. మన పాఠశాలలు, కళాశాలలు అనుసరించే విద్యావిధానం ఇందుకు తోడ్పడనంతకాలం ఉద్యోగాలకు వీరిని ఎన్నుకోవడంలో 'పర్సనాలిటీ టెస్టు' వుండక తప్పదు."

విద్యాసమస్యపై ఇప్పటికి అనేక సంవత్సరాలనుంచీ తర్జన భర్జనలు సాగుతున్నా ప్రయోజనంలేక పోతున్నది. అయితే కేంద్ర విద్యాశాఖ మాత్రం ఇంతింతై వటుడంతై... అన్నట్లుగా విస్తరిస్తున్నది. ఈశాఖఉద్యోగుల సంఖ్య రీత్యా చూస్తే మూడో స్థానాన్నీ, పార్లమెంటుకు లోపలా, వెలుపలా జరిగే ప్రచారదృష్ట్యా చూస్తే ప్రథమ స్థానాన్నీ ఆక్రమిస్తున్నది. అయినా దేశంలో విద్యావిధాన స్థాయి మాత్రం ఆ యేటికాయేడు దిగజారిపోతున్నది. నిరక్షరాశ్యత పెరిగిపోతున్నది. విద్యా ప్రమాణాలు అవశ్యం పెంపొందాలని మన అగ్రనాయకులు వీలైనప్పుడల్లా విజ్ఞప్తులమీద విజ్ఞప్తులు చేస్తూనే వున్నారు. ఎప్పటికప్పుడు యువజన శిబిరాలను, విద్యార్థి ఉత్సవాలను, క్రమశిక్షణోత్సవాలను యథావిధిగా జరుపుకుంటూనే వున్నాము. అయినా పరిస్థితిమాత్రం ఎక్కడ వేసిన గొంగడి అక్కడే...అన్నట్లున్నది.

* * *

ఆలిండియా మెడికల్ ఇన్‌స్టిట్యూట్ గొడవ మళ్ళీ వార్తలలో కెక్కింది. దీనిలో కర్నల్ అయ్యర్, కర్నల్ రావు గార్లను శస్త్ర, వైద్య శాస్త్ర అధ్యాపకులుగా నియమించడానికి కేంద్ర ప్రభుత్వం తన సుముఖతను తెలియజేసింది. ఈ ఇన్‌స్టిట్యూట్ పాలక వర్గానికి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ అధ్యక్షిణి. తమది స్వతంత్ర సంస్థఅనీ, కేంద్ర ప్రభుత్వానికి సలహా ఇచ్చే అధికారం కూడా లేదనీ, అందుచేత దాని అంతరంగిక పరిపాలనా వ్యవహారాలలో ప్రభుత్వం ప్రమేయం పెట్టుకోకూడదనీ శ్రీమతి అమృతకౌర్ వాదన. ప్రభుత్వానికి అధికారం వుందాలేదా అనే సమస్యను తేల్చివేసే సమయం ఆసన్నం కాబోతున్నది. ప్రభుత్వం ఈ ఇన్‌స్టిట్యూట్‌కు పాలీనా ధనసహాయం చేస్తున్నది. అమృతకౌర్ వాదన ప్రకారం ప్రభుత్వం సహాయం చెయ్యడం కూడా సంస్థ సర్వస్వతంత్ర ప్రతిపత్తిని భంగపరచడమే కావాలి. ధన సహాయం నిలిపివేసే ప్రతిపాదనను ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

ఈ ఇన్‌స్టిట్యూట్‌కు సొంత ఆస్పత్రి అంటూ లేకపోయినప్పటికీ దాదాపు 50 మంది విద్యార్థులను చేర్చుకున్నది. వైద్య విద్యాబోధన నిమిత్తం ఇప్పటి వరకూ సఫ్దర్‌జంగ్ ఆస్పత్రిని ఉపయోగించుకుంటున్నది. ఈ ఆస్పత్రికీ, అమృతకౌర్ ఇన్‌స్టిట్యూట్‌కూ ఏ విధమైన ఇతర సంబంధం లేనందువల్ల ఆస్పత్రిపాలకులు ఇన్‌స్టిట్యూట్‌తో సహకరించడానికి ఇక నిరాకరించినా నిరాకరించవచ్చు. ముందు ముందు, ఏ పరిణామాలు ఉత్పన్నమవుతవో చూడాలి.

(47-వ పేజీ చూడండి)

# జంట రేడియోలు

పాత్రలు :—

మధు-కాలేజీ లెక్చరరు.

పద్మ-మధు భార్య, లాయరు.

రంగమ్మ-పనిమనిషి.

వెంకన్న-నౌకరు.

[సమయం...రాత్రి 8 గంటలు. స్థలం... మధు కాపురముంటున్న డాబా.

ఒక ప్రక్క హిందీ సంగీతం, వేరొక ప్రక్క ఏదో నాటికలోని కొన్ని మాటలు గందరగోళంగా వినపడుతూంటాయి.]

పద్మ-[సౌమ్యంగా] ఇదిగో ఏమండీ...

మధు- —— —— ——

పద్మ-(రెట్టింపుస్వరంతో) మిమ్మల్నే...

మధు- —— —— ——

పద్మ-(చిరాగ్గా) మిమ్మల్నేనండీ పలకరేం.

మధు-(ప్రశాంతంగా) ఆ ఏమిటే...

పద్మ-కొస్త రేడియో తగ్గించి పెట్టకూడదుటండీ...

మధు-ఏమిటే...అన్నావు...

పద్మ-ఆ రేడియో ... మీది ... కొస్త తగ్గించి పెట్టుకోమని...

మధు-ఆహా...అలాగా...నువ్వే తగ్గించి పెట్టుకోకూడదూ...

పద్మ-అదేమిటండీ...నే పెట్టింది అసలు మీకు వినపడుతోందా...అంతా అబద్ధాలే-కానీ.

మధు-ఇదిగో పద్మా! నిజంగా నేను చాల స్లోగా పెట్టేను. కావలిస్తే వచ్చి చూడు.

పద్మ-అబ్బ! ఏంచమత్కారం మనుష్యులండీ మీరు! అయితే నేనే నా రేడియో వాల్యూమ్ హెచ్చుగా పెట్టేనంటారా?

మధు-ఏమో నీకే తెలియాలి...

పద్మ-(కోపంగా) అవును. మరి కాదూ! కావలిస్తే వచ్చిచూడండి. మీకే తెలుస్తుంది.

మధు-ఇదిగో పద్మా! ఇలా చూడు...

పద్మ-ఏమిటే...చెప్పండి.

మధు: (చిలిపిగా) పోనీ నేను ఎలాగో నా రేడియో పెట్టేను గనుక తమరు మీ రేడియో తీసెయ్యకూడదూ...

పద్మ: ఏమిటే! నేను నా రేడియో ఆపు చేసెయ్యనా. అలా వీలులేదు, ఎందుకాపు చెయ్యాలి? మీరే మీరేడియో ఆపుచేసేసి వచ్చి యిక్కడ కూర్చుని హాయిగా ఈ నాటిక వినండి. ఎంతో బాగుంది.

మధు: (నవ్వుతూ) అబ్బే అలా వీలు లేదు. నేనేం తక్కువ తిన్నానా! ఏమైనా సరే, నా రేడియో కట్టెయ్యను. ఈ రోజు బుధవారం కూడాను. మంచిమంచి హిందీ రికార్డులు వస్తున్నాయి. పోగొట్టుకుంటానా? నీకుకూడ వినాలని వుంటే చెప్పు. మరింతగట్టిగా పెడ్తాను.

పద్మ: (చిలిపిగా) ఆ, మరే! మీరేం గట్టిగా పెట్టనక్కరలేదు. ఇప్పుడు ఎలాగో పెట్టేరుగా పెద్ద కాఫీహోటలులో పెట్టినట్లు. ఎవరేనా దారంట పోయేవాళ్లు ఇది నిజంగా ఏ కాఫీహోటలో అనుకుని వస్తారు కూడాను. అప్రతిష్ట...

తంగిరాల రామలక్ష్మి

మధు: వస్తే రానీ. పోయిందేముంది. ఫ్లాస్కులో వుందిగా కాఫీ. పొద్దువుగాని...

పద్మ: బాగానేవుంది వరస. ఏమిటి అర్ధరాత్రి ఈ దెబ్బలాట.

మధు: అప్పుడే అర్ధరాత్రయిందన్న మాట. అబ్బ! మరిఇంకా ఈ ప్రోగ్రాము ఎందుకవలేదో!

పద్మ: అంతేగాని, మీరు మాత్రం రేడియో తగ్గించి పెట్టుకోరన్న మాట.

మధు: అలా ఎన్నటికీ జరగదు. జరగబోదు. కావలిస్తే నీవుకూడా నీరేడియోని మరింత గట్టిగా పెట్టుకోవచ్చును.

పద్మ: సరే అలాగేలెండి (పద్మ కసికొద్దీ రేడియో పూర్తి వాల్యూం పెట్టేసింది.) (నవ్వుతూ) ఎలావుంది యిప్పుడు?...

మధు: ఏయ్‌పద్మా! ఏమిటి నీ అల్లరి? ఎవరేనా ఏమనుకుంటారు? ఇదో దెయ్యాల కొంప, ఈ యింట్లో వున్న వ్యక్తులు దెయ్యాలు అనుకోరూ..?

పద్మ: అనుకోనివ్వండి. మనం అంతకన్నా తక్కువవా!

మధు: ...............

పద్మ: (చివరికి ఓడిపోయి) ఇదిగో నేను కూడ వాల్యూం తగ్గిస్తున్నాను కానీ మీరు కూడ తగ్గించి పెట్టుకోండి పుణ్యంవుంటుంది.

మధు: రైట్ అలా దారికిరండి. అంతే గాని మీరు స్లోగా పెట్టుకోండి, నేను హెచ్చుగా పెట్టుకుంటాను, అంటే వూరుకుంటానా?

పద్మ: ...............

మధు: ఇదిగో పద్మా...

పద్మ: ...............

మధు: ...నిన్నే...

పద్మ: ......

మధు: ...(చిరాగ్గా) నిన్నే...పలకవేం?

పద్మ: (శాంతంగా) ఆ ఏమిటే?

మధు: రేడియో కట్టేసి కాస్సేపు యిలా రా?...మాట.

పద్మ: నేను రాలేను. అంతగా అవసరమయితే మీ రేడియో కట్టేసుకుని యిటు రండి.

మధు: ...అదికాదు. మంచిమాట...

పద్మ: అబ్బ! ఏమిటో చెబుదురూ, నన్ను విసిగించక...

మధు: (నవ్వుతూ) ఆ రేడియో కట్టేసిరా. చెబుతాను.

పద్మ: అబ్బే! మరేంఫరవాలేదు చెప్పండి.

మధు: ఇదిగో నువ్వు కోపం తెచ్చుకోనంటే ఒకమాట చెపుతాను. వింటావా?

పద్మ: ముందు చెప్పండి. తర్వాత ఆలోచిద్దాం.

మధు: మరేం లేదుగాని ... నీ రేడియో అమ్మేయరాదూ...

పద్మ: ఏమిటి? నా రేడియోనా? ఏం! ఎందుకమ్మేయాలి? ... అది మీకేం అడ్డు వచ్చింది?

మధు: అబ్బే మరేంలేదు. రెండు రేడియోలు ఎందుకు ఒకయింట్లో, అందులో ఒకగదిలో. అందుకని ఒకటి అమ్మేద్దామని అలా అన్నాను.

పద్మ: అయితే మీ రేడియోనే అమ్మేయండి. నా రేడియోనే ఎందుకమ్మేయాలి? ఇది సొంతసొమ్ముతో కొనుక్కున్నది.

మధు: అది నిజమేలే పద్మా! నీది కొస్త ఖరీదు తక్కువదికదా! అది గాకపోయినా ఆకారంకూడా అట్టే బాగాలేదు. పైగా చిన్నదికూడాను. అందుకని అమ్మేద్దాం అన్నాను. అంతే మరోవుద్దేశ్యం ఏమీలేదు తెలుసా!...

పద్మ: అవును. మీ రేడియో మహా

అందంగా వుందిలెండి. అయినా మీది మీ స్నేహితుడిచ్చిన బహుమానం. ఏమీ కష్టపడనక్కరలేకుండా వచ్చింది కనుక అమ్మేసి ఆ డబ్బుతో ఏదయినా మరోటి కొనండి.

మధు : నీ లాయరు సలహాలు కోర్టులో చెబితే చెప్పావు కాని- యింటిదగ్గర అందులోను నాదగ్గర పనికిరావు పద్మా...

పద్మ: మహా మీ లెక్చరు కాలేజీలో ఇస్తే యిచ్చేరు కాని నాదగ్గర యివ్వకండి. అయితే యింతకీ ఏమంటారు? నా రేడియో అమ్మేయమంటారు. అంతేనా! అయితే వినండి. అలా ఎన్నటికీ జరగదు. జరగబోదు. ఇక మీతో వాదన అనవసరం. నేపోయి పడుకుంటున్నా. నిద్రవస్తే మీరుకూడ ఆ లైటు ఆర్పి తలుపేసి పడుకోండి.

(పద్మ గిరుక్కున వెనక్కి తిరగి చూడకుండా గదిలోకి పోయి తలుపు వేసుకుంది.)

మధు-పద్మా...యిదుగో మాట...అబ్బ! చీటికి మాటికీ ఈవిడగారి కోపం ప్రాణం తీసేస్తోంది. పోనీ! తన రేడియో యే అమ్మేస్తే. నిజమే! మూర్తి ఎలాగు రేడియో కొనాలన్నాడుగా! రే ప్రొద్దుట వాడికి పంపిస్తే సరి......(ఆవలించి) అబ్బ! నిద్ర ముంచుకొస్తోంది.

(గదిలోకిపోయి తలుపేసిపడుకుంటాడు.)

* * *

[మర్నాడు]

మధు-పద్మా......

పద్మ-ఏం.

మధు-రాత్రి సరిగా నిద్రపటలేదా దేవిగారికి, కళ్ళు ఎర్రగా వున్నాయి. అయినా ఒంటరిగా అలా కోపగించి పడుకుంటే మాత్రం నిద్రపడుతుందా! నాకు తెలీదూ...

పద్మ-తమకి మాత్రం కళ్ళు ఎర్రబడలేదా ఏమిటి? మరి తమరి మాటేమిటి.

మధు-పోనీలే. అయించేదో అయిపోయిందిలేగాని ఈ రోజుకి కోర్టుమానేసి హాయిగా పడుకో....

పద్మ-అలాగే. తమరి ఆజ్ఞ.

మధు-అది సరేగాని. పద్మా! కాస్త తొందరగా కాఫీ కాచి యిలా యివ్వు. అర్జంటుగా ఒక పనిమీద వెళ్ళాలి.

పద్మ-ఇంత ప్రొద్దుటే ఎక్కడికండి?

మధు-అలా అడుగకూడదు తెలుసా!

పద్మ-ఓహో! సరే యిదిగో...

మధు-నేఅలా పోయివస్తాగాని, తలుపేసుకో...(వెళ్ళి పోతాడు.)

పద్మ-ఒసేయి రంగీ!...ఈ రేడియో, ఈ చీటీ విమలమ్మగారికి యివ్వు. ఏం. జాగ్రత్త!

రంగి-అలాగే నండమ్మా.

పద్మ-హమ్మయ్య! యిక ఆయనతో ఎలాంటి పేచీలు వుండవు. బాబూ!

(కొంతసేపైన తరవాత మధు తిరిగివచ్చి)

మధు-వెంకన్నా...ఇదిగోరా రేడియో ఈ గదిలో వుందిగాని జాగ్రత్తగా తీసికెళ్ళి మళ్ళీ రెండు రోజుల్లో యిచ్చెయ్యాలని మీ అయ్యగారితో చెప్పు సుమా....

వెంకన్న - అలాగేలెండి ... వస్తానండి బాబూ...(వెళ్ళిపోతాడు.)

మధు - పద్మా! ఈ రెండు రోజులు నీ రేడియో పెట్టుకోవటానికి పర్మిషన్ కావాలి. నా రేడియో నా ఫ్రెండు ఒక రెండురోజులు కావాలంటే యిచ్చాను. పర్మిషన్ యిస్తావా......అరె! రేడియో యేదీ?...

పద్మ - ఆ...నా రేడియో నిన్న మీతో వాదనవేసుకుని గట్టిగా పెట్టిన కారణంగా పాడయి రిపేరుకి వెళ్ళింది.

మధు - అలాగా...బాగానే వుంది.

[2 రోజులు తరువాత]

మధు - పద్మా! రేడియో ఏ షాపులో ఇచ్చావు రిపేరుకి. రెండు రోజులయి పోయింది. ఇంకా తీసుకురాలేదేం?

పద్మ - ఏమోనండి. ఈ పాటికి బాగయిపోయే వుంటుంది, కాని తీసుకు రావడానికి బద్ధకించి వూరుకున్నాను. రేపో ఎప్పుడో వెళ్ళి తెచ్చుకోవాలి...అది సరేగాని మీ ఫ్రెండు రేడియో యిక యిచ్చేట్టుగా లేదేమిటి?

మధు - పద్మా! నువ్వు నిజంగా అమాయకురాలివి తెలుసా!

పద్మ - ఏం?......

మధు - నేను నా రేడియోని నా ఫ్రెండుకి

(48-వ పేజీ చూడండి)

# సహాయం

## అందే నారాయణస్వామి

అప్పుడు మధ్యాహ్నం పన్నెండు గంటలవుతుంది. జానకిరామయ్య పెద్ద బజారు నే నడిచి వెళుతున్నాడు. అది భాద్రపద మాసం. వానలు కురిసినప్పుడు కురిసినా, ఆవాళ ఎండ చురుగ్గా కాస్తున్నది. బజారు అటూ యిటూ రెండుపక్కలా దుకాణాలు. కొన్ని దుకాణాలు తలుపులుమూసి భోజనానికి వెళ్ళారు. కొన్ని దుకాణాలు తీసి వున్నవి. జానకిరామయ్య అట్లా నడుస్తూ "ఓరి! వీడి తస్సాదియ్యా! మళ్ళా కొట్టు పెట్టాడే!" అనుకున్నాడు. ఆకొట్టు ఆసామి అప్పోయ్ తనపని అయిపోయిందంటూ బాకీదార్లకు రూపాయికి పావలాలిచ్చి కొన్నాళ్లు కొట్టు కట్టివేసి మళ్ళా జోరుగా వ్యాపారం చేస్తున్నాడు.

జానకిరామయ్య పక్కవీధి మలుపు తిరిగాడు. ఆ మొత్తవున్న గడియారాల షాపులో యెవరో ఘర్షణ పడుతున్నారు. జానకిరామయ్య తలవంచుకుని నడిచి పోతున్నాడు. ఆవీధిలో షాపులేమీ లేవు. అన్నీ కాపురం చేసేయిళ్లు. ఇళ్లముందు బిచ్చగాళ్లు తినగా మిగిలిన మాడో మెతుకో వెయ్యమని గోలపెడుతున్నారు. జానకిరామయ్య ఆగల్లీ మలుపు తిరిగి కోనేటి వీధినే నడుస్తున్నాడు.

అది పెద్దకోనేరు. బజారును అనుకొని వున్నది. అట్లా వెళ్తున్న జానకిరామయ్యకు అవతలి వైపునుంచి "మనిషి పడ్డది! మనిషి పడ్డది!" అని హాహాకారాలు వినరాగా చప్పున ప్రక్కగా రెండడుగులు వేసి కోనేరుకేసి చూశాడు. ఎవరో స్త్రీ నీటిలో పడి మునకలు వేస్తున్నది. అది చరిత్ర ప్రసిద్ధమైన క్షేత్రం. కొండమీద పానకాల స్వామిని దర్శించుకోడానికి ప్రతి రోజూ యెక్కడెక్కడనుండో యాత్రికులు వస్తూవుంటారు. వచ్చిన యాత్రికులు వేళాపాళా అనేది లేకుండా యెప్పుడు వస్తే అప్పుడు ఆకోనేట్లో స్నానాలు చేస్తూ వుంటారు. అప్పుడు జానకిరామయ్య వెనకా ముందూ చూడకుండా గబగబా కొన్ని మెట్లుదిగి చొక్కా వుత్తరీయం అక్కడ పడవేసి, అందులో నిర్మించిన ఆంజనేయస్వామి గుడిమీద నుంచి అమాంతంగా నీటిలో వురికి ఆస్త్రీని ఒడ్డుకు చేర్చాడు. ఇంతలో వీధినే అటువెళ్లేవాళ్ళు, ఇటు వెళ్ళేవాళ్లు అక్కడ చేరుకున్నారు. ఒడ్డుకు చేర్చిన స్త్రీని మెట్టు మీద పడుకోపెట్టారు. పడ్డవెంటనే తియ్యడం వల్ల ఆ స్త్రీ నీళ్ళెక్కువ తాగలేదు. ఉపచారాలు చెయ్యగా కళ్ళువిప్పి చూసింది. జానకిరామయ్య సంతోషానికి మేరలేదు. ఒక ప్రాణి తనచేత రక్షింప బడ్డందుకు జానకిరామయ్య హృదయం ఆనందంతో నిండిపోయింది. అక్కడవున్నవాళ్ళంతా జానకిరామయ్య సాహసాన్ని మెచ్చుకున్నారు. ఇంకా కొంతసేపటికి ఆస్త్రీ లేచి కూర్చుంది. "ఏవూరమ్మాయి మీది?" అని అడిగాడు జానకిరామయ్య.

"నరసరావుపేట" అన్నదీహీనస్వరంతో. ఆ అమ్మాయి, ఆయాస పడుతూ, సరిగా మాట్లాడలేక పోతున్నది. అక్కడవున్న వాళ్ళు కొన్ని ప్రశ్నలు అడిగినా చెప్పలేక పోయింది. చూస్తే ఆ అమ్మాయి సాయంత్రానికిగాని సరిగా తేరుకునేటట్లు కనబడ లేదు. అప్పుడు జానకిరామయ్య "ఇది పరస్థలం, యిక్కడ నీకెవరమ్మా? మాయింటికి వెడదాం" రమ్మని ఆ అమ్మాయిని బండి మాట్లాడి యెక్కించుకుని తన యింటికి తీసుకెళ్లాడు.

వాకిటిముందు బండి నిల్చింది. ఆ అమ్మాయి బండిదిగి జానకిరామయ్య వెనకాలే యింట్లోకి మెల్లిగా అడుగులు వేస్తూన్నది. అది పెంకుటి యిల్లు. ముందు వసారా. యింటి ముందు వున్న తాటాకు పందిరికి పన్నజాజులచెట్టు అల్లుకుంటున్నది. వసారాలో జానకిరామయ్య భార్య జయలక్ష్మి తీరిగ్గాకూర్చుని మాదితో బట్టలు కుడుతున్నది. జానకిరామయ్య ఆ అమ్మాయిని వసారాలోకి తీసుకెళ్ళి భార్యతో ఇవాళ "యీ అమ్మాయి చచ్చి బ్రతికింది! కాలుజారి కోనేట్లో పడిపోయింది. యింకా కాస్త ఆలస్యం అయితే దక్కేదికాదు. అదృష్టవంతురాలు. వెంటనే దూకి పైకి తీశాను" అని చెప్పాడు.

జయలక్ష్మి జాలిగా "అయ్యో! పాపం!" అన్నది. జానకిరామయ్య దగ్గరగా ఆ అమ్మాయి నీరసంగా నిలబడి వుంది. ఆ అమ్మాయిని యెక్కడో చూసినట్టు వుండడం వల్ల జయలక్ష్మి ఆ అమ్మాయికేసి పరకాయింపుగా చూస్తున్నది. కాసేపట్లో ఆమె కళ్ళు మెరిసినవి. "మీ అమ్మపేరు రుక్మిణి కదు అమ్మాయీ?" అని అడిగింది.

"ఊఁ" అన్నది నీరసంగా ఆఅమ్మాయి.

"నువ్వటే నా తల్లీ! యివాళ నీకు యెంత గణ్ణం తప్పింది! మీ అమ్మావాళ్లు ఏ వూళ్ళో వుంటున్నారు?" అని అడిగింది జయలక్ష్మి.

"నరసరావుపేటలో"

"అట్లాగా! మా పుట్టిల్లు తాడికొండ. మీరు తాడికొండలో వుంటున్నప్పుడు మీ అమ్మకూ నాకూ యెంతో స్నేహం. నువ్వూ మీ అమ్మ కలసి మావాళ్ల యింటికి యెన్నోసార్లు వచ్చారు! నన్ను మర్చిపొయ్యావా? నీ పేరు ఇందిర కదు?" అని అడిగింది.

ఆ అమ్మాయి ముక్తసరిగా "ఊఁ" అన్నది.

"మీరు అక్కడినించి వెళ్ళిపొయ్యాక లేదుగాని అదివరకు మీ అమ్మకూ నాకూ యెంతో స్నేహం. మీ అమ్మ 'మా ఇందిరకు పెళ్ళి చెయ్యాలి. మంచి సమ్మంధాలు దొరకడంలేదని యెప్పుడూ నీ సంగతే చెపుతూ వుండేది. నీ పెళ్ళి ప్రయత్నాలు జరుగుతూ వుండగానే మీ నాన్నకు అక్కడి నుంచి బదిలీఅయింది — పాపం! బిడ్డ మాట్లాడలేకుండా వుంది! నీటిలో పడడం వల్ల ప్రాణం యెంత దిమ్మరపోయిందో!" అంటూ జయలక్ష్మి ఆ అమ్మాయిని యింట్లోకి తీసుకెళ్ళి తన చీర యిచ్చి వంటిమీద వున్న తడిబట్టను విడిపించి అక్కడనే మంచం వాల్చి "పడుకో అమ్మా! యెంత హైరానా పడిపొయ్యావో!" అనగా ఆ అమ్మాయి మంచంమీద పడుకున్నది.

"అయితే అమ్మా! నువ్వు వస్తున్నది అత్తవారింటి దగ్గర్నించా? పుట్టింటి దగ్గర్నించా?" అని అడిగింది.

"పుట్టింటి దగ్గర్నించి"

"అయితే నీ వెంట మీ అమ్మగానీ, బంధువులుగాని యెవరూ రాలేదా?" అని అడిగింది.

"ఊఁహూఁ"

"అట్లయితే మీ అమ్మ యిరుగుపొరుగు వాళ్ళు వస్తూవుంటే జతచేసి పంపిందన్నమాట! యిదేం చోద్యమమ్మా! వెంట పంపిన వాళ్ళు యెంత జాగ్రత్తగా వుండాలి వదిలి పెట్టి వూరుకోడమేనా! అసలే కోనేరు మెట్లు పాచిపట్టి వుంటవి, వురికితే కాలు జారుతుంది" అంటూ ఆ అమ్మాయికి బిడ్డకంటే యినుమిక్కిలిగా వుపచారం చెయ్యడం మొదలుపెట్టింది. అదంతా చూస్తున్న జానకిరామయ్య అనుకోని ఆ బాంధవ్యానికి

ఆనందపడిపోయ్యాడు. జయలక్ష్మి ఆఅమ్మాయికి వేడివేడి జావకాచి యివ్వడంవల్ల కొంత కునుకుపట్టగా, వసారాలోకి వచ్చి ఆ అమ్మాయిని గురించే తలపోసుకుంటూ తాను వదిలివెళ్ళిన కుట్టుపని పూర్తిచెయ్యడం మొదలుపెట్టింది. జానకిరామయ్యవసారాలో భార్యపక్కగా మంచం వేసుకుని నడుం వాల్చాడు.

ఇంతలో పోస్టుజవాను వచ్చి ఉత్తరం యిచ్చి వెళ్ళిపోయ్యాడు. జానకిరామయ్య చూసుకోగా అది దుగ్గిరాలనించి కూతురు వ్రాసినది. ఏదో తొందరలోవుండి వ్రాసినట్టుగావుంది. రెండుమాటలు వున్నవి.

"ప్రియమైన నాయనగారికి, నమస్కారములు

నా సవతి చనిపోయింది. అందువల్ల మాకు కొన్ని చిక్కులు యేర్పడ్డవి. ఆయనగారు కుప్పకూలి కూర్చున్నారు. ఈ ఉత్తరం చూసిన తక్షణం నీవు రావలెను.

ఇట్లు,
సుశీల."

ఉత్తరం చదువుతుంటే జయలక్ష్మి "యెక్కడివండీ ఆ ఉత్తరం?" అని అడిగింది. జానకిరామయ్య "అమ్మాయి వ్రాసింది." అని భార్యకు ఉత్తరం చదివి వినిపించి, "చస్తేయేమో! ఇతడు కుప్పకూలి కూర్చోడం దేనికో! చిక్కులు కలిగినవని వ్రాసింది ఏమిటో ఆ చిక్కులు?" అన్నాడు.

"వెళ్ళిరాండి అదేమిటో తెలుస్తుంది. బిడ్డ నీళ్లుపోసుకుందని యెప్పుడు తీసుకురావాలన్నా పడడమేలేదు." అన్నది.

అప్పుడు మూడుగంటలవుతుంది. మంగళగిరినించి దుగ్గిరాలకు రెండుగంటల ప్రయాణం. నాలుగు గంటలకు బండివుంది. మంగళగిరి స్టేషనులో యెక్కితే చుట్టూతిరిగి పోవాలి. దాపులోవున్న పెద్ద వడ్లపూడిలో రైలెక్కితే సులభంగా చేరవచ్చు. అక్కడనుంచి అటువైపు వెళ్లేవాళ్ళంతా ఆమార్గానే వెళతారు. అక్కడ వడ్లపూడికి ప్రతిబండికీ జట్కాలు సిద్ధంగావుంటవి. జానకిరామయ్య చొక్కా ఉత్తరీయం వేసుకొని బయలుదేరి వడ్లపూడిమీదగా దుగ్గిరాల చేరుకొన్నాడు. స్టేషనునుంచి కూతురుగారి యిలు చేరుకునేసరికి సందెపండింది. జానకిరామయ్య లోనికి వెళ్ళిచూస్తే హాల్లో యెవరూలేరు. అల్లుడు ఆవూళ్లో వుద్యోగం చేస్తున్నాడు. రెండు వందలజీతం, హాల్లో కుర్చీలు ఖాళీగావున్నవి. సరాసరి వంటగదిలోకి వెళ్లాడు. కూతురు అక్కడ యేదో పనిచేస్తున్నది. వచ్చిన తండ్రినిచూసి "వచ్చావా నాన్నా!" అంటూ కుర్చీ తెచ్చి వేసింది. అతడు కూర్చున్నాడు. సుశీలముఖం యెన్నాళ్ళనాడో అన్నం తిన్నట్టు వాడిపోయివున్నది. "ఏమిటమ్మా అర్జంటుగా రమ్మని రాశావు?" అన్నాడు.

సుశీల ఆవేదనగా "అవును నాన్నా! యెంత యిది జరిగింది! నా సవతి చనిపోయింది. అసలే వాళ్ళకూ, వీళ్ళకూ సరిపడదాయె, పుట్టింటివాళ్లు మా పిల్లను మాకు చూపించమని మాయింటిమీదకు వచ్చారు. పెద్దరగడ జరిగింది. ఈయనగారు కుప్పకూలి కూర్చున్నారు." అని చెప్పింది.

"మీసవతి పుట్టింటివద్దనే వుంటున్నదిగా! ఇక్కడికి యెట్లావచ్చింది?" అని అడిగాడు.

"దాదాపు నెలరోజులక్రిందట ఒకనాటి వుదయం నాసవతి కూలివాడిచేత ట్రంకు పెట్టె మోయించుకుని లోపలకు వచ్చింది. అప్పుడు వారు యింటివద్దలేరు. ఆఫీసుకు వెళ్ళారు. ఆమె లోనికివచ్చి కూలివాడికి డబ్బుయిచ్చి పంపి యెంతో స్వతంత్రం వున్న యిల్లులాగా పెరట్లోకివెళ్ళి తానే చెంబుతో నీళ్ళుముంచుకుని కాళ్ళు కడుక్కొని నేనువున్న వంటగదిలోకి వచ్చింది. అప్పటికి ఆమె యెవరో నాకు తెలియదు"

జానకిరామయ్య అడ్డువచ్చి "మనకేం తెలుసు? ఎప్పుడన్నా వాళ్ళముఖం ఎరుగున్నాంగనకనా!" అన్నాడు సుశీల చెప్పుకుపోతున్నది. "అప్పుడు ఎవరా యీ చుట్టం అని తెల్లపోయి ఆమెకేసి చూస్తుంటే ఆమె నన్ను పలకరించి ఫలానా అని చెప్పింది. అప్పుడు నేను కూర్చో అక్కా అని కుర్చీ వేశాను. ఆమె కూర్చోలేదు. చిరపరిచయములతో మాట్లాడినట్టు 'శాలీ! పుటింటివద్ద వుంటే ఆడదానికి యేం గౌరవం? అంతా తేలిగా మాట్లాడుతారు. ఆఖరకు పుటింటి వాళ్ళకు గూడా వెక్కసమైపోతాం! యెక్కడ పడ్డామో అక్కడే దేవులాడుకోవాలి' అంది. 'నిజమేఅక్కా' అన్నాను.

అక్క యెంతమంచిది నాన్నా! ఇంటి పనులు అందుకుని నాకు సహాయంచెయ్యడం మొదలుపెటింది. పన్నెండు గంటలకు వారు యింటికి భోజనానికి వచ్చారు. అక్కను చూసి ఆయన అదేమి అని అనలేదు. రోజూ భోజనంచేసి కాసేపు విశ్రాంతి తీసుకునే వారల్లా ఆవాళ భోజనంచెయ్యగానే ఆఫీసుకు వెళ్ళిపోయారు."

'మంచి పని చేశాడు' అనుకున్నాడు జానకిరామయ్య మనసులో. సుశీల చెప్పుకొంటున్నది.

అప్పటినుంచి రోజూ వేళకువచ్చి గొంతులో మెతుకులు వేసుకుని వెళ్ళి రాత్రికి ఇంటికి వచ్చేవారు. ఒకరోజున వారు ఉదయానే పెరట్లో స్నానంచేస్తున్నారు. నేను యేదో పనిమీదవున్నాను. అప్పుడు అక్క వారికి వళ్ళుతుడుచుకోవడానికి తుండుగుడ్డ తీసుకెళ్ళి యివ్వబోయింది. ఆయన పుచ్చుకోలేదు. నీళ్లు కారుతూనే ఆయన లోనికివచ్చి మరో తుండుగుడ్డ తీసుకుని వళ్ళు తుడుచుకున్నారు. అప్పుడు అక్క భోరుమని యేడుస్తూ 'మీకూ మీకూ కక్షలు వుండవచ్చు. నే నేం చేశాను? నావల్ల అపరాధం ఏమిటి చెప్పండి? మీకే కావాలని వాళ్లను వదలుకుని వచ్చాను. మీరు మరో పెళ్ళి చేసుకున్నారనిగూడా నాకు యెంతమాత్రం లేదు.' అని వాపోయింది. ఆయన చలించలేదు. ఈ నెలరోజుల్లో వారిని ప్రసన్నం చేసుకోవాలని అక్క విశ్వప్రయత్నం చేసిందిగాని లాభం లేకపోయింది."

'బుట్టలో వేసుకోవాలంటే ఎలా వీలవుతుంది' అనుకున్నాడు మనసులో జానకిరామయ్య. అప్పటికి ప్రొద్దుకూకడంవల్ల సుశీల స్విచ్చి వేసి లైట్లు వెలిగించి చెప్పసాగింది.

"అక్క రెండురోజులకు చచ్చిపోతుందనగా ఆమె మెళ్ళోవున్న బంగారంగొలుసు తీసి నామెళ్ళో వేసింది. 'ఎందుకులే అక్కా' అని నేనగా 'తీసుకుంటాలే చెల్లీ వుంచు' అన్నది. ఆసాయంత్రం నేను పొయ్యి దగ్గర కూర్చుని గారెలు వండుతున్నాను. అక్క తడిగుడ్డమీద గారెలుచేసి నాకు అందిస్తున్నది. అక్క రోట్లో పిండంతా రుబ్బుకొచ్చింది. అట్లా గారెలుచేసి నాకందిస్తూ 'చెల్లీ నీకు అమ్మాయి పుడుతుందో, అబ్బాయి పుడతాడో మరి. పాపను నాకు చూసుకునే యోగ్యతవున్నదో లేదో' అంది. ఆమాటలు అంటూంటే ఆమె కళ్ళు చెమ్మగిల్లినవి. అప్పుడు నేను 'అదేమిటి అక్కా అట్లా అంటావు. నువ్వు లేకుండా ఏదిజరుగుతుంది'



# సవతి



అన్నాను. ఆ మర్నాడు రాత్రి వాడుక ప్రకారం మేము గదిలో పడుకున్నాము. అక్క హాల్లో పడుకున్నది. అప్పుడు పన్నెండు దాటుతుంది. తలుపు తీసుకుని బయటికి వచ్చాను. అక్క కూర్చుని యేడుస్తున్నది. నన్ను చూసి నేనేమన్నా అనుకుని పోతానని అక్క యేమీ ఎరగనట్టు పడుకున్నది. నామతి మన్నుగాను! అప్పుడైనా ఆమెను ఓదార్చి మనసు మళ్ళించాను కాను. ఇంతకీ నాకాబుద్ధి పుట్టలేదు. ఇది జరిగి యివ్వాళకు నాలుగు రోజులేమో అవుతుంది అంతే. ఆ ఉదయం చూస్తే అక్క యింట్లో లేదు. ఎక్కడకైనా వెళ్ళిందేమో అనుకున్నాను. ఆ సాయంత్రం వరకూ రాలేదు. పుట్టింటికి వెళ్ళిందని అనుకుందామంటే ఆమె గొలుసు నామెళ్ళోనే వున్నది. ఆమె ట్రంకుపెట్టె కూడా యిక్కడే వున్నది. ఎట్లా వెళుతుంది? నాకూ అనుమానం హెచ్చింది. ఆ మర్నాడు అక్క కాలవలో పడ్డదని చూసినవాళ్ళు చెప్పారు. నాకు దుఃఖం ఆగలేదు. ఈ సంగతి గ్రామమంతా అట్టుడికినట్టు వుడికిపోయింది. అక్క యెంతమంచిదనుకున్నావు నాన్నా? మరచినా మరపురావడం లేదు. నేను పొట్టి మనిషిని కానని, నన్ను యేపని ముట్టుకోనిచ్చేది కాదు. ఇక్కడ వున్నన్నాళ్ళు ఇంటిపనులన్నీ తానే చేసింది"

జానకిరామయ్య అడ్డువచ్చి "ఏంచేస్తావమ్మా? ఇటువంటివి జరుగుతూవుంటవి. మీ సవతి పడాలనిపడ్డదా! ఇవాళ మనవూళ్ళో ఒక అమ్మాయి కోనేట్లో స్నానం చేస్తూ, బిల్లీటుగా నీట్లోపడిపోయింది. సమయానికి నేనటువెళుతూ దిగి తియ్యబట్టి సరిపోయింది గాని లేకపోతే యేముంది?" అన్నాడు సగర్వంగా.

"ఆయువనేది వుంటే ఎవరైనా అట్లాగే తటస్తపడతారు. అక్క చచ్చిపోయిందన్న వార్తవినేసరికి వారు కుప్పగూలిపోయ్యారు. ఎట్లయినా మనసనేది నిలుస్తుందా? ఆఫీసుకు గూడా వెళ్ళడం మానివేశారు. ఈ సంగతి తెలిసి అక్క పుట్టింటివాళ్ళు వుద్రేకంతో మాయింటిమీదకువచ్చి 'పిల్లను ఏంచేశారు? దానిదగ్గర నగలన్నీ అపహరించి గొంతుపిసికి కాలవలోపారేస్తారా? యిరవైశవర్లకై దాని దగ్గర నగలున్నవి. ఇది వూరికేపోతుందనుకున్నారా?' అని కేకలు వేసి వెళ్ళారు. అసలే వాళ్ళకూ వీళ్ళకూ సరిపడదు. కక్షతీర్చుకునేటందుకు వాళ్ళకు అదనుచిక్కింది. వాళ్ళు కేసుపెట్టారని తెలిసిందినాన్నా! కొంపమునిగేటట్టువున్నది మాస్తే! అక్క గొలుసు నాదగ్గరేవున్నది." అంటూ పెట్టెలోనించి గొలుసు తెచ్చి తండ్రికిచూపించింది. జానకిరామయ్య గొలుసును పరకాయించి చూసి "దీనిమీద వాళ్ళ పేరుగూడ వుందమ్మా! ఇది గనక వాళ్ళకు చిక్కిందంటే కొంపమునుగుతుంది! అధికారులకు చెవులేగాని కళ్ళెక్కడివి? దున్నపోతు యీనిందంటే గాటకట్టెయ్యమంటారు! మీరుజాగ్రతగా వుండటం అవసరం! ఇంతకీ రాఘవరావు యేమంటాడు?" అన్నాడు.

"అదిగో ఆగదిలో కూర్చున్నారు" అన్నది సుశీల.

* * *

రాఘవరావు గదిలో ఏకాంతంగా కూర్చుని మథనపడుతున్నాడు. భార్య మరణవార్త వినగానే అతనికి కనువిప్పుఅయింది. అతనిలో మానవత్వం మేలుకుంది "మీకూ మీకూ కక్షలువుంటే నేనేంచేశాను? నావల్ల అపరాధమేమిటి?" అని ఆరోజున ఆమెఅన్న మాటలు అతనిచెవుల్లో గింగురుమంటున్నవి. తన తప్పులన్నీ కళ్ళకు కట్టినట్టుకనపడసాగినవి. డబ్బుకోసం ఒకఅమాయికను బలిచేశాడు! త్రికరణశుద్ధిగా తననే నమ్ముకున్న అర్ధాంగిని పాటను పెట్టుకున్నాడు! తనను ప్రసన్నని చేసుకోవాలని ఆమెఎంత మొర పెట్టుకున్నా పెడచెవిని పెట్టాడు! అతనిమనసు పరిపరి విధాల పోసాగింది.

జానకిరామయ్య గదిదగ్గిరికి వచ్చిచూస్తే తలుపు వోరగా వేసివున్నది. తలుపు నెట్టుకుని లోనికివెళ్ళి యేదో ఆలోచిస్తూ మంచంమీద కూర్చునివున్న అల్లుడిసరసనకూర్చుని "ఏమిటి యిదంతా? మొన్న వాళ్ళు యింటిమీదికి వచ్చారటగా! దాన్ని గురించి ఏం ఆలోచించావు?" అని అడిగాడు.

"ఇంకా యేమీ ఆలోచించలేదు" అన్నాడు రాఘవరావు.

"వాళ్ళేమో నగలుఅపహరించి గొంతుపిసికి కాలవలో పారేశారని కేసుపెట్టి తలకిందులు చెయ్యాలని కూర్చుంటే మనం కొస్త ముందుగా జాగ్రత్తపడకపోతే యెట్లా?" అన్నాడు జానకిరామయ్య.

"అదే ఆలోచిస్తున్నాను" అన్నాడు రాఘవరావు.

"ముందుగా మేలుకోవాలిగాని నెత్తిమీదికివచ్చాక అనుకుంటే యేంలాభం? తెలిసినవాళ్ళను ఎవరైనా అడిగి మనజాగ్రత్తలో మనం వుండాలి" అన్నాడు జానకిరామయ్య.

"నావొంట్లో బాగుండలేదు. మీరు కొస్త—" అని వాక్యాన్ని మధ్యలో ముగించాడు రాఘవరావు.

అంతటితో జానకిరామయ్య బయటకు వచ్చేశాడు. కూతుర్ని పిలిచి "అతడు శ్మశాన వైరాగ్యంలో వున్నాడు! అతని కేమీ పట్టినట్టులేదు! నామీదే వదిలాడు. ఇదంతా చూస్తే, చుట్టమై చూడొచ్చి దయ్యమై పట్టినట్టుగా వుంది! తలవని తలంపుగా ఆవిడ రావడం ఏమిటి? ఇట్లా జరగడం ఏమిటి?— పెదనాన్న కొడుకు శేషగిరిరావు గుంటూర్లో ప్లీడరుదగ్గర గుమాస్తాగిరిచేసి ఇప్పుడు మన వూళ్ళో బాగా ప్రయివేటు చేస్తున్నాడు. ఇటువంటి విషయాలు బాగా తెలుసు. వాడిని అడిగితే అంతా చెప్పేస్తాడు. చూస్తే నువ్వుగూడ ఏదో బెంగగా వుంటున్నావు. రెండు రోజులు వుండి వద్దువుగాని రామ్మా! నీకు మనశ్శాంతిగానూ వుంటుంది. అక్కడ శేషగిరిరావు అన్నయ్యను అడిగినట్లూ వుంటుంది" అన్నాడు.

ఆ మర్నాడు వుదయానే అల్లుడితో చెప్పి కూతుర్ని తీసుకుని బయలుదేరాడు. వడ్లపూడిలో దిగి ఇద్దరూ గుఱ్ఱబండి ఎక్కి ఊరు చేరుకునేటప్పటికి వుదయం పదిదాటింది. ఊరి వెలపల హరిజనగూడెం, రామమందిరం దాటి బండి బజారునేపోతున్నది. బండి వాళ్ళ ఇంటిముందు ఆగింది. ఇద్దరూ బండి దిగి లోనికి అడుగులు వేస్తున్నారు. సుశీల కళ్ళు ముందుగా పందిరికి అల్లుకున్న సన్నజాజి చెట్టుమీదకి పోయినవి. చెట్టునిండా మొగ్గలు చాలావున్నవి. ఆ చెట్టును తానే వేసి పెంచింది. తాను పుట్టింటివద్ద వున్నన్నాళ్ళు ప్రతిరోజూ పూలుకోసుకుని తల్లో పెట్టుకునేది. సుశీల పందిరిదాటి వసారా ఎక్కింది. అక్కడ జయలక్ష్మి, ఇందిర కూర్చుని వున్నారు. సుశీల ఇందిరను చూసేసరికి కళ్ళు తెలియని సంతోషంతో "అక్కా" అని వెర్రికేక పెట్టింది. జానకిరామయ్య, జయలక్ష్మి విస్తుపోయి శిలాప్రతిమల్లా చూస్తున్నారు. సుశీల "దేవుడు రక్షించాడు అక్కా!" అని దణ్ణదణ్ణాలు పెట్టింది.







# విక్రమార్కుడి మార్కు సింహాసనం

చలనచిత్ర కథలు



ఎస్. పార్థసారథి

భయపడ్డ కోడిలా ఉన్న రాజు తాలూకు చూపుల చివర, ఆశ్చర్యపడ్డ కోడిలా ఉన్న కోటయ్య అనే శాల్తీ నించునిఉంది.

రాజు వాటంచూడగా కోటయ్యకు కోపంవచ్చింది. "ఏందది అట్టా చూస్తా. నాకేం నెత్తిన కొమ్ములు మొల్చినయ్యా?" అన్నాడు విసురుగా.

'యస్సార్. మరేంది ...రెండు...రెండున్నాయి' అన్నాడు రాజు కొంచెం జంకుతూనే.

కొలంబస్ బుర్ర గబగబ పనిచేసింది. కొద్దినిముషాలలోనే, తన వెనక ఎవరో ఉన్నట్టు పసిగట్టేసింది. తక్షణం అతని తల వెనక్కి తిరిగింది. నోరు, అరె! అంది.

"ఏంది గురూ. నువ్వూ అరె అంటావు?" అన్నాడు కోటయ్య ఆశ్చర్యపడబోయి కుర్చీని పట్టుకుంటూ:

"యస్ బ్రదర్ ...నీ ఉత్తమాంగం ఉపరితలాన, పొగరెత్తిన గిత్తలయొక్క శృంగ ద్వయం—"

"ఈ యెదవవేసాలన్నీ మీబావదగ్గిరెయ్యి. డైలాగులన్నా రాయిస్తాడు పిచ్చరికి." అన్నాడు కోటయ్య నవ్వుతూ.

"లేదు బ్రదర్. నిజం. నీ నెత్తిన కొమ్ములు మొలిచాయి" అన్నాడు కొలంబస్.

ఇంక నమ్మకుండా ఉండలేక, తలతడిమి చూసుకున్నాడు కోటయ్య. ఎడా పెడా చెరో కొమ్ము తగిలాయి.

"హారినీ! అయిడియా వచ్చి గంటేనా కాలేదు; చేతికి వంకేనా అందలేదు-అప్పుడే కొమ్ములొచ్చేశాయి...వాట్ !" అని స్వగతంలో ఆశ్చర్యపోతున్నాడు కోటయ్య.

రాజూ, కొలంబస్ మాటాడలేదు.

ఇంక లాభంలేదని కోటయ్యే అందుకున్నాడు. "గురూ! నాదగ్గిర బ్రహ్మాండమైన అవిడియాఉంది. మీదగ్గిర డబ్బెంతుంది?" అన్నాడు.

'ఏం లేదు.'

'ధా. ఎక్కడి మనిషివయ్యా. సరే. నా అవిడియా చెప్పేస్తాగాని. వీరెవరు?"

"పేరు?"

'వీరే.'

'వీరా. వీరు మావాళ్లే.'

"అంటే? ఏ గ్రూపూ?"

'నీకెందుకూ?...నా గ్రూపేలే.'

'నా గ్రూపా!' అన్నాడు కోటయ్య ఆశ్చర్యంగా.

'నీ గ్రూపు కాదోయ్! నా గ్రూపు' అని స్పష్టపరచాడు కొలంబస్.

"అదేగురూ! నాగ్రూపా అంటా."

'అరె. మళ్ళీ అదేమాటా. నా గ్రూపు అని చెబుతూంటే నీకెక్కదు."

'ఏమో బాబూ, నీమాటలు నాకు తెలీటంలే. అంతా కంఫ్యూషన్‌గా ఉంది...ఏదైతేనేం గాని, మనసువిప్పి మాటాడచ్చా?"

కొలంబస్ ఉలిక్కిపడ్డాడు. "నాకు అర్జంటు పనుంది బ్రదర్. ఊరికే నేవచ్చాను."

'నాగూడా పనుంది. ఇహ ఉన్నదంతా పనే. కబుర్లకి తీరికెక్కడ. పెద్ద బిజినెస్ పెట్టబోతున్నా తెలుసా?'

'తెలీదు' అన్నాడు కొలంబస్ ముక్తసరిగా.

'అద్గదీ. అట్టాదారికిరా. ఎట్టాతెలుస్తుంది. అవిడియా పుట్టి ఇంకా గంటన్నా కాలేదు. ఇపుడే ప్రాసెసింగు చేసి—'

'సింగివరు. సార్' అన్నాడు రాజు కుతూహలం ఆపుకోలేక.

'ఈ భగవాన్లెవరోయ్' అన్నాడు కోటయ్య విసుగ్గా.

'ఆయనపేరు వి. రాజ్. హీరో వెయ్యబోతున్నాడు.'

'ఎందులో సార్' అని అడిగాడు రాజు మళ్ళీ కుతూహలం పటలేక.

'బ్రదర్! నీకు ఈ సీనులో పార్టు లేదు. అంచేత అడ్డురాకు నీ దవట ప్రశ్నలతో. ఊరికే ముఖంమీద ఫీలింగు పెట్టి రియాక్షను చేస్తూ ఉండు. అంతే' అని మందలించాడు కొలంబస్.

గ్రూపుసీనులో ఓవరాక్షన్ చేసి చీవాట్లు తిన్న చిన్న నటుడిలా చిన్నబుచ్చుకున్నాడు రాజు. అయినా, ఉత్సాహంతోనే వినసాగాడు.

'అంచేత. అదీసంగతి గురూ. అవిడియా ఇందాకనే వచ్చింది. పెద్దస్కీముకే. అలిండియా ప్లాను. ఇంక పెద్ద పెద్ద స్టార్లతో పిక్చర్లు తియ్యడం కష్టంకాదు. కాల్‌షీట్‌కి వాళ్లొచ్చారు వీళ్లు రాలేదన్న బెంగ ఉండదు. ఎట్టాచెప్పనా?' అన్నాడు కోటయ్య.

# ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

"తండ్రీ! వద్దంటే వదిలిపెడతావు గనకనా?...కాస్త త్వరగా తెమిలిస్తే అటు ఏడు, ఇటుఏడు మొత్తం 14 తరాలవాళ్ళు తరిస్తారు. కానీ. వన్ టూ..."

"ఏం లేదు. సింపుల్. ఇపుడు ఇండియాలో పెద్దస్టార్లగిరాకీ ఎక్కువగా ఉందిగదా. పెద్ద స్టార్లని బుక్ చేసుకుంటే, వాళ్ళు వేళకి రావటం లేదని అందరూ గోలపెడుతున్నారు గదా. నా అయిడియా ఏమిటంటే -"

"మహాప్రభో. నీ అయిడియా ఏమిటి అని నేను అసలు అనలేదు. అయినా నువ్వే చెబుతున్నావు. అయినా మళ్ళీ ఏమిటంటే అంటే - ఏమిటీ అంటా" అన్నాడు కొలంబస్.

"ఏం లేదు. సింపుల్. నేనో సిండికేటు పెడతాను. ఫలానా పిక్చరు అని లేకుండా, ఊరికే నే స్టార్లని బుక్ చేసివెయ్యడం. వాళ్లు వచ్చినపుడల్లా ప్రేమఘట్టాలూ, కొట్లాటలూ, ఏడుపుసీనులూ, డ్యూఎట్లూ, డాన్సులూ, క్లయిమాక్సుసీనులూ, తరమడాలూ, దొరకడాలూ ఇలాటివన్నీ షూటింగ్ చేసేసి అట్టే పెట్టేసుకోడం. అంధరివీ అన్నమాట. అంజలీ నాగేశ్వరావు, అంజలీ రామారావు, సావిత్రీ నాగేశ్వరావు, సావిత్రి రామారావు, సావిత్రి జగ్గయ్య, మళ్ళీ నేమో జానకీ, రామారావు, జానకి నాగేస్వరావు, దిలీఫ్, మధుబాల, దిలీప్ నూతన్, దిలీప్ అంజలీదేవి, దేవానంద్ కృష్ణకుమారి, అశోక్ కుమార్ సావిత్రి, కిశోర్ కుమార్ ఎం. ఎన్. రాజం, శివాజీగణేశన్ మీనాకుమారి, జెమినీగణేశన్ నరీన్ ఇలా రకరకాల జోడీలతో ఒకొక్క కథలోవచ్చే అన్నిరకాల సీనులూ తీసెయ్యడం. ఆనక, రేలంగి, తంగవేలు, ఆగా, జానీవాకర్ వీళ్ళందరితోనూ రకరకాల కామెడీ సీనులు తీసెయ్యడం. ఎవరేనా ప్రొడ్యూసరు సినిమా తియ్యాలనుకో మనదగ్గిరికి రావాలన్నమాట. 'సార్! ఎన్. టి. రామారావు, మీనాకుమారి, సుచిత్ర సేన్, రేలంగి, అంగముత్తు, తంగవేలు, సురభిబాలసరస్వతి, రంగారావు, పృథ్వీరాజ్ కపూర్, నటీనటులుగా ఒకచిత్రము నిర్మించబోతున్నాము"అని మనని అడుగుతాడనమాట. వో! యెస్సార్! అని చెప్పి, మనం ప్రేమసీనులు, నవ్వేవి, నవ్వించేవి, ఏడిచేవి, ఏడిపించేవి, కొట్టేవి, కొట్టుకునేవి ఇలాగ రకమునకు రెండుమూడు సీనులచొప్పున తీసిఇచ్చి, కావలసినవి వాడుకుని మిగతావి ఇచ్చెయ్యండిసార్ అంటాము. అపుడుఆ ప్రొడ్యూసరు ఒకఎడిటర్ చేత అవన్నీ కథలాగా చేర్పింపించి వాటికి డైలాగులూ అవీ రాయించుకుని, పేరుపెట్టిపిక్చరురిలీజుచేసెయ్యొచ్చు. ఇంకోటిసార్. ఇపుడు మనం ఇవన్నీ తియ్యడానికి డబ్బుచాలా కావాలికదా. అందుకని ముందరకొంచెం తెచ్చి, పాతపిక్చర్లు కొనేద్దాం. అవన్నీ కత్తిరించేసి, సీనులవారీగా వేరుచేసి, చక్కగా లైబ్రరీలా పేర్చిపెట్టుకుని బిజినెస్సు మొదలుపెట్టొచ్చు. పాతవాటిలో డ్యూయెట్ పాటలసీను లుంటాయనుకోండి. అక్కడ రెండుచరణాలకి మధ్యన ఆర్కెష్ట్రా వచ్చినప్పుడు ఉంటుందేం? అప్పుడు, ఆకాశం, పూలకుండీలు, కలవపువ్వులూ అవీ చూపిస్తారుగా. పెద్దపెద్ద డైలాగులు రాయించుకున్నవాళ్ళు, ఈసీనులలో పాటలుతీసేసి, డైలాగులు అమర్చుకోవచ్చు చక్కగా. ఇలా కొన్నాళ్ళయ్యేసరికి మనసిండికేటునికి, హాలీవుడ్ లోనూ, లండన్ లోనూ కొలంబోలోనుకూడా బ్రాంచీలు పెట్టేయ్యొచ్చును. దానికి కోటయ్యా అండ్,—సార్. మీ పేరేమిటి మర్చిపోయాను?"

'నా పేరు-నా పేరు కొలంబస్' అన్నాడు కొలంబస్ ఎందుకేనా మంచిదని.

'రెట్-కోటయ్య అండ్ కొలంబస్ పిక్చర్స్ సిండికేటు అని బోర్డులు రాయించెయ్యొచ్చు...అన్నట్టు మరే. మర్చిపోయాను. బోర్డులు రాయించాలికద్దూ. అర్జెంట్. యమర్జెంట్. ఒక ఐదువందలు ఉంటే ఇవ్వండి. ముందర బోర్డులు రాయించేస్తాను. ఆనక మనం కాంట్రాక్టులు రాసుకోవచ్చు."

"అక్కర్లేదు" అన్నాడు కొలంబస్ గంభీరంగా.

"వాట్!" అని చట్టువిరిగేలా ఆశ్చర్యపడ్డాడు కోటయ్య. 'కాంట్రాక్టు అక్కర్లేదంటారా. నామీద అంత దారుణమైన నమ్మకం ఉందన్నమాట. మీరు చాలా గొప్పవారు సార్. సర్లెండి అలాగే కాంట్రాక్టులు రాసుకోవద్దు. ఆరొందలు ఇవ్వండి. కంపెనీ బోర్డులు రాయిస్తాను.'

'అక్కర్లేదు' అన్నాడు కొలంబస్.

'ఏమిటీ? బోర్డులుకూడా వద్దంటారా. పబ్లిసిటీ చాలా ముఖ్యంఅండీ...అయినా మీరే రైటు...అంత ఖర్చెందుకు. నాలుగు వందలయాభై ఇవ్వండి.'

'లేవు' అన్నాడు కొలంబస్.

"ఆ? ఏమిటి?"

"ఇవ్వను."

"సార్...మీరు ఏదో ఒక మాట చెప్పండి. పొలిటిషియన్లా ప్రశ్నకి రెండేసి జవాబులిస్తే ఎట్లా? లేదా? ఇవ్వరా?" అన్నాడు కోటయ్య శాంతంగా.

"లేదు; ఉన్నా యివ్వను."

"పోదురూ బడాయి. అయితే ఓ పని చేదాం. ఈ అయిడియా లేదూ ఈ బ్రహ్మాండమైన అవిడియా-దీన్ని హోల్ సేల్ గా నెగటివ్ రైట్స్ తో సహా మీకు అమ్మేస్తాను. జస్ట్ నాలుగువందలపాతిక ఇవ్వండి. మెద్రాస్ సిటీ మటుకు నాది." అన్నాడు కోటయ్య తెగించి.

"అదేంకుదరదు" అన్నాడు కొలంబస్.

"పోనెండి. సిటీరైట్సు కూడా తీసుకుని ఆ డబ్బిటు పారెయ్యండి."

"లాభంలేదు బ్రదర్" అన్నాడు కొలంబస్.

"లాభం బోల్డుంటుందండి. దారుణంగా లాభం వస్తుంది. మీరు ఇన్ కంటాక్సువాళ్ళకోసం ప్రత్యేకం ఒక ఉపాయాల డిపార్టుమెంటు పెట్టాల్సి వస్తుందన్నమాట."

"అదేదో నువ్వే పెట్టు. పెడితే, అందులో మా బావమరిదొకడున్నాడు చదువు సంధ్యా లేకుండా అడ్డగాడిదలా తిరుగుతున్నాడు. వాడికేదేనా ఉద్యోగం ఇయ్యి" అన్నాడు కొలంబస్.

"అంతేమాటనకు బ్రదర్! నాకు నీమీద ఎంతో ప్రేమ. నీకు ఎలా ఉపకారం చేదామా అని పొద్దుట్నుంచి ఆలోచిస్తున్నాను. దీన్ని కాదనకు, నాలుగొందలొద్దుగాని ఒక హండ్రెడ్—కనీసం 75 ఉంటే ఇచ్చేయి. బ్లాక్ లో పాతిక. రెండూ రొక్కంగా ఇచ్చేయి. అవిడియాని నీకు ఇచ్చేస్తాను" అన్నాడు కోటయ్య.

"హండ్రెడ్ కాదు. అరణాలు కూడా ఇవ్వను" అన్నాడు కొలంబస్.

"ఎక్కడి మనిషివయ్యా ప్రాణం తీసేస్తున్నావు. సరే బేడా అర్థణా పారెయ్యి కాఫీతాగిపోతాను" అన్నాడు కోటయ్య కోపంగా.

కొలంబస్ మాటాడకుండా, కోటయ్య జేబు తడిమి, ఓ సిగరెట్ తీసుకుని, లేచి 'వెళ్ళొస్తా బ్రదర్' అన్నాడు.

* * *

"రాజా విన్నావా వాడి ఊహ. ఎలా ఉంది కథ" అన్నాడు కొలంబస్ ఇవతల కొస్తూనే.

"బ్రహ్మాండంగా ఉండండి. మీరు కొనెయ్యాలిసింది." అన్నాడు రాజు సంభ్రమంలోంచి కోలుకొని.

"నీకిలాంటి అయిడియాలు వస్తాయా?" అన్నాడు కొలంబస్.

"అబ్బో. మన కెక్కడివస్తాయండి".

"అయితే లాభంలేదు. యూజ్ లెస్" అన్నాడు కొలంబస్.

(పై వారం మరోకథ)




# క్రిస్మస్ శుభాకాంక్షలు

పల్లెటూరి పెళ్ళికూతురులా సిగ్గుపడుతుంది ప్రకృతి!

కమలాదేవికి హిల్డా గ్రేస్ పార్శిలు పంపింది!

పార్శిలు విప్పి చూడసాగింది కమలాదేవి.

మొదట కనబడింది క్రిస్మస్ గ్రీటింగ్స్ కార్డు!

కార్డులోనే ఉన్నయ్ బోలెడు శుభాకాంక్షలు!

క్రిస్మస్!

వసంతంలో జరిగే వంతలాంటి క్రిస్మస్!

వంద ఉగాదులు విరబూచే క్రిస్మస్!

వేయి వసంతాలు ఒకరేయిలో మెదిలే క్రిస్మస్!

మోడువడిన బ్రతుకులపై అమృతవర్షం లాంటి క్రిస్మస్!

ముడిపడిన తలపులపై వలపుపవనాలు ప్రసరించే క్రిస్మస్!

దానివెనుక...ఎన్నో ఆశలు...మరెన్నో ఆశయాలు...ఎన్నో తలపులు...మరెన్నో వలపులు!

తీయని మధురమైన బాధలు—వాటిలో జనించే ప్రేమరసపూరితమైన గాథలు!

కమలాదేవి అలా క్రిస్మస్ ను గురించి ఆలోచిస్తుండగానే వేణుగోపాల్ వచ్చాడు.

ఆమె అతన్ని చూచి ఒక్క చిరునవ్వు నవ్వింది.

ఆమె చిరునవ్వులో ఏదో భావం వుంటుందని అతని నమ్మకం!

"ఏమిటి కమలా ఆలోచిస్తున్నావ్?" అన్నాడు వేణు. నవ్వుకు ఆలోచనకు వుండే దగ్గరసంబంధం అతనికి తెలుసు!

"ఏమీ లేదు. హిల్డా గ్రేస్ క్రిస్మస్ ఆహ్వానం పంపింది."

"అయితే మనకు ఏదో ఒక గొప్ప లాభం జరిగితీరుతుందన్నమాట!"

"ఆనాటి క్రిస్మస్ పండుగ జీవితంలో మరపురాదు," అనుకుంది కమలాదేవి.

* * *

## ఎక్కలి సుందరరావు

కుమారి కమలాదేవి అన్నీ సర్దుకుని రైల్వే స్టేషనుకు వచ్చింది. అప్పటికే బండి మందంగా పోతుంది. లేడీస్ కంపార్ట్ మెంట్ వెదుక్కునే వ్యవధి లేకపోయింది. అందుబాటులో వున్న ఫస్ట్ క్లాస్ కంపార్ట్ మెంట్ లోనే ఎక్కింది. తెల్లవాళ్లు స్వార్థంకోసం నిర్మించుకున్న ఈ ఫస్ట్ క్లాస్ కంపార్ట్ మెంట్లు చిన్న బంగళాల్లా వుంటాయి!

ఆమె కంపార్ట్ మెంటంతా కలయజూచింది. ఎవ్వరూ లేరు. సామానులు

# ★ క్రిస్మస్ శుభాకాంక్షలు ★

మాత్రం వున్నాయి. ఓ లెదర్ బాక్సు-దాని ప్రక్కన చక్కని పువ్వులు నింపుకుంచుకున్న బుట్ట! దాంతోపాటు తగిన పెద్ద హోల్డాలు వున్నాయి!

ఆమెకు చాలా ఆశ్చర్యం వేసింది. ప్రక్క స్టేషన్‌లో గార్డుకు రిపోర్టు చేద్దామనుకుంది సామానుగురించి-

చిన్న చిన్న పల్లెలమీదుగా పరుగు తీస్తుంది రైలుబండి. చుట్టూవున్న పచ్చని పైరులు మలయపవనంతో నృత్యం చేస్తున్నాయి-నృత్యం చూస్తున్న వృక్షాలు వలపు ఓపలేక గిరున తిరుగుతున్నాయి!

కమలాదేవి తన పొడవైన ఆకుపచ్చని ట్రావెలింగ్ ఉలెన్‌కోటుని తీసి హేంగర్‌కు తగిలించింది. హైహీల్సు విశ్రాంతికోసం మూలకు నడిచాయి.

అలసిపోయిన ఆమె దేహాన్ని చల్లగాలులు మెల్లమెల్లగా తాకి హాయిని చేకూరుస్తున్నాయి. ఆమె తన సౌకుమార్యమైన శరీరానికి విశ్రాంతి కలిగించేందుకు దుస్తులను అనుకూలంగా అమర్చుకుంది. మగవాళ్ళు లేనప్పుడు, అందులోను ఒంటరిగా వున్నప్పుడు స్త్రీలు స్వేచ్ఛగా నడుకుంటారు! ఈ సమయంలో ఎవరు చూసినా తగని సిగ్గుపడిపోతారు.

కమలాదేవి బెర్తుమీద తన హోల్డాల్‌ను ఎత్తుగా చేసుకుని తల వాల్చింది. కిటికీ గుండా ప్రకృతిని చూస్తుంటే తన డ్రాయింగ్ రూమ్‌లోని పూర్తిగాని చిత్రం జ్ఞాపకానికి వచ్చింది. ఆమె డ్రాయింగ్ రూములోనికి అతి సన్నిహితులు మాత్రమే వస్తారు. దానిలో రకరకాల చిత్రాలు!

ఆమె గీసే ప్రతిచిత్రంలోను ఒక ఆకర్షణ, ఒక ప్రత్యేకత కనుపిస్తాయి! ప్రసవవేదన పడే యిల్లాలు-భర్తమీద విరక్తి కలిగి విడిచిపెట్టి పోయేభార్య!-భార్యమీద భ్రమ తగ్గి విడాకు లివ్వడానికి సిద్ధమైన భర్త!-సంసారం లావై పిల్లలతోటి బావిలోదూకే ఓ దౌర్భాగ్యురాలు - భర్త శంకించాడనే అనుమానం భరించలేక వురివేసుకునే ఓ అమాయకురాలూ-ఇవీ ఆమె చిత్రాలు!

ప్రత్యక్షంగా ఆమె చిత్రాల్ని మెచ్చుకునే వారు పరోక్షంగా ఆమె జీవితాన్ని వ్రేళ్ళతో చూపిస్తారు!

ఆమె బాగా చదువుకుంది-ఒక గరల్స్ హైస్కూల్ హెడ్మిస్ట్రెస్ గాపనిచేస్తుంది. ఓచిత్రకారిణిగా ప్రఖ్యాతి గాంచింది. అయినా ఆమె కుమారి! ముప్ఫైయేళ్ళు దాటుతున్నా ఆమెను కుమారి అనాలి! ఇదే ఆమెకున్న లోటు! దీని క్రింద నేవాళ్లు పెట్టే యొట్టని గీటు!

ఎన్నియేళ్ళు గడిచినా ఆమె సమస్య తీరడంలేదు. ఆలోచనలోనే కాలం సాగిపోతుంది. ఆమె సిద్ధాంతాలతో ఏకీభవించిన హిల్డాగ్రేస్ పెళ్లి చేసుకుంది! ఆమె పెళ్ళికి తను వెళ్ళలేక పోయింది-పెళ్ళయిన చాలా కాలానికి, ఈనాడు తను ప్రయాణమయ్యింది హిల్డాను చూడడానికి.

గ్రేస్ హిల్డా ఆమెను క్రిస్మస్‌కు ఆహ్వానించింది. కమలా దేవికికూడా క్రిస్మస్ సెలవులు కనుక బయలుదేరింది!

హిల్డా యిప్పుడు ఎలావుందో! భర్తతోటి ఎలా మెలుగుతుందో! భర్త ఎలాంటివాడో! నిజంగా హిల్డా భర్తతో కాపురం చేస్తుందా? ఇద్దరూ ఎలా వుంటున్నారో? కొంపతీసి ఎప్పుడూ పోట్లాడు కోరుగదా! అసలీ హిల్డా మహాతంతగత్తె!

పందెంలో ఓడిపోయినా ఒప్పుకోని మొండిఘటం! కుమారి కమలాదేవికి హిల్డాను గురించి ఎన్నో తలంపులు ఎడతెరపి లేకుండా వస్తున్నాయి!

బండి కొండలమీద స్వారీ చేస్తుంది.

పచ్చని సిల్కు చీరలు కట్టుకున్న పర్వత సుందరి మణులతో సరసాలాడే తెల్లని మేఘాలు గంభీరమైన బండి కేకలు విని పారిపోతున్నాయి!

కంపార్టుమెంటులో ఏదో చప్పుడైనట్లుంది. లోపలికి చూసింది కమలాదేవి.

ఒక యువకుడు బాత్‌రూమ్‌లో నుండి బయటికి వస్తున్నాడు. విశాలమైన వక్షస్థలం మీద టర్కీటవలు మాత్రమే వుంది! ప్రతి యువతినీ యిట్టే ఆకర్షించి, హర్షింపబడగల పసిడిఛాయ, మెలికలు తిరిగిన కురులు! బలంగా కనుపిస్తున్న అతని అవయవాల పొందిక ముచ్చటగా వున్నాయి. చదువూ సంస్కారంగల వాడని యిట్టే చెప్పవచ్చు!

కమలాదేవి అతన్ని చూసి చివాలునలేచి పొందిగ్గా కూర్చుంది.

యువకుడు చక్కని సూటు వేసుకుని కూర్చున్నాడు. బండి స్టేషన్‌లో ఆగి అలసట తీర్చుకుంటుంది.

యువకుడు లేచి గుమ్మందగ్గరకు వెళ్ళాడు. టిక్కట్ ఎగ్జామినర్ తన పెట్టెవైపుకు రావడం గమనించాడు.

"ఏమండీ, ప్లీజ్ మీరు దిగిపోతారా?" అన్నాడు కమలాదేవితో యువకుడు.

ఆమెడిగ్నిటీకి భంగం కలిగినట్లనిపించింది.

"కావలిస్తే మీరు దిగిపోండి" అని అకస్మాత్తుగా అనేసి —ఒకలా ఫీలయ్యింది.

"ఇది ఫస్టుక్లాసండీ, ఎక్జామినర్ వస్తున్నాడు!"

"అవునండీ నాకు కళ్లున్నయ్" అనేసింది కుమారి!

"మీరు పొరబాటు పడుతున్నారు. ఈ కంపార్టుమెంటును నేను రిజర్వ్ చేసుకున్నాను. మీ రున్నందువల్ల నాకేం బాధ లేదు. కాని టిక్కట్ ఎక్జామినర్ వస్తున్నాడు"

కుమారి కమలాదేవికి ఒక చిన్న పందెంలో ఓడిపోయినట్లనిపించింది. వెంటనే గుమ్మం దగ్గరకు వచ్చింది. 'రిజర్వ్‌డ్' అనే అక్షరాలు చూసింది. వెంటనే లోనికివచ్చింది.

తన ఆకుపచ్చని ట్రావెలింగ్‌కోటు వేసుకుంది. హైహీల్సు తొడుక్కుంది. బెడ్ హోల్డాల్ సర్దుకుంది. అంతలోకే బండి కదిలినందుకు పట్టలేనంతకోపం వచ్చింది కమలాదేవికి-సరిగ్గా స్కూలులో కాపీ విద్యార్థిని నిందించినట్లుగా బండిని నిందించింది. వచ్చి బెడ్‌హోల్డాల్ యథాస్థానంలో వుంచి బెర్తుమీద కూర్చుంది.

అప్పటి ఆమె స్థితిచూసి, నవ్వు ఆపుకోలేని యువకుడు తనముఖానికి ఒక మాగజైన్ అడ్డం పెట్టుకున్నాడు!

"అవునండీ, నాకు కళ్ళున్నయ్" అన్న మాట ఆమెకూ అతనికీ ఒకేసారి గుర్తుకు వచ్చింది.

"థేంక్ డే" అనుకుని తృప్తిపడింది కుమారి కమలాదేవి. ఈసారి బండి ఆగేసరికి కుమారి దిగే స్టేషన్ వచ్చింది. ఆమె బండి ఆగీ ఆగక ముందే దిగేసింది. హడావుడిలో ఆమె ఖరీదైన చేతిరుమాలు బెర్తుమీద మిగిలిపోయింది!

రైల్వేపోర్టర్ ఆమె సామానులు మోసుకొచ్చాడు. కుమారి అద్దె కారులో అడుగు పెడ్తూ ఎవరో తనని తాకినట్లనిపించింది.

వెనుదిరిగిచూస్తే గ్రేస్ హిల్డా!

పట్టరాని సంతోషంతో ఒకరి నొకరు కౌగిలించుకున్నారు.

ఒకరిని చూసి ఒకరు ఎంతో సంతోషాన్ని, ఆనందాన్ని, అనురాగాన్ని, ఆశ్చర్యాన్ని ప్రకటించుకున్నారు.

హిల్డా గ్రేస్ తీసుకొచ్చిన తమ స్వంత కారులో ఇద్దరూ ఎక్కారు. హిల్డా డ్రైవ్ చేస్తుంది. ప్రక్కనే కుమారి కూర్చుంది.

కారు తియ్యని తలపులతో సాగిపోతుంది. కొన్ని కారులు ఈ కారునుదాటి మరీ వేగంగా పోతున్నాయి.

"హిల్డా! యివ్వాళ బండిలో ఒక 'ఇన్సిడెంట్' జరిగింది" అన్నది కమలాదేవి.

"ఏమి టది?" అన్నది హిల్డా.

"పోనీలే, తరువాత సావధానంగా చెబుతాగాని, నేననుకు మీ రిద్దరూ వస్తారనుకున్నానే!"

"ఓ...అదా...దానికొక 'ఏక్సిడెంట్' జరిగిందిలే—క్రిస్మస్‌కి మా వారూ నేనూ చెరొక అతిథిని ఆహ్వానించాం. నా గెస్టు తప్పనిసరిగా వస్తుందని నేనూ, తన గెస్టు తప్పనిసరిగా వస్తాడని తనూ, యిద్దరం వాదించుకున్నాం. వారి గెస్టు వుదయం మెయిల్‌కి రావలసింది. అతడు రాకపోయేసరికి ఆయన ఓడిపోయారు. ఇక నాతో పలకడం మానివేశారు. వారిని నావెంట రమ్మనడానికి నీవు వస్తావని నాకు నమ్మకంలేదు. అప్పుడు నేను కూడా ఓడిపోవలసి వస్తుంది. కనుక భయపేసి నేనొక్కతెనే వచ్చాను. ఇన్నిసార్లు రానిదానివి ఈసారి వస్తావని ఎలానమ్మకం?"

అని ముగించింది హిల్డా గ్రేస్.

భార్యా భర్తల మధ్య 'ఏక్సిడెంట్' విని కుమారికి నవ్వువచ్చింది. "అయితే మీవారిని ఓడించావన్నమాట."

"ఓడించడంకాదు. మనమిద్దరంవెళ్ళి, నేను నిన్ను పరిచయం చేశానంటే—అబ్బ! యిక చూసుకో..."

"ఆల్ రైట్! నేనుకూడా మీవారితో 'మీగెస్టు రాలేదా?' అంటాను. ఏమంటావ్"

"వెరీగుడ్! నీవు అలా అనాలేగాని, వారిముందు నీకు ప్రెజెంట్ ప్రకటిస్తాను" అన్నది గ్రేస్ హిల్డా.

కారు నవ్వుకుంటూ పోతుంది.

నిమ్మతోటలు, నారింజతోటలూ, మామిడి వనాలు రోడ్డుకిరువైపులా క్రిక్కిరిసి వున్నాయి. రోడ్డును కాపాడేందుకు పెద్ద పెద్ద వృక్షాలు పహరా కాస్తున్నాయి.

"కమలా, నిన్ను ఒకవిషయం అడగాలనుకుంటున్నాను."

"ఓ...నిరభ్యంతరంగా—నామీద నీకు సర్వహక్కులూ వున్నయ్."

"ఎంత హెడ్మిస్ట్రెస్ వైనా, చిత్రకారిణి వైనా, పెళ్లిచేసుకోవుటే?"



## రాగిణి ఇలా చెప్పుచున్నది.

"నేను ఎల్లప్పుడూ లక్స్ టాయిలెట్ సబ్బును వాడుచున్నాను—అది ఎంతో తెల్లనిది, ఎంతో శుద్ధమైనది, సౌమ్యమైనది!"

విలాసవతియగు రాగిణి ప్రవీణ నర్తకి, సౌందర్యముగల సొగసైన తార. ఆమె ప్రకాశమాన చర్మ సౌందర్యము అనేక మంది వనితలకు అసూయాకరమైనట్టిది—"నేను ఎల్లప్పుడూ శుద్ధమైన, తెల్లని పరిమళమగు లక్స్ టాయిలెట్ సబ్బును వాడుచున్నాను" అని ఆమె చెప్పుచున్నది.

రాగిణివలె చేయుడు—శుద్ధమైన, తెల్లని లక్స్ టాయిలెట్ సబ్బును ఎల్లప్పుడూ వాడుడు! శరీరమంతటి సౌందర్యము కొరకు, పొదుపైన పెద్ద సైజును కొనుడు!

## లక్స్
## టాయిలెట్ సబ్బు




సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

L. T. S. 545-X52

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి వారి ఒక తయారు.

## ★ క్రిస్మస్ శుభాకాంక్షలు ★

"చంపేశావు. ఆ విషయం నీకు ఉత్తరాలో వ్రాద్దామనుకుంటాను. కాని మీ వారు చూస్తారేమోనని వ్రాయలేదు. ఇంటివద్ద మాట్లాడుకుందాంలే—"

కారు బంగళాదగ్గరకు వెళ్లింది. ఈ కారుకి ఇంకొక కారు గేటువద్ద ఎదురయ్యింది.

హిల్డాగ్రేస్, కుమారి కమలాదేవి దిగ్విజయంగా కారులోనుండి దిగారు. విజయోత్సాహంతో లోనికి ప్రవేశిస్తున్నారు. హిల్డాగ్రేస్ భర్త, చివరిసారి విజయం పొందిన బ్రూసురాజులా సగర్వంగా చిరునవ్వుతో ముఖద్వారంవద్ద నిలబడ్డాడు!

ఆయన ప్రక్కనున్న గెస్టును చూసి సామ్రాజ్యంకోల్పోయిన యువరాణిలా పోజు పెట్టింది హిల్డాగ్రేస్!

వదరు గెస్టును చూసి మరీ సిగ్గుపడింది కుమారి కమలాదేవి! కొంతసేపటికి రెండు సామ్రాజ్యాల మధ్య శాంతిభద్రతలు నెలకొన్నాయి. గెస్టులు ఒకరికొకరు సాంప్రదాయికంగా పరిచయం చెయ్యబడ్డారు.

ఆ రాత్రి భోజనాల కార్యక్రమం బాగానే సాగింది. కాని గెస్టులుమాత్రం ఒకరిని గురించి ఒకరు లోతుగా తెలుసుకోవాలనే జిజ్ఞాసలోపడ్డారు.

ఆ రాత్రి హిల్డా పియానో వాయిస్తుంటే ఆమె భర్త పీటర్ పాల్ ప్రార్థనాగీతం పాడాడు. గెస్టులిద్దరూ వధూవరులవలె తలలు వంచుకున్నారు.

ప్రార్థన ముగిసింది.

ఏ పార్టీ కాపార్టీ చీలిపోయింది.

యువకునికి కమలాదేవికి జరిగిన 'ఇన్సిడెంట్' విని నవ్వు పూరుకుంది హిల్డా—

"సరేగాని ఆయన విషయం నీకేమైనా తెలుసా?" అన్నది కుమారి.

"మా వారితో చదువుకున్నాడని మాత్రం తెలుసు. మిగతా విషయాలు నేను అడగనూ లేదు. వారు చెప్పనూ లేదు" అన్నది హిల్డా.

కుమారి మౌనం వహించింది.

"మరి, ఇక నీవు పెళ్ళిచేసుకోవేమిటి?"

"ఎలాచేసుకునేది? మనసార ప్రేమించి నా సర్వస్వం అంకితంచేసుకున్న వ్యక్తిని నేను కోల్పోయాను. అందుకే నాకు పెళ్ళంటే యిష్టంలేదు. అందుకే జీవితం మీద విరక్తికలిగింది."

"అందుకని వివాహం చేసుకోనంటావ్? అంతేకదూ? అయితే వుండు" అని హిల్డా తన ట్రంకుపెట్టెవద్దకెళ్లింది. తాళంతీసి ఒక సిల్కుచీర తెచ్చింది.

"ఈ చీర నావద్ద పదిసంవత్సరాలనుండి వుంటుంది. కాని నేను ఒక్కసారికూడా కట్టుకోలేదు. వారు నన్ను దానికి కారణం కూడా అడిగారు. కారణం నేను చెప్పలేనని వారిని ప్రార్థించాను. వారు మళ్ళీ దాన్నిగురించి నన్ను అడగలేదు."

కుమారి ఆమెమాటలు అర్థంచేసుకోలేక పోతుంది.

"నేను ఎం. బి. చదువుకునేరోజుల్లో ఒక మెడికల్ విద్యార్థిని ప్రేమించాను. ఈ చీరను ఒక క్రిస్మస్‌రోజు ఆయన నాకు ప్రెజెంట్ చేశాడు. నేను దీనిని ధరించకముందే ఆయన హఠాత్తుగా మరణించాడు. అప్పుడు వివాహంమీద విరక్తికలిగింది. బ్రతుకుమీద మోజుతగ్గింది."

కుమారి ఎంతో ఆసక్తితో వింటుంది.

"మా తల్లిదండ్రులు నాకు పట్టుబట్టి వివాహంచేశారు. నా భర్త నన్ను మార్చివేశారు. నాకు కావలసినంత స్వేచ్ఛ, శాంతి, ప్రేమ వారివద్ద లభించాయి. స్త్రీని నమ్మిన పురుషులు తమ సర్వస్వాన్ని భార్యల శ్రేయస్సుకోసం త్యాగంచేస్తారు! ఎంత మరచిపోయినా అప్పుడప్పుడూ ఆయన మనసులో తురుపుతీగలా మెదుల్తారు. మనస్సు బాధపడుతుంది. క్రమేణా ఆ బాధ ఒక ఆనందంగా పరిణమిస్తుంది. ఇంతే నా జీవితచరిత్ర!

నీకు నచ్చిన యువకుడు దొరికితే వెంటనే వివాహంచేసుకో—తరువాత నీకు శాంతి చేకూరుతుంది. లేకుండా జీవితం ఇలాగే విధికి బలికావడం నేనంగీకరించను. ఆలోచనగలవారెవ్వరూ అంగీకరించరు."

"సరే చూద్దాం. నీమాటల్లో ఏదో సత్యం లేకపోలేదని నాకనిపిస్తున్నది" అన్నది కమలాదేవి.

తరువాత హిల్డాగ్రేస్ నిద్రలో లీనమయ్యింది. కాని కమలాదేవి రాత్రంతా దీర్ఘంగా ఆలోచిస్తూనేవుంది!

డిసెంబరు 25వ తేదిరాత్రి యేసుక్రీస్తు పుట్టినరోజు!

ఆరాత్రి ఒంటిగంటకు క్రైస్తవులందరూ లేచి యేసుక్రీస్తుని నామ సంస్మరణ చేసుకుంటారు. ఆ తెల్ల

# ★ క్రిస్మస్ శుభాకాంక్షలు ★

వాథలూ ఆయననుగూర్చి గానంచేస్తూ ఉల్లాసంగా జయజయధ్వానాలు చేస్తారు! క్రైస్తవచరిత్రలో ఈ రాత్రికి ఉన్నంత ప్రాముఖ్యం ఏ సరుకుకూడా లేదు!

తెల్లవారేసరికి హిల్డాగ్రేసు, పీటర్ పాల్, కలిసి క్రిస్మస్‌వృక్షం పూర్తిచేశారు! యేసుక్రీస్తు జీవితానికి ఈ వృక్షానికి దగ్గర సంబంధంవుంది!

పీటర్ పాల్ ఆ రోజు కార్యక్రమాన్ని నిర్ణయించాడు.

పీటర్ పాల్ తన పనివాళ్లను తదితర పేద ప్రజలను ఆహ్వానించాడు. ధనికులైన క్రైస్తవులు, పేదక్రైస్తవుల కోసాడు దానం విరివిగా చేస్తారు. "నిన్నువలె నీ పొరుగు వారినికూడా ప్రేమించు" అనే సిద్ధాంతం ఆ రోజున తప్పక అమలు జరుగుతుంది.

పనివాళ్లకు బీదలకు క్రొత్తబట్టలు, బహుమతులు, డబ్బు, పీటర్ పాల్ గెస్టుద్వారా అందాయి. హిల్డాగ్రేస్‌గెస్టు ఈ దానాలను ప్రశంసించింది.

అందరికీ ఒకహాల్లో విందు ఏర్పాటు చెయ్యబడింది. ఈ విందుకు ప్రత్యేకం యేమిటంటే యజమానులు 'సర్వర్స్'గా మారిపోతారు! సేవకులు విందును ఆనందిస్తారు!

ఈ విందులో అందరూ కూర్చుంటారు. మధ్యలో ఒకపెద్ద కేక్ వుంటుంది. ఈ కేక్ చాలా ఖరీదుచేస్తుంది. దీన్ని క్రిస్మస్ కేక్ అంటారు. పీటర్ పాల్ నిర్ణయించిన కార్యక్రమం ప్రకారం ఈ కేక్‌ను కుమారి కమలాదేవి 'కట్' చేయడంద్వారా విందుకు ప్రారంభోత్సవం జరిపింది.

గ్రేస్ హిల్డా ఏర్పాట్లను అతిథులు ప్రశంసించారు. గెస్టులంతా ఒకరికొకరు పరిచయంచేసుకుంటూ ఎంతో ఆనందాన్ని అనుభవించారు.

తరువాత అందరూ గుడిలోజరుగు ప్రత్యేక కార్యక్రమాలకు హాజరయ్యారు.

గుడి ముగిసినపిదప పీటర్ పాల్ తమస్వగృహంలో 'హోం పిక్చర్' ఏర్పాటుచేశాడు. యేసుక్రీస్తు జన్మదినం చూపబడింది.

గెస్టు లిద్దరికీ ఈ విషయాలు ఆశ్చర్యాన్ని గొల్పాయి! తరువాత అందరూ సెలవు తీసుకున్నారు!

మరుసటి దినం—

ఇద్దరి గెస్టులతోబాటు పీటర్ పాల్, హిల్డాగ్రేసుల్ని ఒకే కారు చిరునవ్వుతో తీసుకెళ్తుంది. పంతాలు, పౌరుషాలు లేకుండా కేవలం శాంతిదూతలా మారింది కారు!

కారుస్టేషన్‌వద్ద కొచ్చి అందర్నీ దిగనున్నది. రైలుబండి (మొన్నటి మెయిల్) మళ్ళీ వచ్చి స్టేషనులో అలసట తీర్చుకుంటుంది.

"ఏ పెట్టెలో ఎవ్వ – దాం?" అని ప్రశ్నించినవి కుమారి కళ్ళు.

"అదిగో మన రిజర్వు కంపార్ట్‌మెంట్!" అన్నవి చిరంజీవి కళ్ళు. హిల్డాగ్రేస్, పీటర్ పాల్ వాళ్ళనిచూసి హృదయపూర్వకంగా నవ్వుకుని చేతులు వూపుతూ వీడ్కోలిచ్చారు.

రైలు మహావేగంతో సాగింది!

"మీ చేతి రుమాలు యిదిగో" అని చిరంజీవి అందించాడు. "అది మీదగ్గర వుండటం శాశ్వతం" అనుకుంది కుమారి మనసులో—

* * *

"కమలా, ఇంకా పార్శిలులో ఏమున్నాయో చూడు" అన్నాడు వేణుగోపాల్. చక్కని పాపాయి రబ్బరుబొమ్మ మాత్రం వుంది! రెండవది గిలకపండు!

శ్రీమతి కమలాదేవి భర్తనుచూసి సిగ్గును కౌగిలించుకుంది "ఓ... వాళ్ళు మనల్ని దీవిస్తున్నారన్నమాట! వాళ్ళ దీవెనలు తప్పక నెరవేరుతాయి సుమా! కనుక మనం ఈసంవత్సరం కూడా వాళ్ళ క్రిస్మస్ కు వెళ్దాం" అన్నాడు వేణుగోపాల్—వారి మనసులో క్రిస్‌మస్ నాట్యం చేసింది.

రంగురంగుల క్రిస్మస్ వింత వింతల క్రిస్మస్!
వసంతంలో జరిగే సంతలాంటి క్రిస్మస్!
వంద ఉగాదులు విరబూచే క్రిస్మస్!
వేయి వసంతాలు ఒకరేయిలో మెదిలే
క్రిస్మస్!! ★



# వశీకరణం

"మిత్ర వశీకరణం" అన్న పుస్తకాన్ని పలుమార్లు చదివి ఆకళించుకొన్నాడు సుందరరావు. ఇక తెలుసుకొన్న విషయాలన్నింటినీ ఆచరణలో పెట్టడమే తరవాయి అనుకొన్నాడు. తన చుట్టూరా వున్నవాళ్లందరిమీదా ప్రయోగాలు జరపాలనుకొన్నాడు.

ఆ పుస్తకంలో అనేక సూచన లివ్వబడినవి. ఎలాంటి వారిని ఏవిధంగా వశపర్చుకోవచ్చునో, ఎవరిదగ్గర ఎలా సంచరించాలో, ఎలా మాట్లాడాలో, ఏమేమి మాట్లాడాలో వివరంగా రాయబడింది. అన్నిటినీ ఆవులలో పెట్టడానికి మంచిశ్రద్ధ, పట్టుదల కావాలని పది పేజీలు రాయబడింది. అందుకని సుందరరావు ముందు అన్ని విషయాలూ బాగా ఆలోచించి ఒక మంచి పంథా ఏర్పరచుకొన్న తర్వాత రంగంలో ప్రవేశించాడు.

మిత్రుల్ని పేరుపెట్టి పిలవడం చాలమంచిదని అందులో ఒక సలహా!

ఉదయం ఆఫీసుకు వెళ్తూ వుండగా ఒక మిత్రుడు కనిపించాడు.

"ఏమండి శ్రీరామ చంద్రుడు గారూ కులాసా..." అని పలకరించాడు మిత్రుణ్ణి.

మిత్రుడు నిలిచాడు. సుందరరావు సంతోషించాడు. "మొదటి మెట్టు" అనుకొన్నాడు.

"మేష్టరుగారూ! మీరూ మొదలు పెట్టారూ! అనుకొన్నానండి. ఎప్పుడైతే ఆ రాడీ మూకతో చేరారో అప్పుడే అనుకొన్నాను, మీరూ చెడిపోతారని. వట్టి వెధవలు. ఇంకోణ్ణి హేళన చేయడమేగాని స్వతహాగా ఒక్కడూ ఉప్పురాతికి పనికిరాడు. ఇంకోడు అవినీతిపరుడని గంట స్తంభం మీదెక్కి గోలపెట్టి నానా రభస చేస్తారు. తాము రహస్యంగా అంతకన్న లుచ్ఛాలు! అలాంటి మూర్ఖులతో మీలాంటి మంచివాడు చేరడం ఏమీ బాగోలేదు. ఇంకా పైకి రావలసినవారు, చదువుకొన్నవారు, యువకులు, మంచి ప్రవర్తన అలవరచుకొని నలుగురిలోనూ మంచివాడూ, చదురయినవాడూ, యోగ్యుడూ అని అనిపించుకోవలసినవారు—మీరే యిలా అయిపోయారు. ఇంత త్వరగా ఇలా చెడిపోతారనుకోలేదు. పోనీ లెండి. లేపయ్యేది, ఇవాళే అయింది. తలి కడుగుతానుగానీ ఎవడిభార్య యెలాపోతే మీకేమండీ? ఎవడి సంసారాన్ని ఎవడెలా చక్కబెట్టుకుంటే మీదేంపోయిందీ అంటాను. అవును నా భార్య నాకు ఇష్టం లేదు...పంపించేశాను. ఫీడా వదిలిపోయిందనుకొన్నాను. మా మధ్య వెయ్యి జరిగి వుంటాయి. అవన్నీ మీకెందుకు భార్యాభర్త అన్న తర్వాత లక్ష వుంటాయి! ఏవో మనస్పర్థ లొచ్చేయి...దాంతో ఆవిడ వెళ్ళిపోయింది.. ఏం మీకేం ... ధైర్యముంటే ఆవిణ్ణి వెళ్ళి అడగరాదూ...మీరే ఆమెను ఉద్ధరించరాదూ! ప్రతి వాడూ ఓ వాల్మీకి కాలేక పోయాడా...ఇదిగో మేష్టరుగారూ మర్యాదగా చెప్తున్నాను ... ఇంకా చిన్నవారు, ఉన్నతికి రావలసినవారు. నామాట ఒక్కటి వినండి. ఇంక ఇలాంటి విషయాల్లో

రాజేంద్ర

జోక్యం కలుగజేసుకొన్నారా... సర్వనాశనమై పోతారు. వాళ్ళకేం అన్ని విధాలా చెడ్డారు. ఇప్పటికి పారంభోకు లనిపించుకొన్నారు. అలాగనిపించుకోవాలనుకొంటే సరేసరి! ఏదో నేను చెప్పవలసింది చెప్పాను. ఆ తరువాత మీ యిష్టం. బాగే పడతారో, చెడిపోతారో ... నిర్ణయించుకోండి. వస్తాను...సెలవు...వాళ్లు మాత్రం జాగ్రత్త అంటూ విసవిస నడిచి వెళ్ళిపోయాడు."

తక్షణం ఎక్కడైనా ఒక లోతైన సారంగంలోకి పడి మూర్ఛపోవాలనిపించింది సుందరరావుకు. అతనికేమి బోధపడలేదు. తలతిరిగి పోయింది. ముఖం వికారంగా మారిపోయింది. కాళ్లు చేతులు వణకసాగాయి. ప్రక్కగా చూచాడు. ఒక హోటలు కనిపిస్తే, అందులోకి చొరబడ్డాడు. అర్జెంటుగా కాఫీ తెప్పించి త్రాగేశాడు.

ఇంతలో అక్కడికి నాగరాజరావని ఒక మిత్రుడు వచ్చాడు. ఈసారి ఎలా పలుకరించాలో తెలీక పూరికే వుండిపోయాడు. ఆ మిత్రుడు దగ్గరగా వచ్చి—

"ఏమిస్వామీ! కళ్ళు కనిపించలా? నాకేసి శత్రువును చూచినట్లు చూస్తావేమిటి? పలకరించడం చేతగాక పోతే పోయింది. ముఖంలో, నవ్వు నటించిన సూచనలే తెలేమిటి? "గుడ్ గాడ్" అన్నాడతను.

"క్షమించండి. ఏదో ఆలోచిస్తూ వుండిపోయాను. రండి కూర్చోండి." అన్నాడు.

నాగరాజారావు దగ్గరకువచ్చి కూర్చున్నాడు.

"ఏమిటి విశేషాలు" అన్నాడు. వెయిటర్‌నుపిలిచి కాఫీకి ఆర్డరిచ్చాడు.

"మీ రంతా చేరి నా కొంప ముంచారండీ! మీ రందరూ మీ ప్రక్క సీటాయన్ని శ్రీరామచంద్రుడుగా రంటూవుంటే నేనూ ఆ పేరుపెట్టి పిలిచేశాను...... దాంతో...."

"ఏమిటీ ఆ పేరో పిలిచేశారూ? కొంప ముంచేశారు పొండి! మేము ఆయన్ని ఆ పేరుతో వ్యవహరిస్తామేగాని, పిలవడం అలా పిలవం కదండీ...! ఇంతకూ ఆయన ఏ మన్నాడూ..." అని ఆతురత కనబరిచాడు నాగరాజారావు.

"నా భార్య ఎలాపోతే మీ కేమండీ అంటాడేమిటండీ ఆయన. నాకేం బోధపడలా..." అన్నాడు సుందరరావు.

"అదే అందులోనే వుంది. రామాయణంలో శ్రీరాముడు ఒక చాకలిమాటవిని, భార్యను అరణ్యానికి పంపించేశాడుకదా! అలాగే మనవాడూ ఆ శ్రీరామచంద్రులవారిని యథాశక్తి అనుసరిద్దామని, ఈమధ్యనే భార్యను పుట్టింటికి పంపించేశాడు. అంతకు మునుపు పోట్లాడుకొని రోజూ ఏడుపు ముఖంతో ఆఫీసుకువచ్చేవాడు..."

"తెలిసిందండీ! ఇంక చాలు. ఇంక ఇలాంటివాటి జోలికి వస్తే వెళ్ళను" అని లేచాడు సుందరరావు.

నాగరాజారావుకు కాఫీవచ్చింది.

"కూర్చోండి. ఒక్కనిముషం. నేనూ వచ్చేస్తాను" అన్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు సుందరరావు.

* * *

ఈ "పాయింట్" ఇలా దెబ్బతిన్నది. మరో పద్ధతి చూడాలనుకొన్నాడు.

"ఎదుటివారి గుణాలను ప్రశంసించడం చాలమంచిది. అప్పుడు ఎదుటివారు చాల సంతోషిస్తారు" అని ఆ గ్రంథకర్త మరో సూచనచేశాడు.

ఆఫీసరుగారి పర్సనల్ అసిస్టెంట్‌తో స్నేహంగావుంటే చాల లాభాలున్నాయి. ఆయన అన్నివిషయాలూ తెలిసినవాడు మంచివాడు. అలాంటివాడి స్నేహంగనక సంపాయిస్తే బావుంటుంది కదా అనుకొన్నాడు.

మధ్యాహ్నం ఆయనదగ్గరకు వెళ్ళి "నమస్కారం" చెప్పి కూర్చున్నాడు. "నమస్కారం" అని విష్ చేయడం చాలా ఉత్తమ పద్ధతిగా ఆపుస్తకంలో చెప్పబడింది.



# వశీకరణం



"ఏమిటో కొత్తగా!...ఏమైనా సంబంధి కాబోలు. నాకు తెలీదూ! పనుంటే ఎంత వినయమైనా చూపిస్తారు, ఆపనయ్యేవరకున్నూ. తర్వాత 'నువ్వెవరు?' అన్నట్లు ప్రవర్తిస్తారు. సరేలెండి. ఏం కావాలన్నారూ?..." అన్నాడాయన.

చిరునవ్వునవ్వి "ఆ...ఏంలేదండీ. ఊరికేనే ఇలావచ్చానంతే..." అంటూబల్లమీది కాగితాలమీదికి దృష్టిపోనిచ్చాడు.

"ఈదస్తూరీ మీదేనాండీ? ఆహా...ఏం అందంగా వున్నాయండీ అక్షరాలు. ముత్యాల్లావున్నాయి. తామరాకుమీది నీటిబొట్లు సూర్యుని వెలుగులో మెరిసినట్లు మిలమిల మెరిసిపోతున్నాయండి. ఈ దస్తూరీయే కాని ఏ ఆడపిల్లదైనాఅయితే నేను టక్కుమని పెళ్లాడేద్దును..." అన్నాడు...తనలో తాను మురిసిపోయాడు. "ఆహా...ఏం దంచేశాను" అనుకొన్నాడు.

పి. ఏ. గారు అదోలా చూశారు.

"మీకు ఏంపనిలేదూ? మొన్న ఆరిపోకడిగామే అది ఇంతవరకు అందలేదేం?" అన్నాడాయన.

సుందరరావు మాట్లాడ బోయాడు. కానీ నాలిక దిగజారి...లోపలికి వెళ్ళి గుండెను కౌగలించుకొంది. నోటినుంచి మాటరాలా.

"పంపించేస్తానండీ. వస్తానండీ. సెలవు" అంటూ అక్కణ్నుంచి ఇవతలికొచ్చేశాడు. వెనకటి మిత్రుడు నాగరాజారావే మళ్ళీ కనిపించాడు. తన దురవస్థను విన్నవించుకొన్నాడు.

"మళ్ళీ కొంపకు నిప్పుపెట్టారండీ! అది ఆయన భార్యకానీ, కుమార్తెదస్తూరీ కానీ కావచ్చు. అప్పుడప్పుడూ ఆయన ఫైల్స్ ఇంటికి తీసుకువెళ్ళి వాళ్ళ సహాయం తీసుకొంటూవుంటారు...'మూర్ఛ' వచ్చినట్లయి మాట్లాడుతున్న మిత్రుడి మీద పడ్డాడు సుందరరావు.

* * *

వారం రోజులు గడిచాయి. మొదట మరి ఈ 'వశీకరణ' సిద్ధాంతాల జోలికి పోరాదనుకొన్నాడు గానీ, ఇప్పుడు ఇంకొక్క ప్రయోగంచేసి, చూసి, వదిలేద్దామనుకొన్నాడు.

ఇంట్లో ఒక్కోరోజు పొద్దుగడవకుండా చాలకష్టంగా వుంటుంది. ఎవరైనా మంచి కబుర్లు చెప్పే స్నేహితులుంటే బావుండేది, పెళ్లయివుంటే భార్య వుండేది. ఇప్పుడు ఇంట్లో అమ్మవుంది. ఆమెను పలకరించాలంటే భయం! 'చెడిపోతున్నా'వని గోల పెడుతుంది.

వీధి చివర వెంకట్రావని ఒక స్కూలు మేస్టరుగారున్నారు. బాగాపుస్తకాలుచదివినవాడు. ప్రపంచజ్ఞానమున్నవాడు. సరసుడు. మంచివక్త. సర్వవిషయ పరిజ్ఞానంగల ప్రజ్ఞావంతుడని ఎవరో చెప్పారు. పరిచయం వుంది. రోజూ పలకరించుకొంటూ వుంటారు. ఒకసారి ఇంటికి పిలిచి కాఫీఇస్తే స్నేహం కుదురుతుందనుకొన్నాడు. పుస్తకంలో భోజనానికి పిలవడం మరీ శ్రేష్ఠమైనదని రాయబడింది. కానీ అమ్మవండిన వంటకాలు రుచి చూశాడంటే, మళ్లీ తనముఖం చూడడని భయమేసింది.

ఒకరోజు సాయంకాలం ఆఫీసునుంచి వస్తూవుంటే వీధి మలుపులో వెంకట్రావుగారు కనిపించారు. మామూలు పలకరింపులయ్యాయి.

"మీరోసారి మా యింటికి రావాలండీ. ఇంట్లో ఏం తోచడంలేదు. పైగా..." సుందరరావు మాట పూర్తికాలేదు...

"ఆహా...ఇప్పుడే రానూ...దానికేమండీ? పదండి" అంటూ దారితీశారు. సుందరరావు అనుసరించాడు. ఇద్దరూ ఇల్లు చేరుకొన్నారు దారి పొడుగునా ఆయన ఏదో మాట్లాడుతూనే వున్నారు.

చెరో కుర్చీలో కూచున్నారు. సుందరరావు తల్లి ఇద్దరికీ కాఫీ తెచ్చియిచ్చింది. వెంకట్రావుగారు బల్లమీద వుంచి కాఫీని సహజంగా మాటల మధ్యలో అందుకొని ఎప్పుడో పూర్తి చేశారు. అందులో ప్రత్యేకమైన నేర్పు వుంది. కాఫీకి ఆయన అంతే ప్రాధాన్యం ఇవ్వలేదు. కనీసం స్మరించను కూడా లేదు. తన స్వంత బల్లమీద సిగరెట్ అందుకున్నాడు. అందుకొని పూర్తి చేశారు. అలా చేయడం సుందరరావుకు నచ్చలేదు. కాఫీకి 'అగౌరవం' జరిగిందనుకొన్నాడు.

వెంకట్రావు వివిధ విషయాలు మాట్లాడుతున్నారు. ఒక విషయంమీదినుంచి మరో విషయం మీదికి చెంగు చెంగున దాటి...పోతున్నారు....

"పంధొమ్మిది వందల నలభై ఆరులో నేను మహాత్మ గాంధీగారిని చూశాను. ఆయనకు గజందూరంలో నిల్చున్నాను. నా ప్రక్కనే అప్పుడు మా బావమరిది నిల్చున్నాడు. అతనిప్పుడు 'రేడియో'లో పనిచేస్తున్నాడు. అతని నాటికలు రేడియోలో వినితీరవలసినవి. అసలు ఈ రేడియో నాటికలకు ఒక మంచి టెక్నిక్ వుంది. ప్రతిదానికీ ఒక టెక్నిక్ వుంటుంది. ఉపన్యాసాలివ్వటానిక్కూడా ఒక టెక్నిక్ వుంటుంది. బిపిన్ చంద్రపాల్ ఉపన్యసిస్తుంటే ప్రజలు ఉద్రిక్తులయ్యేవారు. మనిషికి ఉద్రేకం చాలా చెడ్డది. ఒక్కొక్కప్పుడు ఇది మన కొంప ముంచుతుంది. ఏదో ఉద్రేకంలో భార్యాభర్తలు పోట్లాడుకొని విడిపోయి, జీవితాంతం బాధపడిన గాధలు చాలా వున్నాయి. ఈ దాంపత్యజీవితాలు నాశనంకావడానికి చాల కారణాలున్నాయండీ మొదటిది. చాలమంది భర్తలు, భార్యల్ని మనుష్యులుగా గుర్తించకపోవడం....గుర్తించకపోవడంవల్ల 'భార్య'లు చాలకష్టాలకు లోనవుతున్నారు. నాలుగోది...ఇప్పుడు ఎన్ని చెప్పానండీ... ఆ ఐదవది...పోనీండి...ఈ ఒకటి రెండు పెద్దసమస్యలు. చిన్నప్పుడు నాకు లెక్కలు చాల కష్టమైన పాఠ్యభాగం. కానీ స్కూలు ఫైనల్లో నూటికి డెబ్భైమార్కులొచ్చాయి. అదృష్టం, అంతే. అదృష్టంలేనిది ఏమీ రాదు. నాకు తెలిసిన దురదృష్టవంతుడొకడున్నాడు. అతను చాలా సంపాయిస్తాడు. ఏంలాభం? అంతా సిగరెట్లు కాఫీలకే తగలేస్తాడు. సిగరెట్ వొంటికి చాలా చెడ్డది ఏమంటారు?...ఆమాట కొస్తే కాఫీ మరీచెడ్డది. ఒకవీక్లీ పత్రికలో

(48-వ పేజీ చూడండి)

# గుడ్ బై

నాకు సమస్త విద్యలూ వొచ్చునని అందరి విశ్వాసం. కాని నాకు ఇంగ్లీషుముక్క వొక్కటైనా రాదు ఈ ముక్క చదివే సరికి నా భక్తులకి నామీద భక్తి తగ్గిపోతుందని నేను ఎరుగుదును. కాని తెలిసినా ఫరవాలేదనే నమ్మకంతో ఇలా ప్రకటిస్తున్నాను. ఇన్నాళ్లూ మీ అందరిమధ్యా మీకు తెలీకుండా వుండి, తీరా వెళ్ళేటప్పుడైనా గుడ్ బై చెప్పకుండా వెళ్ళడం న్యాయం కాగుగదా!

నాకు ఇంగ్లీషురాదని ఇదివరకే చెప్పాను. ఎన్నున్నా అది లేకపోవడం నాకో తీరని లోపంగా తోచింది. అంచేత వొకనాడు మా నాన్నగారి దగ్గరికి వెళ్ళి పక్కన్నే కూర్చున్నా. ఒకచేత్తో కొబ్బరిముక్కలు నములుతూ, రెండో చేత్తో త్రిశూలం పట్టుకొని వీపు గోక్కుంటున్నాడు మా తండ్రి. నా అలికిడివిని నావైపు ప్రసాద మేదురంగా చూచి "యేమిరా అబ్బాయ్ విశేషాలూ? అని మందహాసం చేశాడు. ఆయన ఎప్పుడూ ప్రసన్నంగానే వుంటాడు. కోపం రానేరాదు; వొస్తే పోనేపోదు.

నేను తలవంచి "నాన్నా, నాకు యింగ్లీషు నేర్చుకోవాలని వుంది" అన్నాను. ఆయన ఏమనుకుంటాడో అని కొస్త భయపడ్డాను. అలా జరగలా. త్రిశూలం అవతల పెటి నావీపు నిమురుతూ "ఓ! అలాగే! కాని వొకసందేహం వుంది నీవు చదవాలంటే భారతదేశంలోనే వీలు. ఇతర దేశాల్లో నిన్నెవ్వరూ ఎరగరు. చూస్తే భారతదేశం స్థితి చాలా క్లిష్టంగావుంది. ఇంక పదేళ్ళల్లో దానికి స్వాతంత్ర్యం వొచ్చేస్తుంద. వాతావరణం మారవొచ్చు. అప్పుడు నీ చదువుకు చాలా అనుకూలంగా వుంటుంది," అన్నాడు.

నాకు సందేహం ఏర్పడ్డది. "బ్రిటిషు వాళ్ళు వాళ్ళదేశానికి వెళ్ళిపోయి భారతానికి స్వాతంత్ర్యంవొస్తే మరి యింగ్లీషు భారతంలో చోటెక్కడ?" అని ప్రశ్నించా. దానికి మా నాయన అదోవిధంగా మందహాసంచేసి 'పరవాలేదు. భారతంలో ఇంగ్లీషుకి అనన్య భక్తులున్నారు. అంచాత నీవు భయపడవలసిన పనిలేదు. కాస్త వోపికపట్టు,' అన్నాడు. నేను మరి మాట్లాడలేదు.

నేను భారతదేశానికి నిద్దరేస్తే లెక్కలేనన్నిసార్లు వెళుతూ వస్తూవుంటాను. నాకు ఆహ్వానాలమీద ఆహ్వానాలు వొస్తూ వుంటాయి. వెళ్ళడం, దొరికినమటుకు కొబ్బరికాయలు, బెల్లపువుండలు, గారెలు, కుడుములు వగైరా తెచ్చుకొని తినడం నాకు నిత్యకృత్యం. అంచాత నా ప్రపంచం పూజాగృహాలు, వంటయిండ్లూ, ప్లాట్ ఫారాలవరకే మితం. నేను యే నాడూ వొ గంటసేపు ఆగి బయటి ప్రపంచాన్ని చూడడం, లోకవ్యవహారాలను గమనించడం ఎరగను. ఇంక పదేండ్లకైనా నేను భారతదేశంలో కొంతకాలం స్థిరంగా వుండక తప్పదు. పైగా నాన్నగారు ప్రకృతం భారతదేశస్థితి క్లిష్టంగా వుందన్నారు.

**శ్రీ. వె. నరసింహం**

ఇన్ని కారణాలవల్ల వొక్కసారి అక్కడికి వెళ్ళి పరిస్థితులను గమనించి రావాలి అని మనసులో నిశ్చయపరుచుకున్నాను.

ఇంతలో భారతదేశంనుంచి ఆహ్వానం రానేవచ్చింది. చక్కగా వెళ్ళాను. అదృశ్యంగా దిగాను. అదొక తాత్కాలికంగా కట్టిన ప్లాట్ ఫారం. దానిమీద నలుగు రైదుగురు ఖద్దరుధారులు కూచొని వున్నారు. అందులో వొకాయన నన్ను పిలవడం, చుట్టూ జనసముదాయం వేలకొలది చేరి వుంది. అంతటా రంగురంగుల జండాలు రెపరెపలాడుతున్నాయి, అంతటా ఉత్సాహం చురకలు వేస్తూ వుంది నన్ను ఆహ్వానించిన వ్యక్తి భక్తిపూర్వకంగా నన్నుద్దేశించి రెండు టెంకాయలు బాదేశాడు. కరతాళధ్వనులతో ఉపన్యాసం ఆరంభమైంది.

మామూలుగానైతే కొబ్బరికాయల చిప్పల్ని లంకించుకొని వెంటనే వెనక్కి వచ్చేవాడినే. కాని ఈసారి అలాకాదు. ఏమిచెబుతారో వినాలని తిష్ఠ వేసుకొని కూచున్నా. ఉపన్యాసాలు సుదీర్ఘంగా వున్నాయి. ప్రజలు ఆప్యాయంగావిన్నారు మధ్య మధ్య చినుకులుపడడం జరిగింది కాని ప్రజలు దాన్ని లెక్కచెయ్యలేదు. జయ ధ్వానాలుచేస్తూ సభ ముగియగానే ఎవరిదారిని వారు వెళ్ళారు. దృశ్యంచాలా ఉత్సాహజనకంగా వుంది. ఇహ ఉపన్యాస విషయం కుప్తంగా చెబుతా.

వర్తకుల్లాగావచ్చి ఇంగ్లీషువాళ్ళు మన దేశంలో స్థిరపడ్డారు. దేశాన్ని, ప్రజల్ని నిరసింపజేశారు. వారి నాగరకత, వేష భాషలూ మనకొంప తీశాయి. దేశం గుల్లయిపోయింది. అంచాత తెల్లవారు మన దేశాన్నించి వైదొలగాలి. వాళ్ళవెంట వాళ్ళ నాగరకతా, వేషభాషలూ కాలికి బుద్ధిచెప్పాలి. తిరిగి మన సనాతన పద్ధతుల్లో యిక్కడ నూతన రాజ్యం-స్వరాజ్యం ఏర్పడాలి. కోర్టులు పంచాయితీలుగా మారాలి కాలేజీలు ఆశ్రమాలుగా మారాలి. ఉచిత విద్య సనాతన సంస్కృతీ, ఆచార వ్యవహారాలు అమల్లోకి రావాలి. ఈ బాడుగోల వేషాలు నేలమట్టం కావాలి. మన సంప్రదాయ సిద్ధమైన దుస్తులు వాడుకలోకి రావాలి. లంచాలు, బహుమానాలు, పక్షపాతాలు, కులతత్వాలూ నశించాలి. అంతవరకూ మనం నిద్రపోరాదు. ప్రాణాలకు విశ్రాంతి అంటూ ఉండరాదు—ఇది దాని సారాంశం.

నేను మా లోకం చేరేవరకు దీన్ని గురించే ఆలోచిస్తూ వెళ్ళాను. ఇవన్ని జరుగుతాయా? జరుగుతే ఎంత బాగుంటుందో కదా! అనిపించింది. భారతీయులు అసమానమైన శౌర్యం కలవారూ, అన్నమాట సాధించి నిలుపుకునేవారూ, అన్న సంగతి నాకు అవగతమే కాబట్టి, ఉపన్యాసాల్లోని విషయాలన్నీ అచిరకాలంలో జరిగి తీరుతాయనే అనిపించింది. తినబోతూ కూరలరుచి అడగడం ఎందుకు? అన్న విధంగా ఎటూ నేను భారతదేశం వెళ్ళడానికీ, కొన్నేళ్ళుండడానికి నిశ్చయమైంది కాబట్టి చూడనే చూస్తానుగా! అని సరిపెట్టుకున్నాను.

పదేళ్ళు గిర్రున తిరిగిపొయ్యాయి. 1947 కూడా రానూ వొచ్చింది, పోనూ పోయింది. మరొక సంవత్సరం ఆగి, మా నాన్నగారితో నాకు చేసిన వాగ్దానాన్ని పునః జ్ఞాపకం చేశాను. "అలాగే" అంటూ లేచాడు మా నాన్న. నేను ఆయనవెంట నడిచాను. పరలోకం పొలిమేర దాటేసరికి మా నాన్న వొక మామూలు మనిషిగాను, నేనొక

# ★ గుడ్ బై ★

వస్సెండేళ్ళ కుఱ్ఱవాడుగాను మారిపొయ్యాం. ఆకారమంతా మారిందికాని నా సుదీర్ఘమగు తొండం అట్టే తగ్గినా, చాలా వరకు పొడుగానే ఉండిపోయింది. అంచాత తర్వాత బళ్ళో పిల్లవాళ్ళు నాకు ముక్కు మామ అని పేరుబెట్టి ఎగతాళి చేయడం జరిగింది.

భారతదేశంలో ఎక్కడ చూచినా ఉత్సాహం నిండి వున్నట్టుగా తోచింది. ప్రజల్లో కళాకాంతులు వచ్చాయి. పాత జండాలస్థానే కొత్త జండాలు రెప రెపలాడుతున్నాయి. ఇలా చూస్తూ చూస్తూనే మేం ఒక సామాన్యమైన పట్నంలో ప్రవేశించాం. మా నాన్న పెద్ద బజార్లవెంట ఒక్కొక్క హోటలునే పరిశీలిస్తూ నడుస్తున్నాడు. శుచీ, రుచీ గమనించాలని మా తండ్రిగారి ఆశయం. దక్షిణ ధ్రువంలో ఉత్తర ధ్రువాన్ని వెదకడంచూస్తే నాకు నవ్వొచ్చింది. అన్నీ నాకు పరిచితమైనవే. కాబట్టి "నాన్నా అలా పెట్టుకుంటే జరగదు. ఇదో మహా ప్రవాహం. అంటించి వేసిన బల్లలమీద భోజనం. బల్లలమీది రాళ్లని తుడవడమేగాని సాధారణంగాకడగడమంటూ ఉండదు. అందరి ఆకుల్లో నూటికి తొంభైవంతులు తాకిస్తూనే నోడ్డిస్తుంటారు. యజ్ఞాల్లో ఎంగిలీ, పితృకార్యాల్లో అంట్లూ దోషం లేనట్టే, యీ సూత్రాల్లో కూడా కొన్ని మినహాయింపులుంటాయి. ఈ నాటి శౌచగ్రంథాలుకూడా ఒకరి ఎంగిలి మరొకరు తినడం నిషేధిస్తాయి. దానివల్ల రోగాలు వ్యాపిస్తాయంటాయి. కాని యిలాంటి చోట్ల అలాంటివి గమనార్హంకాదు." అన్నాను. మానాన్న నావైపు అదో విధంగా చూచి "సరేపద" అని ఒక హోటల్లో దూరాడు. పైసైను బోర్డు మీద యే విషయమూ స్పష్టంగా లేదు. లోపల చూద్దుంగదా చాలా కులాలవాళ్లూ ఆప్యాయంగా భుజాలు భుజాలు కలిపి కూచోని లొట్టలువేస్తూ భోంచేస్తున్నారు. సాయిబులు వొడ్డిస్తున్నారు. పదార్థాలు చూస్తే నోళ్లూరుతుంది. ఇలా భేదమనేది లేకుండా కూచోని తినడం నాకు సంతోషం కలిగించింది కాని పదార్థాలను కళ్ళుకూడా చూళ్ళేకపొయ్యాయి. అందులో నేను అరితేరిన శాకాహారినైతిని! ఏమనుకున్నాడో మానాన్న, గిఱ్ఱున వెనక్కి తిరిగాడు. నేను తోకెంట నారాయణ!

మరో శాకాహారహోటలు మానాన్నకి నచ్చినట్లుంది. ప్రొప్రయిటరు అరేబియన్ పీర్లాగా ఉన్నాడు కాని విభూతి పెండెకట్లతో కాస్త శుచిగా - అంటే స్నానం చేసే వాడిలా కనపడ్డాడు. మా నాన్న ఆయనతో కొంత బహిరంగంగా మరికొంత రహస్యంగా మాట్లాడి ఆయనకు నన్ను ఒప్పజెప్పాడు. "కాస్త జాగ్రతగావుండు" అని మాత్రం నన్ను మందలించి రెండువందల రూపాయలను ఆయనకిచ్చి వెంటనే తుఱ్ఱుమన్నాడు. ప్రొప్రయిటరు రెండో అంతస్తులో నాకోగది చూపించి ఈగది నీది. వేళకు స్నానంచేసి, భోంచేస్తుండు. రేపే బళ్ళో చేరుస్తా. అన్ని సౌకర్యాలూ వున్నాయి. చేతికేమైనా డబ్బుకావలిస్తే నన్నడుగుతుండు" అని వెళ్ళిపొయ్యాడు పొట్టకదిలించుకుంటూ.

గది బాగానేవుంది ఒకమంచం, పరుపు, కుర్చీ, టేబిలు, లైటు. విద్యార్థికింతకంటె యేంకావాలి? కాని యేదో కంపు ముక్కులు పగిలేట్టుగా వేస్తూంది. దాన్ని గురించి "యే"మని అడిగితే, "అది ఫినాయిల్, డి. డీ. టీ వగైరాల మిశ్రమం. ఇంకా, నానారకం కలిశాయి. వాటివల్ల ఆరోగ్యభంగం వుండదు. విధవ నల్లులకోసం, దోమలకోసం వీటిని ప్రయోగించాం. నాలుగురోజులు అలవాటైతే అదే బాగుంటుంది" అని జవాబు.

మరునాటోజే నేను హైస్కూల్లో ఫస్టు ఫారంలో చేరాను. హోటలు ప్రొప్రయిటరే గార్డియన్‌గా తయారయ్యాడు. నాపేరు 'యస్. వి. నాయక్'గా మారింది. కులం ప్రశ్నవొచ్చింది. హెడ్‌మాష్టర్ "నీ కులం ఏమిటి?" అని అడిగాడు. ఏంచెప్పాలి? అనే అనుమానం నాకువచ్చింది. అయినా ఇంకా భారతదేశంలో కులమేమిటి? మత కుల తత్వాలు మాసిపోవాలిగా! అనుకొని అయినా చూద్దామని.

"కులంతో పనేముందండీ. స్వరాజ్యం వొచ్చిందిగా!" అన్నాను. దానికి ఆయన నన్ను ఎగాదిగా చూచి "కరక్ట్ యంత లేవ్, లెస్సగా కస్సాలు కొడతావే! మన ప్రాంతానికి ఆ తత్వం ఇంకా కొన్ని సంవత్సరాల వరకూ అన్వయించదు. తెలిసిందా?" అన్నాడు. పక్కనున్న గుమాస్తా నాతో "నీవు చదివి పెద్దవాడవై ఉద్యోగంచేసి, ప్రమోషన్‌లు తీసుకొని, పెన్షన్ తీసుకునేవరకూ యీ కులతత్వం అడుగడుగునా అడ్డంవొస్తూనే వుంటుంది. బతికుంటే ఆ తర్వాత ఉండదు, బతక్కుంటే అసలే వుండదు" అని వొక్క బిగిని అనేశాడు. దానికి నేను "మా గార్డియన్‌ని అడగండి. ఆయనే ఏదోవొకటి చెబుతాడు" అన్నాను. "అదిగావోయ్ పిచ్చినాయనా! జీతం నాతం లేకుండా వుండే కులం చూసుకొని వేసుకుంటే, తరతరాల వరకూ లాభిస్తుంది. అంతమాత్రంలో పొయ్యేదేముంది? అందుకనే యింతగా చెప్పడం" అన్నాడాయన.

నేను వినిపించుకోకుండానే వొచ్చేశాను తర్వాత మా హోటల్ ప్రొప్రయిటర్ ఏం రాశారో నాకు తెలీదు. నా చదువు ఆరంభమైంది. కాని నాకో చిక్కువొచ్చిపడ్డది. నాకు ముక్కు పొడుగ్గావుందని యిదివరకే చెప్పాను. ఎంత రిపేరుచేసినా వస్తుతత్వమూ మనిషితత్వమూ మారనట్టు నా పొట్టకూడా పెద్దదిగానే వుండిపోయింది అయితే దానికో వైరాగి చిట్కా లభించింది. అదే అమెరికన్ జాకెట్. అది తొడుక్కుంటే లంగా

లాగా- లొడుగు లొడుగ్గా వూగిసలాడుతూ అస్తి చర్మగత నూతన సభ్యతామయ కంకాళం మొదలు కూష్మాండోదరం వరకూ నాకో ఆకారాన్ని కల్పిస్తుంది. తస్సగొయ్యా, దాన్ని కనిపెట్టినోడి కియ్యొచ్చు అచ్చర వచ్చలు. దాంతో పొట్టపీక వొదిలిపోయింది. మిగిలింది జుట్టు. అది నా ప్రాణం తీసిందనుకోండి. పిల్లలందరి చేతులూ, చూపులూ నా జుట్టుమీదనే వుండిపొయ్యాయి. తరగతిలో సగానికి పైగా హిందూ బాలురున్నారు. వాండ్లైనా సానుభూతి చూపలేదు. పైపెచ్చు మిగత వాండ్లకంటే మరీ నన్ను లేవిడి వేపడం మొదలుపెట్టారు చదవకున్నా, ఫెయిలయినా, అబద్దాలాడినా, అత్యాచారాలు చేసినా నోరెత్తేవాడు లేడు హిందూదేశంలో పుట్టిపెరిగిన హిందూ పిల్లకాయలకే యింత రోగాలం నా జుట్టు చూడంగానే ఎందుకు రావాలి? హిందూసమాజం స్వరాజ్యం వచ్చినతర్వాత గూడా యింత రోతగా వుండడం నాకు ఆశ్చర్యమూ, దుఃఖమూ కలిగించింది. ఈ లోపం కుఱ్ఱవాళ్ళల్లోనే కాదు ఉపాధ్యాయుల్లోగూడా కనపడది వీళ్ళంతా యే పాశ్చాత్య దేశాల్లోనో వుట్టివచ్చారా అని అనిపించింది. కొన్నాళ్ళు చూచాను. మెల్లిగా వొకొక్కణ్ణి దగ్గరికి రానిచ్చి షేక్ హ్యాండ్ ప్రారంభించాను. గట్టిగా పిడికిటితో అదిమితే విలవిల తన్నుకోవడమే గాని గట్టిగా నిలవగలమనిషి కనపళ్ళేదు. అంత బలహీనానికి పై చాకచక్యం అంతగా వుంటుంది కాబోలు!

నా చేతిరుచి తగిలినవాడు మాత్రం నా వూసెత్తడం మానేశాడు. ఈ విధంగా నెలలూ, సంవత్సరాలూ గడిచిపోతున్నాయి. ప్రతి సంవత్సరమూ పాసౌతూనే వొచ్చాను. పాసుకావడంలో శ్రమ రుమీ అనిపించలేదు. పైగా ఫైల్ కావాలంటేనే గట్టిప్రయత్నం చెయ్యాలసి వొస్తుందేమో అనిపించింది. ప్రతి ఎండాకాలంలో వెళ్ళి మా నాన్ననూ, అన్ననూ, సోదరులనూ చూచివస్తూ వుండేవాణ్ణి ఇక్కడ చదువు నేను చదవవలసినంతగా లేనందువల్ల, దేశ పరిస్థితులను గమనించడంలో నాకు బాగా కాలక్షేపం జరుగుతూ వచ్చింది హోటలాయనకు యేటేటా సహస్రం ముడుతూ వొచ్చింది. కాబట్టి ఆ ప్రమేయంలో కూడా నిశ్చింతే.

ఈలోగా దేశంలో ఎన్నో శుభాలూ, అశుభాలూజరిగినై. ఎన్నోకష్టాలూ-సుఖాలు గడిచిపోయినై. మొత్తంమీద దేశ వ్యవస్థ చాలావరకు కుదటపడ్డట్టే. కొద్దికాలంలోనే దేశంలో ఎన్నో కార్ఖానాలూ, ఎన్నో నీటి వసతులూ వృద్ధిపొందాయి. కాని, ధరలనాడి నానాటికి మందగించి పోతూంది. జనసంఖ్య పెరగడం దీనికి కారణమంటూరు. పోతు గడ్డలో జనసంఖ్య ఎంత వృద్ధైతే అంత మంచిదేగా! ఇంక రాజకీయ రంగంలో చెప్పాలంటే ఆంతరిక వ్యవహారాలు ఎలాగున్నా, బాహ్యప్రపంచంలో భారతదేశానికి మంచిపేరు వచ్చింది. ప్రజలకి పాలకులతో సాన్నిహిత్యం ఎక్కువైంది. ఉద్యోగస్తుల్లో బంధుప్రేమా, కులతత్వాల్లో పట్టుదలా సంతోషించతగినంత అభివృద్దిలో వున్నాయి. రాజబాటలు చుట్టు, కాబట్టి సన్నిహితమైన దొడ్డిదార్లే లాభాలకూ, సౌకర్యాలకూ అనుకూలంగా వున్నాయి. పరీక్షల్లో పాసులు దిక్కులేనంతగా పెరిగిపోతున్నాయి. కాంగ్రెసంటే కల్లోగూడా సహించనివారంతా మంత్రం వేసినట్టు రొండేసి ఖద్దరు చొక్కాలతో గౌరవాన్ని పొగుజేసుకుంటున్నారు.

అమెరికా విద్యావిధానం, జర్మనీ విజ్ఞానాభివృద్ధి, రష్యా సమానత్వం, ఆంగ్ల పరిపాలనావిధానం వొక్క సారి వొచ్చిపడేసరికి నిరక్షరాస్యులు ఉక్కిరిబిక్కిరై పోతున్నారు. ఇహ మత సామరస్యం చూద్దాం. అమెరికా మొదలయిన మనం అనుకునే మహానాగరక దేశాలోకూడా ఇంకా మతవిషయపు పీడ వొదల్లేదు. కాని భారతంలో హిందూమతం పీడ దాదాపుగా వొదలిపోయిందనే చెప్పవొచ్చు. కొంత మంది సంకుచిత స్వభావంకలవారు హిందూదేశంలోనే హిందూ మతానికి ముప్పు వొచ్చిందని గోల పెడుతున్నారు." ఇతర మతాలవారు కట్టువిడిచి తమ తమ మతప్రచారం చేసుకుంటున్నారు. హిందువు డెవడైనా నోరెత్తి మతాన్ని గురించి మాట్లాడితే అపరాధమూ, శాంతిభంగమూ అవుతున్నది." అంటూ వాపోతున్నారు. కాని వారు తత్వం తెలిసుంటే అటా గాభరాపడరు. "గజం మిథ్య పలాయనం మిథ్య" అన్నట్టుగా, ఉంటేకదా పొయ్యేది? హిందూమతం హిందువుల యెముకలకి పట్టిపోయింది. కాబట్టి అది పైకి కనబడవలసిన అవసరం లేదూ, దాన్ని గురించి ప్రచారం చేయవలసింది అంతకు మొదలే లేదు. అది అంతరామిని అవడంవల్లనే దాని బయటి చిహ్నాలన్నీ అంతరించిపోతున్నాయి. ఇతరులు తమవని ప్రచారం చేసుకునే సర్వ విషయాలూ హిందూ మతాంతర్భాగాలేనని మన పెద్దలకు తెలుసు. అంచేత దాన్ని గురించిన ప్రచారం అనవసరమేకాక అపరాధంకూడా. అందుకనే పెద్దలు ఆ విషయంలో తూష్ణీంభావం వహించారు. వొట్టి తేలిక కాదు. అందరూ టర్కీ టోపీలు పెట్టుకున్నా, క్రాసులు కట్టుకున్నా, కవచ





# గుడ్ బై

ఖడ్గాలు ధరించినా వారికి వోకే.

నేను ఎంత చెడ్డా విద్యార్థిని, ఇవన్నీ నాకు ప్రస్తుతాలు కావు. అయినా ఎందుకు చెబుతున్నానంటే నేను కైలాసానికి వెళ్ళిపోతున్నాను. మళ్ళీ-మళ్ళీ మీతో మాట్లాడ్డానికి నాకు పురసత్తూ వుండదు. చదువూ, సంధ్యా మానుకొని తిరిగి ఇప్పుడే వెళ్ళిపోవడం ఎందుకని మీరు నన్నడుగుతారు. దానికి బలవత్తరమైన కారణం ఉంది. నేను ఈ మధ్యనే స్కూలుఫయినల్ ప్యాసయ్యాను. మాంచి మార్కులు వొచ్చాయి. నా సహాధ్యాయుల్లో ఈ జన్మలో పాసు కారనుకున్న కొందరికి కూడా నాకు కొస్త కుడీ ఎడమగా వొచ్చాయి. ఆశ్చర్యం. నాకు హిందీలో "౦" వారానికి ఆరేసు గంటలు చదివే యింగ్లీషులో నేలనూ-బిసుగావుంటే, ముష్టి రెండుగంటల్లో హిందీ యే మొచ్చిచస్తుంది? అదిగాక, కిందితరగతుల్లో మొదట్నుంచీ హిందీలో సున్నాలొచ్చినా తోసేస్తున్నారాయె. పిల్లలు ఎందుకని చదవడం? మీరే చెప్పండి!

ఇంతకీ అసలు సంగతి మరిచిపోతున్నాను. నేను సర్టిఫికెటు చంకన పెట్టుకొని కాలేజీలో చేరుదామని పట్నానికెళ్ళాను. అహో! కాలేజీ ప్రవేశానికి యేమి తొక్కిడి! అన్నీ చల్లాడాలూ, యిన్‌షర్టులు. అందర్లో నేనొక్కణ్ణే వెక్కిరించినట్టు దిషిపిషతలా వుండిపొయ్యా. నిన్న యేమీ లేనివాళ్ళకి తెల్లవారేసరికి యీ దుస్తులు ఎలాగొచ్చాయి? అంటూ తెరిచిననోరు ముయ్యకుండా చూడసాగాను. ఇద్దరు ముగ్గురితో మాటాడితే "భాషలో పసలేకున్నా వేషంలో నేనోయ్ వుండే పసంతానూ." అని వొకడన్నాడు. తిన్నా తినకున్నా ఎవరడుగుతారు? ఇంతకంటె నేడుమనభారతంలో తరుణోపాయం లేదు. ఈ వేషమే లేకుండా కాలేజీ గడప దాటితే, కాలు బట్టి యీడిచేస్తారు" అన్నాడు మరొకడు "ఇన్‌షర్టుకు ట్రౌషరుకును, ఇన్‌దిస్ దునియాలో – అ– ఆ – అవు చెబుతా" అని ఆపేశాడు ఇంకొకడు.

ఇంతవరకూ అమెరికన్ జాకట్టు నా మర్యాద రక్షించింది ఇన్‌షర్టుతో నా బడాలం బయటపడుతుంది వొస్తేనే హాస్యాస్పదుణ్ణి కావాలసొస్తుంది పైగా యీ కొయ్యలాంటి ట్రౌషరుతో ఒకటా ఇబ్బందులు? ముఖ్యంగా మా నాన్నకు తెలిస్తే వూరుకోడు. కాబట్టి యింగ్లీషు వొచ్చినమటుకు చాలునని తృప్తిపడి కైలాసానికి వెళ్ళిపోతున్నాను. నన్ను మరిచిపోకండి. గుడ్ బై..... సిద్ది. వి. నాయక్." ★

# అమెరికాలో క్రిస్మస్ వేడుకలు

ప్రపంచానికి శాంతిసందేశం వినిపించడానికి 1957 ఏళ్ళ క్రితం అవతరించిన మహాపురుషుడు జీసస్ జన్మదినోత్సవం (డిసెంబరు 25) క్రైస్తవుల పండగలన్నిటిలోకీ ప్రధానమైనది; అత్యంత రమణీయమైనది.

డిసెంబరు మధ్యకాలంనుంచి కొత్త సంవత్సరాదిదాకా, అమెరికాలో ఏ ఇంట చూసినా, ఏ పార్కులో చూసినా, ఏ రహదారి కూడలిలో చూసినా రంగురంగుల దీపాలతో క్రిస్మస్ వృక్షాలు శోభాయమానంగా దృగ్గోచరమవుతాయి. ఏదో అదృశ్య మంత్రహస్తం స్పృశించినట్లు, అమెరికా యావత్తూ విచిత్రంగా మారిపోతుంది. కిటికీలకు, ద్వారాలకు పుష్పతోరణాలు అలంకరిస్తారు. జీసస్ జననదృశ్యాలను చర్చిల్లోనూ, గృహాల్లోనూ అమర్చిపెడతారు. ఎక్కడ చూసినా స్నేహపూరితమైన వాతావరణం కనిపిస్తుంది.

క్రిస్మస్ ఆచారాలు ఒకనాటివి కావు, ఒక దేశానివి కావు. అనేక దేశాల్లో, అనేక కాలాల్లో, అనేక విధాలుగా రూపొందాయి. కాని ఈ వివిధమైన ఆచారాలన్నిటిలోను ఒకటే దివ్య సందేశం, ఇంతకంటె వాంఛనీయమైన జీవితం ఉందనే ఆశ, ప్రపంచ శాంతికి ఆధారభూతమైన సామరస్యంకోసం ప్రయత్నించాలనే ఉద్బోధ నిహితమై ఉన్నాయి.

తమకున్నదానిని ఇతరులతో పంచుకోవడానికి, ఇచ్చివేయడానికి పుట్టిన పండగ క్రిస్మస్. ఆనాడు అమెరికనులు స్వదేశంలో ఉన్నా, విదేశాల్లో ఉన్నా పరిచితులకూ, అపరిచితులకూ కూడా తమ హృదయాల్లోనూ, గృహాల్లోనూ కూడా ఆతిథ్యం ఇస్తారు. అమెరికాలో ఈ పండక్కు చెప్పుకోదగిన విశేషం 'క్రిస్మస్ సీల్' అమ్మకం. జాతీయ క్షయ నివారణ సంఘం ఈ 'సీళ్ళు' అమ్ముతుంది. ఒక్కొక్కటీ ఒక పెన్నీ ఉంటుంది. వీటి అమ్మకంతో వచ్చే ఆదాయాన్ని క్షయనిర్మూలనకోసం వైద్య పరిశోధన చేయడానికి వినియోగిస్తారు.

వివిధ దేశాలనుంచి అమెరికాలో స్థిరపడడానికి వచ్చినవారు అమెరికాలో స్థిరపడిపోయిన తరవాత కూడా తమ తమ దేశాచారాల ప్రకారం క్రిస్మస్ వేడుకలు జరుపుతూ వచ్చారు. స్పానిష్ ఆచారాలు, జర్మనీ ఆచారాలు చిత్రంగా కలిసిపోయి ఈనాటికీ కనిపిస్తాయి. సెంట్ నికొలాస్ లేక ఫాదర్



వాషింగ్టన్ సమీపంలోని 'ఎలిప్స్' మైదానంలో ఏటేటా జరిగే క్రిస్మస్ ఉత్సవ దృశ్యం. వెనుకపక్కగా కనిపించేదే అధ్యక్షుని భవనం. ముందు ఎత్తుగా కనిపించేది (67 అడుగులు) దీపాలంకృతమైన క్రిస్మస్ వృక్షం.



ఒక్క అమెరికాలోనేగాక క్రిస్టియన్లు ఎక్కడవున్నా బాలబాలికలు క్రిస్మస్ పండుగ రోజున దైవప్రార్థనగీతాలు పాడి ఆనందంగా గడుపుతారు. అమెరికన్ బాలబాలికల ఉత్సాహాన్ని చిత్రంలో చూడవచ్చు.

# ★ అమెరికాలో క్రిస్మస్ వేడుకలు ★

క్రిస్మస్ పండగ ముందు రోజున ఉత్తర ధ్రువంనుంచి ధ్రువపుజింకల బండిమీద దిక్కివచ్చే శాంటాక్లాస్ గామారాడు. ఈ శాంటాక్లాస్ బహుమతులు తీసుకొచ్చి మేజోళ్లలో దాచిపెట్టే మాయమైపోతాడని పిల్లలు నమ్ముతారు.



విస్కాన్సిన్ రాష్ట్రంలోని మిల్ వాకీ అనే నగరంలో ప్రజలు సమిష్టిగా క్రిస్మస్ వేడుకలు జరుపుకుంటున్న దృశ్యం.

క్రిస్మస్ ముందు రోజున అర్ధరాత్రి వేళ జరిగే ప్రార్థనలకు చాలమంది అమెరికనులు హాజరవుతారు. మరికొందరు క్రిస్మస్ రోజున చర్చీలలో చేరి 'కరోల్' గీతాలనబడే పాటలు పాడతారు. జీసస్ జన్మకథను పఠిస్తారు. దూరదూరాలనుంచివచ్చి తమ ఇరుగు పొరుగుల్లో నివసించే స్నేహితులను పిలిచి విందుచేయడం మొట్టమొదటి వలస రోజుల్నించీ అనుపూర్వతంగా వస్తున్న క్రిస్మస్ ఆచారం.

క్రిస్మస్ గ్రీటింగ్ కార్డులు పంపించే ఆచారం 19వ శతాబ్ద మధ్యకాలంలో ఇంగ్లండులో పుట్టినదని చెబుతారు. ఇది అమెరికాలో బాగా వేళ్లు పాతుకుపోయింది. గ్రీటింగ్ కార్డులు పంపించని అమెరికన్ కుటుంబమంటూ ఉండదు,

ఇంకొక బ్రిటిష్ ప్రాచీనాచారం కూడా అమెరికాలో కొన్నిచోట్ల కనిపిస్తుంది. కొలరాడోలోని డెన్వర్ వద్ద క్రిస్మస్ ముందరి ఆదివారంనాడు ఒకడు బాకా ఊది యువకు లందర్నీ పురమందిరంలో సమావేశం చేస్తాడు. క్రిస్మస్ పాటలు పాడినతర్వాత వారు ఎర్ర పచ్చటోపీలు పెట్టుకుని హిమావృతమైన అరణ్యానికి వెడతారు. బ్రహ్మాండమైన ఒక దుంగనుకొట్టి తెస్తారు. "భస్మమూ చేయును, క్రిస్మస్ దుంగను!" అనే పాత ఇంగ్లీషుపాట పాడుతూ దాన్ని అంటిస్తారు.

స్కాండినేవియన్లు స్థిరపడిన రాష్ట్రాలలోను, స్కాండినేవియా శీతోష్ణస్థితిని తలపించే రాష్ట్రాల్లోనూ క్రిస్మస్ పండుగవు శీతకాలపు వేడుకలు జరుగుతాయి. స్వీడిష్ జాతికి చెందిన అమెరికన్లు శాంటాలూషియాను ఆరాధన చేస్తారు. ప్రపంచంలోకి వెలుగు తీసుకువచ్చినది శాంటాలూషియా. అందుకని ఉత్సవనాయకురాలు తెల్లటి వదులు దుస్తులు ధరించి, వెలిగించిన కొవ్వొత్తులు తగిలించిన కిరీటం పెట్టుకుని దర్బారు తీరుస్తుంది. తరువాత విందు జరుగుతుంది, పాటలు పాడతారు.

తూర్పునవున్న పెన్సిల్వేనియాలో క్రిస్మస్ ఆచారాలు 1741 నాటివి. "ఇరవై నలుగురు పిల్లలను పిలిచి విందు చేశాము. అందరికీ క్రిస్మస్ బహుమతు లిచ్చాము" అని ఆ ఏటి క్రిస్మస్‌కు ఒకాయన డైరీలో రాసుకున్నాడు. రెండువందల ఏళ్ళ తరవాత ఈనాటికీ పెన్సిల్వేనియాలోని నజరత్, బెత్లెహెమ్ పట్టణాలలో ఈ విందులు జరుగుతూనే ఉన్నాయి.

నైరృతి అమెరికాలో స్పానిష్, మెక్సికన్, రెడ్ ఇండియన్ జాతులకు చెందిన ప్రజల్లో ఆచారాలు భిన్నంగా ఉంటాయి. ప్రాచీన రెడ్ ఇండియన్ ఆచారాలు, నవీన క్రైస్తవ ఆచారాలు కలిసిపోతాయి. అర్ధరాత్రి కాతలిక్ చర్చిల్లో జరిగే ప్రార్థనల తర్వాత ఆటవిక నృత్యాలు జరుగుతాయి. వీధుల్లో పూల తోరణాలు,

(31-వ పేజీ చూడండి)



వైట్ హౌస్ (అధ్యక్షనివాసభవనం) దక్షిణపు ఆవరణంలో క్రిస్మస్ వృక్షానికి అమర్చిన విద్యుద్దీపాలను అధ్యక్షుడు పండుగనాటి రాత్రి మీటనొక్కి వెలిగించి ఉత్సవాలను ప్రారంభిస్తాడు.



క్రిస్టియన్ పాఠకులకు
ఆంధ్రపత్రిక సచిత్ర
వారపత్రిక క్రిస్మస్
శుభాకాంక్షలు.

# పాశ్చాత్య క

# ఏసుక్రీ

# కల్పన



8-వ శతాబ్దం చివరన లభ్యమైన క్రీస్తు శిలావిగ్రహం

అన్ని మతములవలెనే క్రైస్తవ మతమునకు సైతము కళా స్వరూప స్వభావములను ఇచ్చినదని చెప్పవచ్చును. కళావాహిని క్రైస్తవమతమున ప్రసారమై, ఆ మతమును అనుభావింప సాగినంతనే, ఆ మతమునందు సైతము, కళానుసారితములుగా అనేక సాంకేతిక సంప్రదాయములు రూపొందినవి. ఈ సంప్రదాయముల ననుసరించి, అనేకవిధ్యభావము ఉద్భవించి క్రైస్తవమతమునందుగూడ అనేక ఉపవాహినులకు మూలములైన మాట వాస్తవము. ఇంతే గాక, అనేక కళాజనిత భావముల ననుసరించి క్రైస్తవమతము సైతము, మొదట కొనరాని అనేక దివ్యవర్ణములను కూడ అందుకొనిన మాట వాస్తవము.

ఈ మతమునకు ఘనస్వరూపము నిచ్చి సంప్రదాయము లయిన కళాజనిత భావములందు ముఖ్యస్థానమును ఆక్రమించినవి ఏసుక్రీస్తు రూపము, చర్చిల రూపక్రమం, చర్చిలందు వినియోగపడు ఇతర దివ్యరూపములుఅని చెప్పవచ్చును.

మహామత స్థాపకుడైన ఏసుక్రీస్తు దివ్యరూపమును యాతని జీవితమం దెవ్వరుచిత్రించి వుండలేదు. ఆ మహా పురుషుడు గతించిన తర్వాత దాదాపు రెండు శతాబ్దముల వరకు అతని దివ్య సిద్ధాంతములు, ధర్మసూత్రములు మాత్రమే ప్రచారమగు చుండెడివి. ఆ రోజులలో ఈ మతము అతి క్లిష్టపరిస్థితులలో నుండుటచేత, క్రైస్తవులు తమ మతమును, ప్రచారమును, రహస్యము, అతి గూఢముగానే వుంచుకొనెడివారు. కొని ఒకరి నొకరు ఎరుకపరచుకొనుటకై, మత్స్య రూపమును క్రీస్తుకు చిహ్నముగా తమలో తాము వాడుకొను చుండెడివారు. ఈ చేప రూపమును వారు వాడుటకు కారణము బైబులు గ్రంథమున నున్న ఒక చిత్రకథ యందు తెలియనగును. ఈ కథ సారాంశ మేమనగ ఏసుక్రీస్తు ఒకనాడు, అతి దీనదెసల పసిత పెక్కి, వారికి అనంత అదృష్టమును కల్పించి, అనేక చేపలు వారి వలలలో పడునట్లు చేసెను.

ఈ రెండు శతాబ్దములు పూర్తి అగుపరికి, అనేక ఇతర మతస్థులు క్రైస్తవ మతమును అవలంబింప సాగిరి. ఇంతటి మహత్తర మతమును ప్రబోధించిన ఆదివ్యపురుష మూర్తి రూపమును దర్శించి ఆనందింపవలెనను సహజ కుతూహలము వారికి జనించి



4-వ శతాబ్దంలో రచించిన క్రైస్తవ గ్రంథాలలో లభ్యమైన క్రీస్తు చిత్రానికి ప్రతిచిత్రం

ఆమంచ్ర

నది ఏలనన క్రై
అవలంబించిన
విగ్రహారాధకులే
నిల్పికొలచుట వ
నూతన దివ్యభావ
కళాకర్తలకు క్రై
తమ అభి్రాయ
మొదట్లు అవకాశ
లను అనంతముగ,



11-వ శతాబ్దం
క్రీస

## ...ాకారుల కృషి:

# ...స్తు రూప ...వి శేషాలు

శ్రీ
...గోపాలరావు

...స్తవ మతమును నూతనముగా
...వారందరు అంతకుముందు
...ఇష్టదైవరూపమున కెదురుగ
...రి అలవాటు ఇదే ఒక
...ాంతర సమయము మహా
...స్తవ మతమందు సైతము,
...ల్పింపజేసి, అనుభావిత
...ము కలిగినది. ఏసు మూర్తి
...కళాకారులు చిత్రింప

మొదలు పెట్టిరి.

ప్రప్రథమమున రచించిన ఏసు రూపము లందు క్రీస్తు అతి అందమయిన బాలుడు. ఉంగరములు తిరిగిన చిరుకురులు, విశాల నేత్రములు, విశాల ఫాలము కలిగిన అందమయిన బాలునిగా నాటి కళాకర్తలు క్రీస్తు రూపమును రచించిరి కాని కొందరు కళాకర్తలు క్రీస్తు రూపమును అందమయిన బాలుని వలెనే చిత్రించుచూ, నిడుపైన కురులను కల్పించెడివారు

నాలుగవ శతాబ్దారంభమున క్రైస్తవ మతమున కొక మహోదయమైనది చక్రవర్తి కాన్‌స్టెంటైన్ తాను క్రైస్తవ మతము నవలంబించి, ఆ మతమునకు రాజాదరణమే గాక, రాజ పోషణ సయితము నొసగెను. అనాటి వరకు గుహ్యముగా చాటున పెరుగు



...లో గ్రంథస్థమైన ...చిత్రం



4ఎవ శతాబ్దంలోనే రోమ్‌వద్ద గుహలలో రచించిన క్రీస్తు చిత్రం



మద్రాసునగరంలో వున్న (మైలాపూరు) పురాతనమైన శాంథోమ్ చర్చిభవనదృశ్యం

చున్న క్రైస్తవమతము ఒక్కసారిగా బాహాటముగ విజృంభింప సాగినది అనేకమంది కళాకర్తలు ఏసు సిద్ధాంతముల ననుకరించుచూ అతిశయించిన ఉత్సాహముతో తమ ఆత్మోజ్వలన విశేషములను ప్రకటింప మొనర్పసాగిరి.

చక్రవర్తి ఏసుక్రీస్తును అనుసరించుటచేత చక్రవర్తికి మించిన పురుషుడు ఏసు అను ఒక నూతనభావన మానాడు ప్రప్రథమమున ఉద్భవించినది. అందుచేత చక్రవర్తులను మించిన ఆత్మ సంపన్నుడు ఏసు క్రీస్తు కళాకర్తలానాడు చక్రవర్తులను మించిన ఆ దివ్య పురుషుని ఉజ్వల సింహాసనముపై ఉపవిష్టు నొనర్చి, కిరీటమును సయితము కల్పించి, చిత్రింప సాగిరి ఇంతేగాక భూగోళమును అతని కరము లందుంచి, భూచక్ర మంతటిని అతని స్వాధీన మొనర్చి అంకితము చేసిరి

కాని క్రీస్తు రూపభావ పరిణామమింతటితో నాగిపోలేదు అట్టి దివ్యమతమును ప్రబోధించిన మహాపురుషుకు ప్రాచీనతత్వవేత్తల నందరిని మించెనను మరొకభావము సయితమానాడు ఉత్పన్నమయినది. ఈ భావము ననుసరించి క్రీస్తురూపము అతి ప్రాచీనమయిన గ్రీకు తత్వవేత్తలను పోలి యుండవచ్చునను అభిప్రాయముకూడ రూపొందినది. కళాకర్తలు ఈ భావము నను

# ★ ఏసుక్రీస్తు రూప కల్పన విశేషాలు ★

సరించినాడ క్రీస్తు రూపమును చిత్రింప సాగిరి. అందుచేత ఆనాడు చిత్రితములయిన క్రీస్తు రూపములకు ప్రాచీన గ్రీకు తత్వవేత్తలకు వలెనే పెద్దకురులు, గడ్డము, కాక ప్రధాన యుడుపైన పెద్దకాలుక పొంద లయిన వాటిని కళాకారులు కల్పించిరి.

దాదాపు పదవ శతాబ్దమువరకు కళాకారులు, ఏసుక్రీస్తును ఈ రూపముల నన్నింటను చిత్రించుచుండిరి. ఆనాడు ఆ మతకులు రచించిన మతగ్రంథములందు ముఖ్యమైన రెండు రూపములు అనగా బాలక రూపము, గడ్డమున్న తత్వవేత్త రూపము ఎక్కువగా కానవచ్చును. కాని, ఈ రూప రచనలు సంపూర్ణముగా ప్రకృతి ననుసరించు మనుష్యస్వరూపమును పోలివుండవు.

ఇట్లు ఏసురూపమును, నాటి కళాకర్తలు అనుభావిత మొనర్చుటకు ప్రబల కారణము కలదు. అది ఒక దివ్యభావము. దేవుని కుమారుడగు ఏసుక్రీస్తు మానవు నతిశయించును. అతని స్వరూపము సయితము, మానవస్వరూపమును మించును. అతని ఆత్మవలెనె రూపము కూడ దివ్యమయినది. ఇట్టిభావము మనదేశపు బౌద్ధ, జైనకళలందు సయితము కానవచ్చును. బౌద్ధులు, జైనులు కూడ వారి మతకర్తల స్వరూపములేగాక, ఇతర సిద్ధపురుషులరూపములను, తీర్థంకరుల రూపములను సయితము తీర్చిదిద్ది దివ్య లక్షణములను చేర్చి, నిజమానవ స్వరూపమునకు భిన్నముగా చిత్రించిరి. ఈ భావము ననుసరించే, ప్రకృతికి భిన్నమయిన ఒక సమాకారత దివ్య పురుషులందరికి కళలందు నాడు చేకూరినమాట వాస్తవము.

కాని రెనేజాన్సు కాలము—అనగా పదునైదవ శతాబ్దము—వచ్చుసరికి, యూరపునందు పాండిత్యము ప్రాధాన్యము వహించినది. ప్రకృతి అనుకరణ అభ్యాసమె కళాకర్తల ప్రబలఉద్దేశ్యము అయినది. ఏసుక్రీస్తు సయితము, ఎంతదివ్యమయిన అందము కలిగి నప్పటికినీ, మానవస్వరూపుడే అను భావము ప్రబలినది. అందుచేత ఈ భావపరిణతి ననుసరించి, కళాకర్తలానాడు, ఏసురూపమును చిత్రించునపుడు, ప్రకృతి ననుసరించుచూ అందమయిన మానవస్వరూపమును చిత్రించుచు, ఆరూపమున కొక దివ్యత్వము కల్పింప ప్రయత్నించిరి. అంతేకాని వారి ఆత్మానుభవములు జడమైన ప్రకృతినిమించి ఉజ్జ్వలితములు కాలేకపోయినమాట సత్యము. అందుచేత వారు దివ్యబాలునిగా ఏసుక్రీస్తును చూడక, మహాపండితుడైన తత్వవేత్తగానే వీక్షించి, గడ్డమున్న ఏసునే చిత్రించిరి. ఈ రెనేజాన్సు కాలమున పరిపాటిఅయిన క్రీస్తురూపమును, నేటిలోక మంతయు ఎరుగి యున్నది. దానినే అసలి స్వంతరూపముగా భావించెదరు.

నిజము! కళాకారునిశక్తి అపారము!

క్రైస్తవ మతమునందు ఇతరసాంకేతిక చిహ్నములు ఈరీతినే కళాకర్తల హృదయములందుద్భవించి, అమత విభూతిఅయినవి. ఇందు ముఖ్యమయినవి చర్చి, చర్చిభవనాలలో వినియోగపడునవికొన్ని. ఈ చిహ్నములననుసరించి క్రైస్తవ మతమందుకూడ ఒకపరిభాష ఏర్పడినది.

## చర్చి భవనాలు

ఆదిలో చర్చిలకు నేడున్న రూపము లేదు. ప్రాచీన బౌద్ధచైత్యముల చందమున నిర్మించెడివారు. బౌద్ధచైత్యమందు స్థూపముండు స్థలమును-చర్చిగర్భస్థానముగ చేసి అచటినుండియే దైవధ్యానమును ప్రసార మొనర్చుచుండెడివారు. అదే చర్చి భవనములలో కనుపించు అల్లారు. కాని గాథిక్ కాలమొచ్చుసరికి (అనగా దాదాపు క్రీస్తుశకము పన్నెండవ శతాబ్దమునకు) చర్చినిర్మాణక్రమము శిలువ, అనగా 'క్రాసు' రూపమును అనుకరించినది. ఏలనన ఏసుక్రీస్తు తన సిద్ధాంతములకొరకై, ఇట్టిశిలువమీదనే బలిదానము చేసెను. అందుచేత, పాపకలుషిత మానవుడు ఈ క్రాసు గర్భమందే, అనగా అట్లు నిర్మితమయిన చర్చిలలోనే విమలజీవనము, ప్రేమ, క్షమాపోతుములను పొందగలడని భావము.

గాథిక్ కాలమున చర్చిల కిరువైపుల దివ్యపురుషుల (Apostles), దేవదూతల (Prophets), సంతుల, (Saints) మరియు దివ్యకన్యయగు మేరీమాత ప్రతిమల నుంచెడివారు. వీరలముఖములచూచి, వీరల ననుసరించియే, మానవుడు నిర్మలమనస్కుడై చర్చిలోనికి అనగా దైవసాన్నిధ్యమునకు నడువగలడని భావము. దీనిలో పడమటిభాగమందు ఏసుక్రీస్తు రూపము చిత్రించి యుండును. ఇందు ఏసుక్రీస్తు రూపము సింహమునూ, రెక్కలపామునూ త్రొక్కుచుండునటుల చిత్రించెడివారు. ఈ రూపమందు ఏసుక్రీస్తు కుడిచేతి హస్తి అందరకు ఆశీస్సుల నొసగుచుండును. అతని ఎడమచేతియందు, క్రైస్తవమత సిద్ధాంతములుగల బైబిలు గ్రంథముండును. ఈ ఏసుక్రీస్తు రూపమును పరివేష్టించి మాసముల నిర్దేశించు పన్నెండురూపములూ, మీన మేషాది నక్షత్ర కూటముల నిర్దేశించు రూపములూ ఉండును. ఈ చిత్రసంకలన మంతయు చూచినంతనే, ఏసుక్రీస్తే విశ్వమున కంతటికి కేంద్ర పురుషుడను భావము ద్రష్టకు తప్పక తోచును.

ఇట్టి సాంకేతికములైన చిహ్నము లనేకములు (క్రైస్తవ మతమునకు చెందినవి) నాడు క్రైస్తవకళయందు దుత్పన్నములైనవి. ఇందు ముఖ్యమయిన స్వరూపము నొక్కదానిని పేర్కొనదగును. కొన్ని క్రైస్తవ శిల్పములందు, ఏసురూపము చుట్టును నాలుగు ఇతరరూపములను ఏర్పరచెడివారు. అవేవనిన సింహము, గరుడము, ఆవుదూడ, రెక్కలు కలిగిన మానవరూపములు. ఈ నాలుగురూపములు ఏసు కతిదగ్గరైన నలుగురి సంతురూపముల నుద్దేశించును. సింహము మహాపురుషుడయిన 'సంతు మార్కు'నుద్దేశించును, నేటివరకు బ్రిటిషు వారి పతాకముపై ఎల్లరెరిగిన సింహము, మృగరాజ రూపముకాదు. ఈ సింహరూపము, ఇంగ్లండు చక్రవర్తులకు ఇష్టుడయిన సంతుమార్కు నుద్దేశించునది. గరుడము సంతుజాను నుద్దేశించును. గరుడపక్షి సూర్యునివంక కండ్లార్పనవసరము లేకయే దృష్టిసారించగలదు. అదేరీతి సంతుజాను కండ్లుమిరుమిట్లు గొలుపు తేజోస్వరూపుడైన దైవమును, ఎదురుగా నిలచి, నిశ్చల నేత్రములతో వీక్షింపగలడు. అనగా అతడంతటి మహాత్ముడు. ఆవుదూడ సంతు ల్యూకును ఉద్దేశించును. ఒక్కొక్కప్పుడీ ఆవుదూడకు పక్షము లమర్చుచుండిరి. రెక్కలు కలిగిన మానవరూపము సంతుమాథ్యూ నుద్దేశించెడిది.

ఒక్కొక్కప్పుడు నాటి కళాకారులు గరుడ పక్షిచే ఏసుక్రీస్తును కూడా నుద్దేశించుచుండిరి. ఇందలి భావము సైతము సంతు జాను భావము వంటిదే. ఈ రీతిగనే మన ప్రాచీన, హైందవ కళయందు సైతము ఒకే రూపము పలుభావములకు చిహ్నమయినది. ఇట్టి చిహ్నములను సృష్టించుటకు కారణ సమస్యలు సర్వ కళాకారులకు సామాన్యమనే చెప్పవలయును.

ఇంతేగాక, ప్రాచీన బౌద్ధ, హైందవ కళలవలె చిత్రముల రూపమున కథలు చెప్పు నవసరము కూడ ప్రాచీన క్రైస్తవ కళాకారులకు ఏర్పడినది. అందు చేత మన ప్రాచీన హైందవకళవలెనే ప్రదేశ నిర్దేశమునకయి ప్రాచీన క్రైస్తవ కళయందు సయితము కొన్ని చిహ్నము లేర్పడినవి. చిత్రమందు ఒక వృక్షమున్న యెడల, ఆ సంఘటన భూమిమీదనని అర్థముచేసికొనవగును. సమదూరమున అడ్డరేఖలు కన్పడిన అది సముద్రమని ఎరుగదగును. ఈ రీతినే కవాటము కలిగిన స్తంభ వాస్తు రూపము కన్పించిన, ఆ సంఘటననగరమందని విస్పష్టమగును. ఇట్టి సాంకేతికము లన్నియు కళా స్వభావమున కళాకర్తల హృదయములందే జనితములైనవని వేరుగ చెప్ప నవసరము లేదు.

ఇట్టి అనేక దివ్య కళా భావనలతో శతాబ్దముల పర్యంతము, క్రైస్తవమతము రూపమందుకొని పెరిగినది. కాని సర్వ మతముల వలెనే, క్రైస్తవమంతమందు సయితము, అనేక ఉపవాహి లుత్పన్నములై ప్రసారిత మగుచున్న మాట వాస్తవము. ఇందు నేడు అమితముగాయున్న ప్రాటెస్టెంటు మతస్థులు ఇట్టి చిహ్నములను వాడరు. వారు తమ మతస్వరూపమును నిర్మల ఆత్మస్వరూపముగా చేయగోరి, నిరాలంకార మొనర్చిరి. అందుచేత ఇట్టి కళాభావములు, చిహ్నములు వారి చర్చీలందుకాని, వారి మతానుసారిత చిత్రశిల్పములందు కాని మనకు నేడు గోచరించవు. ★

## అమెరికాలో క్రిస్మస్

(26 వ పేజీ తరువాయి)

దీపాల తోరణాలు నేత్రపర్వంగా కనిపిస్తాయి. ఇసక బస్తాలలో కొవ్వొత్తులు వెలిగించి ఇళ్ళముందు అందంగా అమరుస్తారు.

క్రిస్మస్ పండగ పాటలకు పెట్టింది పేరు. పండగ ఇంకా చాలా రోజులుండగానే చర్చీలలో వాద్యబృందాలు రిహార్సల్సు మొదలు పెడతాయి. వివిధ దేశాలకు చెందిన క్రిస్మస్ ప్రార్థన గీతాలను చర్చిగాయకులు సాధకం చేస్తారు.

డిసెంబరు **24** వ తేది సాయంత్రం చీకటి పడ్డాక, రాజధానిలో అమెరికా అధ్యక్షుడు సకుటుంబంగా, బంధుమిత్ర పరివేష్టితుడై ఒక ఎలక్ట్రిక్ మీట నొక్కుతాడు. భవనం ఆవరణలోని పచ్చికమైదానంలో ఉన్న ఎత్తయిన వృక్షం నిండా రంగు రంగుల దీపాలు వెలుగుతాయి. వేడుకలు పూర్తయిన తర్వాత, అధ్యక్షుడు శాంతి సౌహార్ద్రాల సందేశాన్ని ప్రపంచప్రజలకు అందజేసి, క్రిస్మస్‌కు స్వాగత మిస్తారు.

అమెరికన్ కుటుంబాలకు క్రిస్మస్ సంతోషం, ఉల్లాసం కలిగించే పండగ. ఇళ్ళల్లోనూ. చర్చిల్లోనూ కూడా ఎన్నో వినోదాలు, విశేషాలు జరుగుతాయి. యువ దంపతులు నిద్రకళ్ళతో తూగుతున్న చంటి పిల్లని ఎత్తుకుని ఇరుగు పొరుగు పిల్లలతో తమ అమ్మాయి కూడా చేరి పాడే క్రిస్మస్ గీతాలను వింటూ తన్మయులై పోవడం నిజంగా మనోహర దృశ్యం.

(యు. ఎస్. ఐ. ఎస్.)

★

# నక్షత్రఫలితాలు

**( 25-12-57 మొదలు 31-12-57 వరకు )**

బి. నరసింగరావు

### గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| | ది 25 న శని ఉదయించును. ది 31 న బుధుడు ఉదయించును. మకర, కుంభ, మీన, మేషములలో చంద్రుడు. | | |
| శు | | | |
| ర బు | కు శ | గు రా | |

***అశ్విని [చూ, చే, చో, లా]***

ఈవారము మిత్రులతో కలిసి వినోదములలో పాల్గొంటారు. శుభకార్యములగురించి ఆలోచనచేస్తారు. వాహన యోగము వుంటుంది. వర్తకులు ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో లాభము పొందుతారు. నూలు, బట్టల వ్యాపారస్తులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలు కాలము. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. 26, 27 తేదీలలో కార్యాచరణలో త్రిప్పట, శ్రమ, ఆపైని యోగకాలము. 31 తేదీన స్వల్పముగా అనారోగ్యం.

*** భరణి [లీ, లూ, లే, లో] ***

ఆదాయము వృద్ధిచేసుకుందికి చేసేప్రయత్నాలు ఫలించవు. కార్యభారము ఎక్కువ. అకాలభోజనమువల్ల ఆరోగ్యము చెడుతుంది. పితృవర్గమునుండి ఆశించిన ధనసహాయము కలుగపోవుటచే గృహావసరములు తీరవు. విద్యార్థులకు చదువుపై శ్రద్ధతక్కువ. 26, 27 తేదీలలో కార్యభంగము, అస్థిమితము, మనోవ్యథ. 28, 29 తేదీలలో ప్రయాణము స్వల్పలాభయోగము. 31 న ఆరోగ్యభంగము.

***కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ]***

ఈవారము మీకు అంతయోగకాలము కాదు. మొదట్లో కార్యభంగమైనను వారాంతమునకు అనుకొని మిత్రులు సహాయము చేయుటమువల్ల అనుకూలించును. ఆర్థిక చిక్కులు ఎదుర్కొనవలసి వచ్చును. ఉద్యోగస్తులకు ఒత్తిడిఎక్కువ. వ్యాపారస్తులకు మాంద్యముగా వుంటుంది. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తక్కువ 26,27 కార్యభంగము శ్రమ, అస్థిమితము. 28, 29 తేదీలలో ప్రయాణము, మిత్రదర్శనము, కార్యసిద్ధి. 31 న అనారోగ్యము.

***రోహిణి [ఓ, వా, వీ, వూ]***

ఈ వారము మీకు మిశ్రమయోగము. కార్యాచరణలో ఆటంకాలు కలుగుతాయి. బుద్ధిబలమును ఉపయోగించి కార్యసిద్ధికి ప్రయత్నిస్తారు. ఈశ్వరానుగ్రహమువల్ల అన్నీ సాధ్యపడతాయనే ధైర్యముతో వ్యవహరిస్తారు. ఉద్యోగస్తులకు అస్థిమితము. వర్తకులకు ఆరాటన. విద్యార్థులకు చదువు సవ్యముగా సాగకపోయినను, కొత్త విషయాలు నేర్చుకుంటారు. 26, 27 తేదీలలో నిలకడలేనిస్థితి, శ్రమ, 28, 29, 30 తేదీలలో ప్రయాణము, ఆత్మనివాసము, కార్యలాభము. 31 న గృహమందుండువారి ఆరోగ్యము గురించి ఆందోళన.

*** మృగశిర [వే, వో, కా, కీ] ***

గతవారమువలెనే ఈ వారము కూడ ఆదాయాభివృద్ధికి అధిక కార్యభారమును పైన వేసుకొంటారు. అవి ఫలించక ఆశాభంగము పొందుతారు. కోర్టు వ్యవహారములలో కొంత అనుకూలత ఉంటుంది. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి వ్యాపారస్తులకు లాభము తక్కువ. ఆరోగ్యము చెడే సూచనలున్నవి. వ్యవహారము పట్ల దుష్టస్త్రీలతో వివాదము, 26, 27 తేదిలలో కార్యభారమువల్ల శ్రమ 28, 29, 30 తేదీలలో కొంత అనుకూలత. 31 న వివాదము. మనోవ్యథ.

*** ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] ***

సాహసముతో శ్రమకలిగే పనులు మొదలుపెట్టి ఫలించక నిరాశ చెందుతారు. తోబుట్టువుల సహాయముచే కార్యసాధన పొందుతారు. అవసరములు తీరక గృహమందు అసంతృప్తి కలుగుతుంది. ఉద్యోగస్తులు అధికారులచే మాటపడి మనోవ్యథ పొందుతారు. విద్యార్థులు వినోదములలో పాల్గొని ప్రమాదములకు గురియౌతారు. ఇనుపసామానులు, రంగుల వర్తకులకు లాభము. 26, 27 తేదీలలో కార్యభంగం, నిరాశ. అశాంతి. 28, 29, 30 తేదీలలో ప్రయాణము, సోదరసహాయము, కార్యసిద్ధి. 31 న ప్రమాదము.

*** పునర్వసు [కే, కో, హా, హీ,] ***

ఈవారము మీ బుద్ధిబలముచేతనూ, పదవిలోనున్నవారి సలహావల్లనూ కార్యసాధన పొందుతారు. మిత్రులను కలుసుకుంటారు. దూరమందున్న ఆప్తుల క్షేమవార్త వింటారు. ఆరోగ్యము బాగుపడుతుంది. విద్యార్థులు కొత్తవిషయాలు నేర్చుకుంటారు. వైద్యులకు, మందుల వర్తకులకు లాభము. కవులకు, కళాకారులకు, గణితశాస్త్రజ్ఞులకు మేలు కాలము. 26, 27 తేదిలలో కార్యాచరణలో త్రిప్పట, అశాంతి. 28, 29 30 తేదీలలో ప్రయాణము, మిత్రదర్శనము, కార్యలాభము. 31 న అనారోగ్యము.

***పుష్యమి [హూ, హే, హో, డా]***

ఈవారము మీహోదా పెరుగుతుంది. సంఘములో పలుకుబడి ఎక్కువవుతుంది. విజ్ఞానులవల్ల కొత్తసంగతులు తెలుసుకుంటారు. పిల్లల అభివృద్ధికొరకు ప్రయత్నాలుచేస్తారు. విద్యార్థులు శ్రద్ధగా విషయాలు నేర్చుకుంటారు. పండితగోష్ఠిలో పాల్గొంటారు. న్యాయవాదులకు, కళాకారులకు, పండితులకు యోగించును. 26, 27 తేదీలలో కార్యసాధనలో త్రిప్పట, శ్రమ, 28, 29, 30 తేదీలలో ప్రయాణము బంధుసమాగమము, కార్యసిద్ధి. 31 న అస్వస్థత.

***ఆశ్రేష [డి, డూ, డే, డో]***

గత వారము కలిగిన శుభయోగము ఈ వారముకూడా వుంటుంది. చిక్కులు తీరిపోతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది. బంధువులను కలుసుకొని లాభము పొందుతారు మృష్టాన్నభోజనముతో వినోదిస్తారు. గృహమందు కలిగిన అశాంతి తొలగుతుంది. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ కలుగుతుంది. వెండి వర్తకులకు ప్రయాణమువల్ల లాభం. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. 26, 27 తేదీలలో ఖర్చులుఎక్కువ. త్రిప్పట, అశాంతి, శ్రమ. 28, 29, 30 తేదిలలో ప్రయాణమువల్ల కార్యలాభము, శుభయోగము.

*** మఖ [మా, మీ, మూ, మే] ***

ఈవారము మీకు యోగదాయకంగా వుంటుంది. గతవారం అసంపూర్తిగా వున్న

## ధరలు

**నూలు**, వస్త్రములు:—చురుకగును. నూనె దినుసులు: మందముగా వుండును.

బెల్లము, పంచదార, చింతపండు:— సమస్థాయిలో నుండును.

ఆహార ధాన్యములు:—మందముగా వుండును.

పప్పుదినుసులు: తగ్గుదల చూపును.

వెండి, బంగారము. సమస్థాయిలో నుండును.

దక్షిణదేశమున అప్పుడప్పుడు వర్షించును. మేఘాడంబరము ఎక్కువగా వుండును. అప్పుడప్పుడు వాయుపీడన కూడా వుండును.

జన్మనక్షత్రమునుబట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్లననుసరించి పేరు మొదటి.యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, వృష్ణుడను పేరునకు స్వాతియును, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకోనునది.

కార్యములు ఈవారం లాభకరముగా ముగించుకుంటారు. వాహనయోగం ఉంది. వర్తకులు ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో లాభము పొందుతారు. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం. 26, 27 తేదీలలో త్రిప్పట, అశాంతి 28, 29, 30 తేదీలలో అప్తులతో విందు, వినోదము, శుభవార్త 31 న అనారోగ్యము.

### * పూర్వ ఫల్గుణి (పుబ్బ) *
### [మో, టా, టీ, టూ]

ఈవారము పితృవర్గమువల్ల పొందిన సహాయముతో అవసరాలు తీరనందున అసంతృప్తి కలుగుతుంది. ఆర్థికాభివృద్ధికి చేసే ప్రయత్నాలలో ఆశాభంగం పొందుతారు. కార్యభారముచే వేళతప్పిన భోజనమువల్ల ఆరోగ్యం చెడుతుంది. శ్రద్ధ వహించడం మేలు ఉద్యోగులు కొత్త సమస్యలు తలెత్తుటచే ఆరాటన పడతారు. వర్తకులకు ఒడిదుడుకులు కలుగుతాయి. 26, 27 తేదీలలో కార్యభారముచే త్రిప్పట, అశాంతి. 28, 29, 30 తేదీలలో ప్రయాణము, స్వల్ప లాభయోగం. 31 అనారోగ్యం.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

సకాలమునకు ధనాదాయము కలుగక పోవుటచేత యత్నకార్యములు నెరవేరక మనోవ్యథ కలుగుతుంది. మీకు వ్యతిరేకులని అపోహపడినవ్యక్తి సహాయమువల్ల కార్యలాభము పొందుతారు. వ్యాపారస్థులకు మొదట్లో అనుకూలము లేకపోయినను వారాంతమునకు లాభిస్తుంది. విద్యార్థులకు చదువుపై అశ్రద్ధ. 26, 27 తేదీలలో అధిక ఖర్చులు, కార్యభంగం, శరీరాయాసము, 28, 29, 30 తేదీలలో ప్రయాణము, మిత్రసహాయము, కార్యసిద్ధి, 31 న మీకుగాని ఇంట్లో వున్న ముసలివారికిగాని అనారోగ్యము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మిశ్రమ ఫలములు కలుగును. కార్యహానివల్ల గృహకలతలువచ్చి నిరుత్సాహ పరిస్థితులు ఏర్పడుతాయి. అయినను పుణ్య కార్యాచరణ, ఆధ్యాత్మిక చింతలవల్ల శాంతిని పొందుతారు. కుటుంబములో వారి ఆరోగ్యము గురించి కలవరపాటు చెందుతారు వ్యాపారస్థులకు నిరాశ. ఉద్యోగస్థులకు ఒత్తిడి ఎక్కువ. విద్యార్థులకు చదువుమీద ఆసక్తి తక్కువ 26, 27 తేదీలలో కార్యహానివల్ల అశాంతి, త్రిప్పట. 28, 29, 30 తేదీలలో జ్ఞానుల సాంగత్యమువల్లపుణ్యకార్యాచరణ, శాంతి. 31 నగృహమందుండువారి ఆరోగ్యము గురించి చింత.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కార్యభారము అధికమగుటవల్ల శ్రమ. కోర్టు వ్యవహారములు కొంత అనుకూలించవు. ఇచ్చిపుచ్చుకోనేపట్ల నీచస్త్రీలతో వివాదము. ఉద్యోగస్థులకు అవమానము. వర్తకులకు ఆందోళన. భార్యకుగాని ఇంట్లో మరే స్త్రీకిగాని అనారోగ్యం. విద్యార్థులకు బద్ధకము. 26, 27 తేదీలలో కార్యభంగము, వివాదము. 28, 29, 30 తేదీలలో త్రిప్పట, కార్యానుకూలత. 31 ఆరోగ్యచింత.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీ సామర్థ్యమునంతటినీ ఉపయోగించి కార్యాచరణకు మొదలు పెట్టినను ఫలము కలుగదు. అయినను అధైర్యపడక ప్రయత్నిస్తూవుంటారు. అందువల్ల క్రమేణా కష్టములుగడిచి మేలు పొందుతారు. సోదర సహాయముతో చాలావరకూ ఒడిదుడుకులు సర్దుబాటుఅవుతాయి. యంత్రముల వల్లగాని, అగ్నివల్లగాని ప్రమాదము కలగవచ్చును. జాగ్రత్త పడిన నివారణ కావచ్చును. 26, 27 తేదీలలో అస్థిమితము త్రిప్పట. 28, 29, 30 తేదీలలో ఆదాయవృద్ధి, సహాయము, కొంత శాంతి 31 న ప్రమాదభయం.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము మీ స్వబుద్ధితో కార్యానుకూలత పొందుతారు. అధికారము, హోదా పెరుగుతాయి. కొత్తవారి పరిచయము కలుగుతుంది. దూరముందున్న ఆప్తుల కుశలవార్త తెలియుటవల్ల శాంతి పొందుతారు ఉద్యోగస్థులకు అధికారుల ఆదరణ కలుగుతుంది. డాక్టర్లకు, మందుల వ్యాపారస్థులకూ లాభం. కవులకు, చిత్రకారులకు, నటనటులకు యోగకాలము. 26, 27 తేదీలలో కార్యాచరణవల్ల త్రిప్పట, శ్రమ. 28, 29, 30 తేదీలలో ప్రయాణము, అధికారుల ఆదరణ, మిత్రదర్శనము, కార్యలాభం, విద్యార్థులకు విజ్ఞానాభివృద్ధి, 31 అనారోగ్యము.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీకు యోగకాలము. ఆర్థికస్థితి అభివృద్ధి చెందుతుంది కోర్టు వ్యవహారాలు మీ పరంగా తీర్పుఅవుతాయి. పండితగోష్ఠిలో పాల్గొని నూతన విషయాలు తెలుసుకుంటారు. విద్యార్థులు ఉత్సాహముతో చదువుకుంటారు. ఉద్యోగస్థులకు హోదా పెరిగే సూచనలున్నది. పిల్లల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. న్యాయవాదులకు, పండితులకు,

#  నక్షత్ర ఫలితాలు 

కళాకారులకు మేలుకాలము. 26, 27 తేదీలలో కార్యాచరణలో శ్రమ. 28, 29, 30 తేదీలలో ధనయోగము, కార్యసిద్ధి, పండిత సాంగత్యము, విజ్ఞానార్జన, 31 న అనారోగ్యము.

***జ్యేష్ఠ [నో, యా, యి, యు]***

ఈ వారం యత్న కార్యాలు అనుకూలిస్తవి. ఆర్థికస్థితి కొంత మెరుగుగా ఉంటుంది. మిత్రులతో వినోదములలో పాల్గొంటారు. ఆగ్నేయ దిక్కు నుండి శుభవార్త వింటారు. వ్యాపారస్తులకు ముఖ్యముగా వెండి వర్తకులకు లాభయోగము. విద్యార్థులకు చదువుపై ఆసక్తి ఎక్కువవుతుంది. కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం. 26, 27 తేదీలలో కార్యభారం, త్రిప్పట, శ్రమ. 28, 29, 30 లలో ఆర్థిక లాభము, కార్యసిద్ధి, శుభవార్తా శ్రవణము. 31 న అస్వస్థత.

***మూల [యే, యో, బా, బీ]***

ఈ వారము మీ హోదా పెరుగుతుంది. బంధు మిత్రులతో కలసి విందు భోజనము ఆరగిస్తారు. కవులు, గాయకులు మొదలగు కళాకారులతో వినోదిస్తారు. దూరప్రయాణము చేయవలసి వస్తుంది. పుణ్యకార్యాలలో పాల్గొంటారు. శుభకార్యాలోచన చేస్తారు. ఉద్యోగస్తులకు మంచికాలము. నూలు, బట్టల వ్యాపారస్తులకు లాభము. విద్యార్థులకు ప్రోత్సాహకరముగా వుంటుంది. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. 26, 27 తేదీలలో త్రిప్పట, శ్రమ, అధికఖర్చులు. 28, 29, 30 లలో ప్రయాణము, కార్యలాభము. శుభకార్యాలోచన. 31 న ప్రయాస.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]***

ఈ వారము ఎంత శ్రద్ధ వహించినా వ్యాపారవృత్తులలో కార్యక్రమము నెరవేరదు. బద్ధకము, ఉష్ణాధిక్యము మొదలగు అనారోగ్య సూచనలు కనబడుతవి. ఉద్యోగస్తులకు బాధ్యత పెరుగుతుంది. ఆదాయము కూడా పెరుగుతుంది. విద్యార్థులకు చదువు సాగదు. 26, 27 తేదీలలో త్రిప్పట, కార్యభంగం, గృహకలతలు, అశాంతి, 28, 29, 30 తేదీలలో ప్రయాణము. స్వల్ప లాభము. అధిక ఖర్చులు. 31 న ఆరోగ్య భంగ సూచనలు.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము పరిస్థితులు సుఖవంతముగా అగపడవు. నిలకడలేని ఆలోచనలవల్ల, మనస్సమాధానం కుదరక చికాకుపడవలసి వుంటుంది. కార్యాచరణలో శ్రమపడుతూ కూడా మాటపడడముచేత మనోవ్యథ కలుగుతుంది. గృహమందున్న వృద్ధుల ఆరోగ్యము చెడుటచే కలవరపాటుచెందుతారు. ప్రయాణము చేయుటలో కలిసిన వ్యక్తివల్ల అనుకోకుండా కార్యానుకూలత కలుగుతుంది వ్యాపారస్తులకు మొదట్లో అనుకూలములేక పోయిననూ వారాంతమున లాభిస్తుంది. 26, 27 తేదీలలో అస్థిమితము, కార్యాచరణలో ఎక్కువ ఖర్చులు, శ్రమ. 28, 29, 30 తేదీలలో కార్యలాభము, ప్రయాణము. 31 న ఆరోగ్యచింత.

***శ్రవణము [జూ, జే, జో, ఖా]***

ఈవారము ప్రతికార్యములోనూ అశాంతిగానే వుంటుంది. మీ ఆప్తులే మీకు చిక్కులు కలిగిస్తారు ; మీ మంచితనాన్ని ఉపయోగించుకొని మీవల్ల కార్యలాభము పొంది చివరకు మిమ్ములను మోసముచేస్తారు. అయినను ఈశ్వరానుగ్రహమువల్ల అన్నికష్టములు గడుస్తాయని ధైర్యపడతారు. 26, 27 తేదీలలో వర్తకులకు త్రిప్పట, ఆశాభంగము కలిగిననూ వారాంతమున లాభముకలుగుతుంది. 28, 29, 30 తేదీలలో మాట నేర్పరితనంవల్ల కార్యసాధన. ఉద్యోగస్తులకు ఈ మూడు రోజులలోను అనుకూలముగా వుంటుంది. 31 న గృహమందుండువారి ఆరోగ్యముగురించి ఆరాటన.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కార్యభారము అధికమగుటచేత అశాంతి. కోర్టువ్యవహారములలో అనుకూలత కనపడిననూ శ్రమ, ఖర్చులు ఎక్కువ అవుతాయి. వ్యవహారములపట్ల దుష్టస్త్రీలతో వివాదపడి ఖేదపడతారు. భార్య ఆరోగ్యము సరిలేనందున ఆతృతగా వుంటుంది వర్తకులకు ప్రయాణమువల్ల శ్రమ కలిగిననూ స్వల్ప లాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు ఒడిదుడుకులు. 26, 27 తేదీలలో ఆర్థిక ఒత్తిడి, కార్యభారముచే త్రిప్పట అశాంతి. 28, 29, 30 తేదీలలో ప్రయాణము, స్వల్పలాభము, 31 వ్యథ.

***శతభిషం [గో, సా, సీ, సూ]***

ఈ వారము ఎక్కువ శ్రమకలిగే పనులుపైన వేసుకొన్ననూ కార్యసాధనలో ప్రతిఫలముండదు. అయినప్పటికీ నిరాశ పొందక ధైర్యముతో వ్యవహరిస్తారు. సోదర సహాయమువల్ల కొంతవరకు ఆర్థికచిక్కులు తగ్గుతవి. అధికారుల అనాదరణచే ఉద్యోగస్తులకు మనోవ్యథ కలుగుతుంది. ఇబ్బంది తీరనందున కలతలు కలుగుతాయి. అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదముంది. జాగ్రత్త పడండి. 26, 27 తేదీలలో త్రిప్పట, శ్రమ అశాంతి 28, 29, 30 తేదీలలో రసాయనిక పదార్థాల వ్యాపారస్తులకు, ఇనుపవర్తకులకు లాభము. 31 వ తేదీని ప్రమాద సూచన.

*** పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] ***

ఈ వారము మీ బుద్ధిబలమువల్ల ఆలోచనలను కార్యరూపములో పెట్టి సాధించి విజయం అనుభవిస్తారు. ఈ సమయములో నే మిత్రులు కూడా మీకు సహాయపడతారు. జ్ఞాతుల మూలంగా ఆర్థిక సహాయం లభిస్తుంది. ఆప్తుల క్షేమవార్త తెలుసుకొని సంతోషపడతారు. ఉద్యోగస్తులకు హోదా పెరిగే సూచనలు వున్నవి. మందుల వ్యాపారస్తులకు, వైద్యులకు లాభం. గణితశాస్త్రజ్ఞులకు, చిత్రకారులకు, కవులకు, కళాకారులకు యోగకాలం. 26, 27 తేదీలలో కార్యాచరణలో శ్రమ, త్రిప్పట. 28, 29, 30 తేదీలలో ప్రయాణము, అధికారుల సహాయము, మిత్ర దర్శనము, లాభం. 31 తేదీని అలసటచే అస్వస్థత.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] ***

ఈ వారము మీకు యోగకాలము. నూతన శక్తి, ఉత్సాహములతో కార్యాచరణకు పూనుకుంటారు. ధనాదాయము వృద్ధి అవుతుంది. కోర్టు వ్యవహారములో మొదట్లో కొంత ప్రతికూలత వున్నట్లు కనబడినా చివరకు మీపరముగా తీర్పువుంటుంది. అయినా ఖర్చులు ఎక్కువగుటచే గెలిచిన సంతోషము అంతగాయుండదు. పిల్లలకు అభివృద్ధి కలిగే ప్రయత్నాలుచేస్తారు. ఉద్యోగస్తులకు గతవారము కలిగిన మనోవ్యథ తీరుతుంది. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. న్యాయవాదులకు, పండితులకు, నటీనటులకు యోగకాలము 26, 27 తేదీలలో త్రిప్పటవల్ల శ్రమకలిగిననూ కార్యసిద్ధి. 28, 29, 30 తేదీలలో ప్రయాణము, పండిత గోష్ఠి, లాభము. 31 న శ్రమవల్ల అస్వస్థత.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

గత వారంకన్నా ఈ వారము మీ ఆర్థిక స్థితి ఎక్కువవుతుంది తలపెట్టిన పనులు నెరవేరుటచే సంతోషము చెందుతారు. మిత్రులతోనూ, బంధువులతో కలిసి వినోదములలో పాల్గొంటారు. వెండి వ్యాపారస్తులకు లాభముగా ఉంటుంది. విద్యార్థులకు ఉత్సాహముతో చదువు సాగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 26, 27 తేదీలలో కార్యభారమువల్ల త్రిప్పట, అశాంతి. 28, 29, 30 తేదీలలో బంధుమిత్రులతో కూడి వినోదము, మృష్టాన్న భోజనము, ఆర్థిక లాభము, కార్యసిద్ధి. 31 న అస్వస్థత.



# వనితా లోకం

## సంక్రాంతినాటి తెలుగుకన్నె

బి. ఎస్. లక్ష్మి

సుబ్బి గొబ్బెమ్మ-శుభము నియ్యావె
 తామర పువ్వంటి-తమ్ముణ్ణియ్యావె
చేమంతి పువ్వంటి-చెల్లెల్నియ్యావె
మొగలి పువ్వంటి-మొగుణ్ణియ్యావె
గుమ్మడి పండంటి-కొడుకు నియ్యావె

అని సంక్రాంతి నెలరోజు లుందనగానే (అసలు సంక్రాంతి నెలరోజులపండుగ) గొబ్బెమ్మల్ని పెట్టిన తెలుగుకన్య మధురముగా పాడుతూ, తన కోర్కెలు తీర్చమంటుంది గొబ్బెమ్మల్ని. అసలు ఆ పాటా ఆ కాలమూ అన్నీ కలసి యౌవనంలో అడుగుపెట్టిన తెలుగుకన్య మనస్సులో ఏవోతీయని తలపులు రేపుతాయి. పాపకి కొస్త జ్ఞానమొచ్చినప్పటినుంచి ఈ పూజ చేస్తూనే వుంటుంది సంక్రాంతికి. ఆనాటి పాపకి భర్త అంటే ఏమిటో ఊహాకందదు. అందుకే చెల్లెల్ని, తమ్ముణ్ణి ఇవ్వమని ఎంత గట్టిగా పాడుతుందో—భర్తనివ్వమనీ పాపనివ్వమనీ అంత గట్టిగానే పాడుతుంది. పూజ చేస్తున్న చిట్టిపాపని, "పాపా నన్ను పెళ్లాడుతావా" అని ఏ పళ్ళూడిపోయిన తాతేనా అడిగినట్లయితే, "ఓ...నన్ను గుర్రం ఎక్కించుకుంతే పెళ్ళాడుతా" అంటుంది చిట్టిపాప తేలిగ్గా.

ఆ పాపే పెద్దదై కొత్త యవ్వనంలో అడుగు పెట్టేసరికి ఆమెకి తెలియకుండానే ఆమె ఊహాలు కాబోయే భర్తకోసం కలలుగంటాయి. తనయీడుదే అయినా కొస్తచిన్నప్పుడే పెళ్లయిన రాధనీ, ఆ ఏడే కొత్తగా పెళ్లయిన కాంతనీ చూచిన పెద్దపాప తన ఊహాకి ఒకరూప మేర్పరచుకుంటుంది. ఆవీడు గొబ్బెమ్మలు మరికొంచెం శ్రద్ధగా పెడుతున్న పాప మనస్సులో వలపు తలపులు గిలిగింతలు పెట్టగా కలిగిన సిగ్గుతో (అర్థము తెలిసినందువల్ల) ఎవరేనా తనపాట వింటున్నారేమోననే పక్క బెదురుతో లేగులాబి మొగ్గలలాటి బుగ్గలు నునుసిగ్గుతో యెరుపెక్కగా చివరి రెండుముక్కలు సన్నగా గొణుగుతుంది.

ఆమె చిలిపి అన్నయ్యో, కొంటె బావ సరిగా ఆ సమయానికి అక్కడ హాజరయి, "పాటంతా విన్నాం—చివరిముక్కలు వినిపించలే"దనో, "మొగలి పువ్వులాటి మొగుడైతే తన ముళ్లతో నిన్ను గుచ్చడూ" అనో రకరకాలుగా హేళనచేస్తూ కొత్త పెళ్ళికూతురుచేత తలుపుదగ్గర పేరు చెప్పించినంత హంగామా చేసి ఉక్కిరి బిక్కిరి చేస్తారామెను. ఈవిధంగా ఆ నెల్లాళ్ళూ మరచిపోదామన్నా మరపురాకుండా తెలుగుకన్నె మనసులో నిలుస్తాయి. కాబోయే పతి ఊహాచిత్రం హృదయంలో స్థిరనివాస మేర్పరచుకుంటుంది. అంతవరకూ తల్లి తండ్రి తమ్ముడు చెల్లెలే పరమార్థమనుకున్న తెలుగుకన్నెకు అంతకన్న మరో ముఖ్యమైన వస్తువుందనే సంగతి మొట్టమొదటిసారిగా తెలిసేది సంక్రాంతి రోజుల్లోనే. ఇటువంటి పరిణామాన్ని వూహించే మనపూర్వులీ పూజ ఏర్పరిచారనుకుంటా.

అసలీపూజ కృష్ణావతార ఘట్టంలో శ్రీకృష్ణుని పతిగా పొందేందుకు గోపకన్యలు మొట్టమొదటిసారి చేశారుట. గొల్లలు కాబట్టి వారికి అందుబాటులో వున్న ఆవుపేడతో చిన్న చిన్న ముద్దలుచేసి దానికి పసుపు కుంకుమపెట్టి దొడ్లో పూసిన బంతి, చామంతి, గుమ్మడిపూలతో ఆ గొబ్బెమ్మని పూజించి, ఆపైన ప్రదక్షిణము చేస్తూ తమ కోర్కెలు తెలిపే ఈ పాట పాడేవారుట. ఇల్లా గొబ్బెమ్మని పూజించిన గోపకన్యలు శ్రీకృష్ణుని పతిగా పొందగల్గారు. ఆ నాటి గోపకన్యలు చేసిన పూజే వుదయం మన పిల్లచేత చేయిస్తాము. సాయంత్రము ఆ పూజ చేసిన గోపకన్యల్ని శ్రీకృష్ణుని కీర్తిస్తూ సంజె గొబ్బిని తట్టుతారు కన్యలంతాకలసి. మొగలి పువ్వు తన సువాసనల్ని నలుదిశలా ఎంత వ్యాపింప చేసినప్పటికీ, ఘట్టిగా ముట్టుకుంటె తన ముళ్లతో సత్కరిస్తుంది. అలాగే శ్రీకృష్ణుడు ఎంత ప్రణయమూర్తియైనా స్త్రీలోలుడై పురుషకారమైన పౌరుషాన్ని వదిలిపెట్టలేదు. స్త్రీకి సిగ్గు ఎంత అలంకారమో, పురుషునికి పౌరుషమంత భూషణము. అటువంటి పౌరుషహీనుడైన పురుషుణ్ణి ఏ స్త్రీగాని గౌరవముతో వరించదు. ఈ సత్యాన్ని గుర్తు చేసేందుకే జీవిత భాగస్వామియైన పతిని మొగలిపువ్వుతో పోల్చారు.

సరిగ్గా మాటలురాని పసితనంలో కూడా ఆడపిల్ల తనకో పసిపాప కావాలని తహతహతో చిన్న చందనపు బొమ్మ తీసుకుని దానికి (వుట్టుట్టి) వుగ్గుపాలు పోసి బుల్లి బుల్లి గౌనులు తొడిగి వచ్చీరాని జిలిబిలి పలుకులతో పాటలుపాడి నిద్రపుచ్చుతుంది. తన పాపని చిట్టిపాప, ఆ పాపకే భోగిపళ్ళు మొదలుకుని బొమ్మ పెళ్ళిళ్ల వరకూ సకుస్త వేడుకలూ తనతోటి పిల్లలని పిలచి జరుపుతుంది. చిటిపాప ఈ చిన్న సంసారమూ తాపత్రయమూ పొందికా చూస్తున్న మనకి ఆడపిల్ల పుడుతూనే మాతృత్వాన్ని కొని తెచ్చుకుందా అనిపించక మానదు. అటువంటి పాప పెరిగి పెద్దదయి ఆమె తలపులకు గిలిగింతలు పెట్టె పతి లభించినప్పటికి కలపులపంటయైన సుతుడు కంటపడేవరకు ఆమె మాతృహృదయము పూరట చెందదు. బొద్దుగా పచ్చగా బంగారంలా మెరిసే గుమ్మడి పండంటి సుతు నివ్వమని కోరుతుంది గొబ్బెమ్మను తెలుగు కన్య. అట్లా ఆమె కోర్కెలు ఫలించిననాడు ఆమెకే కోర్కెలు మిగులవు కోరేందుకు. మధురమైన పూహాలు వుదాత్తమైన కోర్కెలుగల తెల్గుకన్నె మనస్సుకు మల్లేనే గుమ్మడిపండులాటి కొడుకు నివ్వమని కోరటముతో గొబ్బెమ్మపాట పూర్తవుతుంది.

★

# 'మా విజయకాపరం'

ఈ మధ్య మావాళ్ళింటికి వెళ్ళినప్పుడు చిన్ననాటిస్నేహితురాలు - విజయ ఆ వూళ్ళోనే వుందని విని, చూసివద్దామని వాళ్ళింటికి వెళ్ళాను. మా స్నేహితులందరిలో బి. యే. దాకా చదివి డిగ్రీ తీసుకున్నది విజయొక్కర్తే. చదువుకునే రోజుల్లో చాలా చలాకీగా, చురుగ్గా, వుండేది.

నేను వెళ్ళగానే చాప వేసి కూర్చోపెట్టింది.

అందంగా, వుత్సాహంగా వుండే చిన్ననాటి స్నేహితురాలికీ, లోతుకుపోయిన కళ్ళూ, పాలిపోయిన ముఖమూ, నలిగి దీనవదనయై వున్న ఈనాటి నలుగురు బిడ్డల తల్లికీ గల వ్యత్యాసం చూసి ఆశ్చర్య పోయాను.

"ఏం విజయా యిలావున్నావు?" అనడిగాను.

సమాధానంగా తన కథంతా చెప్పుకు పోయింది.

ఆ అమ్మాయి తండ్రిదీ పెద్ద సంసారం. మంచి వుద్యోగం. ఆడపిల్లలందరికీ పెళ్ళిళ్లూ, మొగ పిల్లలకు చదువులూ చెప్పించారు.

విజయ భర్తకు 200 జీతం.

ముసలి మామగారూ, అత్తగారూ, తనూ భర్తా, నలుగురు పిల్లలూ-యిదీ, సంసారం.

అత్తగారూ, మామగారూ పెద్దవాళ్ళు తనపై ఆధారపడి వున్నవారు. ఉండేది మరీ పెద్ద పట్టణం, పల్లే గాని మధ్యరకం బస్తీ. వచ్చే 200 వందల్లోనూ బియ్యం, పప్పు, ఉప్పూ ఇంటికి కావలసిన సామానుకీ, ఇంట ద్దెకీ 100 రూ. సరిపోతుంది.

పెద్ద పిల్ల లిద్దరికీ చదువూ, చిన్నపిల్లల పోతపాలూ, బలహీనానికి మందులూ, ఆయనకి సిగరెట్లూ, చిల్లర ఖర్చూ పాకెట్ మనీ క్రిందా ఓ యాభై పోతుంది. ఇక మిగిలిన దాన్తోనే పనిమనిషి జీతం, బట్టలు గాని మరే దైనా యితర పైఖర్చులన్నీ జర్గాలి. ఇంట్లో వనికి గాని డబ్బుకి గాని వెనక ఆసరాయేమీ లేదు. "ఆదాయానికీ, ఖర్చుకీ పొంతన కుదిర్చే సరికి చుక్కలు యెదురౌతున్నాయి" అంది విజయ. పోనీ చదువుకుంది కదా యేదైనా వుద్యోగం చేద్దా మంటే భర్తకు యిష్టంలేదు. అది తన గౌరవానికీ, వ్యక్తిత్వానికీ భంగకరంగా ఆయన భావిస్తాడు.

పగల స్తమానం విధివిరామం లేకుండా యింటిపనీ, పిల్లల చాకిరీ, వాళ్ళ కు చీటికీ మాటికీ వచ్చే జబ్బులూ, చాలీ చాలని ఆదాయం, వీటన్నింటితో సతమత మవుతున్నది విజయ.

వుద్యోగంచేసే అవకాశంకూడా లేదామెకిప్పుడు. జీవితంయెడల నీరసం నిస్పృహ ఆమెను కృంగదీసి నిరుత్సాహ పరచినవి. ఆమెలో మార్పు కలుగుటలో అసహజమేమీ లేదు. విజయవంటి సంసార స్త్రీలు యీనాటి మనసంఘంలో అసంఖ్యాకంగా వున్నారు. కూలినాలి చేసి జీవించే పాటకపు జనం తమ జీవితాన్ని దైనందినంగా గపుపుతూ కనిష్ఠ ప్రమాణంగల జీవితావసరాలను గలిగి వుంటారు. వీరిని ఆర్థిక సమస్యలూ సాంఘిక సమస్యలూ యెక్కువ యెదుర్కొనవు.

మరీ ధనవంతులు తమ అవసరాలను సులభంగా నెరవేర్చుకొనగలరు. సంఘం వీరికి అనుగుణంగానూ, అనుకూలంగానూ నడుస్తుంది. పైరెండు తెగలకూ చెందని మధ్యజాతి ఇంకొకటున్నది. ఈ తెగకు చెందినవారు కాలానుగుణంగా మార్పు చెందని సాంఘికాచారాలకూ, సంప్రదాయాలకూ

**అన్నంరాజు రమణమ్మ**

లోనై పెక్కుయిక్కట్ల పాలవుతున్నారు.

ఆడపిల్లల చదువులూ, పెళ్ళిళ్లూ: సామాన్య స్థితిగలిగి పదిమందిగల పెద్ద సంసారానికి అధికమైన భారాన్నీ, వ్యయాన్నీ కలిగించేవి ఆడపిల్లల పెళ్లిళ్లూ, చదువులూ, అనడంలో సందేహ మేమీ లేదు. వెనుక ఆసరాయేమీ లేని మామూలు సంసారంలో వచ్చే ఆదాయం నెలసరి ఖర్చులకూ పైగా వచ్చేబట్టల ఖర్చులూ, బంధు మర్యాదల ఖర్చులూ, జబ్బులూ, వైద్యాలూ మొదలైన వాటికీ చాలిచాలనట్లు సరిపోతుంది. ఇట్టి స్థితిలోని వారు పిల్లల చదువు ఖర్చులను అతికష్టం మీద భరించగలుగుతున్నారు. మొగపిల్లలను వుద్యోగంచేసి వేరొక కుటుంబ భారాన్ని వహించగల సమర్థులను చేయుటకు వారికి పెద్దచదువులు చెప్పించు బాధ్యత తల్లితండ్రులకు గలదు. ఈనాటి సంఘంలో డిగ్రీ చదువులూ, కనీసం హైస్కూలు చదువైనా లేని ఆడపిల్లలు పెండ్లి కుమార్తెలుగా తగిన 'క్వాలిఫికేషన్స్' లేనివారుగా భావింపబడుటచే (ఇతర కారణాలు అలా ఉంచగా) మగపిల్లలతో సమంగా వారికీ చదువు చెప్పించవలసిన ఆవశ్యకత యేర్పడినది. ఏదో రీతిగా ఆడపిల్లలను వున్నత విద్యావంతులను చేసి వివాహం దగ్గరకు వచ్చేసరికి వేలకువేల క్రుమ్మరిస్తే తప్ప అమ్మాయిలకు వరులు లభ్యమగుటలేదు.

చాలీచాలని ఆదాయం, తలకు మించిన సంసారభారమూగల సామాన్య సంసారి నెలకు కనీసం 10 రూ అయినా మిగల్చలేని పరిస్థితిలో వేలను యేవిధంగా సమకూర్చగలడు? యీ కారణంగా అనేక సామాన్య సంసారాలు, కాస్తో కూస్తోగా వున్న వెనుక ఆస్తులను అమ్ముకోవడం, లేక అప్పులపాలు గావడం జరుగుతున్న సంగతి.

## స్త్రీలు—వుద్యోగాలు

పెండ్లికాకుండా వుద్యోగం చేసేస్త్రీలు పలురకముల వ్యాఖ్యానాలకూ విమర్శలకూ గురవుతున్నారు. స్త్రీలకు ప్రథమకర్తవ్యం గృహనిర్వహణమే యైనా పరిస్థితులనూ అవసరాలనూ బట్టి స్త్రీలు వుద్యోగం చేయడం సామాన్య సంసారాలకు ఆర్థికంగా సహాయకరంగా వుండగలదు.

స్త్రీలు వుద్యోగాలు చేయడం అమర్యాదకరంగా హైన్యంగా భావించేవారు కొందరు లేకపోలేదు. కాని స్వయంకృషీ, స్వశక్తిపై ఆధారపడుట యందుగల విశిష్టతను గ్రహించగలిగిన యీ అభిప్రాయం తొలగగలదు. పూజ్యులైన బాపూజీవంటి మహాత్ములు స్వయంకృషియొక్క విలువను అనేకమార్లు చాటిచెప్పారు.

కొన్ని పరిస్థితులలో నిరాధారులైన స్త్రీలు బంధు మిత్రుల తదితరుల ఔదార్యంపై ఆధారపడే కన్న స్వయంశక్తిపై నిలబడుటవారికి స్వతంత్రాన్ని గౌరవాన్నీ యివ్వగలవు. అట్లని బంధుమిత్రులను ధిక్కరించవలెనని గాదు. వుద్యోగంచేసే స్త్రీలు పెద్దలనూ, యింటి బాధ్యతలనూ నిర్లక్ష్యం చేస్తారన్న వాదు సరికాదు.



# సంక్రాంతిముగ్గు

మంత్రిప్రగడ శారద (బరంపురం)

నిర్లక్ష్యం, అగౌరవం, అనునవి స్వభావాన్ని బట్టివుంటాయిగాని చదువుపైనా వుద్యోగంపైనా గాదు. సంసార నిర్వహణ, వుద్యోగ నిర్వహణ, రెంటిని సమర్థించగల స్త్రీలే అందుకు పూనుకొనవచ్చును. సామాన్య సంసారాలకి ఆర్థిక విషయాలనుండి అల్ప విషయాలదాకా అనేక విషయాలు సమస్యలుగా వుంటున్నవి.

ఇంటి సరుకులకు షాపింగుచేయడమూ, ఇంటి పనులకు నవుకర్లను పెట్టుకోవడం, మొదలైనవి కొందరు పురుషులకు సంసారానికి సరుకులూ, సామాన్లూ తెచ్చే తీరికా, ఓపికా వుండవు. పెద్దపెద్ద పట్టణాల్లో తప్ప మనమామూలు బస్తీల్లో యీ రోజుల్లో కూడా స్త్రీలు బయటికిపోయి సరుకులు తెచ్చుకోవడం నామోషీగానే భావింపబడుతున్నది ఈ కారణంగా చాలా మంది స్త్రీలు కూరలనుండి చీరెలవరకూ యింటి ముందు బేరాలుచేసి, ఒకటికి నాలుగింతలు నష్టపోవడం జరుగుతూ వుంటుంది.

అదేవిధంగా చిన్నపనులకూ పెద్దపనులకు మనుషులు కావాలనుకునేకంటే, స్వయంగా చేసుకోవడంలో సుఖం, ఆదాయం కూడా వున్నాయి.

బట్టలు స్వయంగా కుట్టుకోవడం. వుతుక్కోవడం, వంటిపనులు.

ఇంట్లో బట్టలు కుట్టుకుంటే కుట్టుకూలీ, టైలర్ బట్ట కాజేసే బాధవుండవు. మనకు నచ్చినట్లు కుట్టుకొనవచ్చును.

ఇంట్లో వుతికినబట్టలు చాలా కాలం మన్నుతాయి ఇస్త్రీ బట్టలేవనే యిబ్బంది, చాకలివాడు పారేస్తాడనే బాధవుండవు. ఇటువంటి పనులు చేసుకోవడం అమర్యాదాకరమేమీ కాదు.

స్వల్ప విషయాల్లోని మన మానోవైశాల్యమే మన మానసిక పరిధులను విస్తృతపరచి సామాజికంగా అభివృద్ధినీ, పురోగమనాన్ని సాధించగలదు. ★

# వనభోజనాల వేళ

కార్తీకమాసం రావడం, అప్పుడే వెళ్ళిపోవడంగూడా జరిగింది. ఈ నెలరోజులు చాలా హడావిడిగా యుంటుంది స్త్రీలకు. తెల్లవారుఝామున లేచి స్నానాలు చేయటము, దీపాలు పెట్టుకోవడము మొదలయిన పనులుంటాయి. తర్వాత సోమవారాలు, ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ మొదలయినరోజులలో ఉపవాసము చేయుట ఇలాగ ఈమాసం గడిచిపోతుంది. ఈ నెలరోజులూ కార్తీక మాహాత్మ్యం చదువుకుంటారు. ఏకాహాలు చేసారు. వీటితో బాటు మనవాళ్ళు ఈ నెలలో ఏ ఉసిరిక చెట్టునీడనో, ఏతోటల లోనో వనభోజనాలు పెట్టుకుంటారు.

వీటినే పాశ్చాత్యులు 'పిక్ నిక్' అంటారు. వారు ఎప్పుడుబడితే అప్పుడే అంటే ఏకాలంలో నేనాసరే, స్నేహితులతో కలసి, ఏ సరస్సు తీరాలకో, ఏతోటలలోకో, సముద్రతీరాలకో వెళ్ళి కులాసాగా, ఆటలు, పాటలుతోటి, విందులతోటి ఆనందిస్తారు.

మా అనకాపల్లికి చుట్టూ చాలావిశాలమైన తోటలున్నాయి అందుచేత ఈ వూరులో చాలామంది కార్తీకమాసంలో వనభోజనం చేస్తే పుణ్యం అని, వనసంతర్పణలు చేశేరు. ఈఏడు 'రోటరీ' క్లబ్బువారు గూడా 'పిక్ నిక్' క్యాంపు వేశారు. క్లబ్బులో మా వారుగూడా మెంబరుఅవడంవల్ల మాకుటుంబమంతా వెళ్ళినాము.

ఈవూరికి మూడుమైళ్ళ దూరంలో ఒక జమీందారిగారి పెద్ద మామిడితోటవుంది. దానికిమధ్య పెద్దభవనంగూడా వుంది. ప్రస్తుతం అది ఖాళీగాయుండుటచేత 'పిక్ నిక్' అందులో ఏర్పాటుచేశారు. భవనమునకు వెనక ఒకపెద్ద నుయ్యిఉంది. ఆ నీళ్ళు కొబ్బరినీళ్ళలాగ చాలా తియ్యగావున్నాయి. అన్నిరకముల ఫలవృక్షములతోను, మల్లె, మాలతి, సంపెంగ మొదలయిన పూలపొదలతోను ఆతోట చూచుటకు చాలాఅందంగా వుంది. నేలఅంతా పచ్చని పట్టుతివాసీలు పరిచినట్లు పచ్చికచేత కప్పబడివుంది. రాత్రి కురిసిన మంచుబిందువులు మంచిముత్యముల వలె సూర్యునికాంతిలో మెరిసిపోసాగినవి. చూచుటకు నిజంగా మంచిముత్యాలు వెదజల్లినట్టుగా తోచింది.

రోటరీ మెంబర్సుఅంతా కుటుంబములతో వచ్చారు. అంతక్రితమే భోజనాలకు, ఫలహారములకు, కాఫీలకు ఏర్పాటుచేయబడినవి. సరిగ్గా '9' గంటలకు అందరూ కార్లలో అక్కడికి వెళ్ళినాము. వెళ్ళగానే టిఫిన్, కాఫీలు తీసుకొన్నాము. చెట్లు క్రింద తివాసీలు, జంబుఖానాలు పరుచుకొని అందరమూ కూర్చొని ప్రాపంచికవిషయాలు మాట్లాడుకొన్నాము. క్రొత్తవారిని ఒకరొక

**కూరపాటి వాణీసుందరి**

రము పరిచయము చేసుకొన్నాము. 10 గంటలకు ఆటలు ప్రారంభించినారు. మాతో కొన్ని కుర్చీలు ఆటవస్తువులు, త్రాడు వగైరా సామాన్లు తెచ్చినారు. మొగవారందరు, మ్యూజికల్, ఛైర్సు, టగ్ ఆఫ్ వార్ (తాడులాగటం) రన్నింగ్ రేసు మొదలయిన ఆటలు ఆడారు. వారిలో పాతిక సంవత్సరములు దగ్గరనుంచి 50సంవత్సరముల వయస్సు కలవారు వున్నారు. అయినప్పటికీ ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారు.

తర్వాత స్త్రీలు, పిల్లలుకూడా ఆటలు ఆడారు. మాలోగూడా చిన్న, పెద్దా వున్నారు. వయోవృద్ధులు అయినప్పటికీ వారుగూడా ఎంతో ఉత్సాహంగా ఆటలలో పాల్గొన్నారు. నాకు నిజంగా నా చిన్నప్పటి స్కూలురోజులు జ్ఞాపకం వచ్చాయి. ఆటలు, పాటలకు వయసుతో పనిలేదు. మనస్సుకు ఎంతో ఆనందాన్ని ఉత్సాహాన్ని యిస్తాయి. అందుకనే పాశ్చాత్యులు స్త్రీలుగూడా పురుషులవలెనే ఆటలలో పాల్గొంటూ ఉంటారు. వారు ఆరోగ్యాన్ని కోల్పోకుండా బలమైన వారుగాయుంటున్నారు. సరిగా 12 గంటలకు భోజనమునకు కూర్చొన్నాము. రుచికరమైన పదార్థాలతో విందు చాలా గొప్పగా జరిగింది. భోజనములయిన తర్వాత అందరము చెట్లనీడలలోనే విశ్రాంతి తీసుకొన్నాము.

అప్పుడు సూర్యుడుపైన తీక్షణంగా ప్రకాశిస్తున్నాడు. అతడు మమ్మల్ని బాధపెట్టాలని అనుకొన్నా. వీలులేక కాబోలు ఉడుకుబోతుతనం చేత మొహం ఎర్రబారిపోయి పడమటి దిక్కువైపు తొందరగా దిగిపోయాడు. ఆ చెట్ల నీడలో ఎంత ప్రశాంతంగా యుందో నేచెప్పలేను. సాయంత్రం కొంతమంది పాటలుపాడి ఆనందింపచేశారు. అందరము టీ తీసుకొని ఒకరివద్ద నొకరు సెలవు తీసుకొని యిండ్లకు తిరిగి వచ్చివేసినాము.

పిక్ నిక్స్ ఎంతో సరదాగా యుంటాయి. మేము చాలామంది వెళ్ళినాముగనక చాలా సరదాగా ఉంది. ప్రకృతి సౌందర్యాన్ని చూచి ఆనందించడానికి, ఆనందాన్ని అందరితోను పంచుకోడానికి వనభోజనాలు అద్భుతంగా ఉంటాయి. నా సంతోషాన్ని మీ అందరికి తెలియచేద్దామని వ్రాశాను. ★

వంటలు:

#  కాబేజీతో 

కాబేజీ వంటికి చాలమంచిది. వీటితో చేసే వంటలు చాలబాగుంటాయి. కాబేజీ ఆరోగ్యమైన వస్తువేకాక, అందాన్నికూడా పెంపొందిస్తుందని చెబుతారు. ఈ కాబేజీతో లేహ్యం చేస్తారుట. జబ్బుపడ్డవారికి ఈ లేహ్యం పెడతారు. ఇవి దొరికే రోజుల్లో రసంతీసి, పరగడుపున పెడతారు. నిలవవుండటానికి పాకంపడతారు. చాల బాగుంటాయి. ఇక వచ్చేరోజులే గాబటి ఇవి తయారు చేసుకోవచ్చు. కాబేజీతో తయారుచేసే వంటలు నాకు తెలిసినవి రాస్తున్నాను.

## కాబేజీ పొడికూర

కందిపప్పుగాని, పెసరపప్పుగాని వాడవచ్చును. కాబేజీ ఇష్టమున్నవారు ఎక్కువ వేసుకోవచ్చు. కాబేజీ మెత్తబడేవరకు వుడకనిచ్చి వార్చుకోవాలి. వార్చుకున్న దానిమీద చిటికెడు పసుపు వెయ్యాలి. ఒక గిన్నెలో 2 టేబిల్‌స్పూనుల నూనెగాని, నెయ్యిగాని వేసి, కాగాక, ఎండుమిరప ముక్కలు, పచ్చిమిరప ముక్కలు, ఒక స్పూను ఆవాలు, జీలకర్ర, పెసరబద్దంత ఇంగువ, కరివేపఆకు పోపుచేసి, వార్చివుంచుకున్న పొడికూర పోపులోవేసి మూతపెట్టవలెను. వుప్పువేసి, 5 నిమిషాలు వుంచి తీసి కళాయిగిన్నెలో పెట్టుకోవాలి. ముఖ్యంగా కాబేజీ ఎంత సన్నగా తరుగుతే అంత నాజూకు, చాలరుచిగా వుంటుంది.



## ఆవపెట్టిన కూర

కాబేజీ సన్నగాతరిగి బాగా వుడకపెట్టి వార్చుకోవాలి. వార్చినదానిమీద చిటికెడు పసుపువెయ్యాలి. గిన్నె కాలేసి, ఎండు మిరపముక్కలు, శెనగపప్పు, మినపప్పు, వేసి వేగాక, ఆవాలు, చిటపటలాడాక, జీలకర్ర, పచ్చిమిరపముక్కలు వేసి కరివేపాకు వేసి వాసనవచ్చాక కాబేజీ వేసి కలపవలెను. చింతపండు కావలసినది తీసుకుని చిక్కగా పిసికి వేయవలెను. ఇగిరినతర్వాత తీసి చల్లారాక, ఒక చిన్నగరిటెడు ఆవాలు, కారం చాలనివారు 2 మిరపకాయలు, కొంత వుప్పువేసి మెత్తగా నూరాలి. నూరిన ముద్దను కొంత నూనెవేసి కూరలో కలపవలెను. ఆవలో నూనె కలపకపోతే చేదు వస్తుంది. వుప్పు కాబేజీ వుడికేటప్పుడే వేయాలి. ఈ మాదిరికూర చాల బాగుంటుంది.

## కాబేజీ పెరుగుపచ్చడి

కాబేజి సన్నగాతరగి, కడిగి, ఒకగిన్నెలో నెయ్యివేసి, కాబేజీని ఆ నెయ్యిలోవేసి మగ్గనియ్యాలి. పెరుగు, కమ్మగా, గట్టిగా వుండాలి. పెరుగులో, వుప్పు, పసుపు వేసుకోవాలి. కాబేజీ మగ్గినతర్వాత, చల్లారాక, పెరుగులో కలపాలి గరిట కాలేసి, నెయ్యి వేసి, ఎండు మిరపముక్కలు, పచ్చిమిరప ముక్కలు, మినపప్పు, ఆవాలు, జీలకర్ర, మెంతులు, ఇంగువ, కరివేపఆకు పోపుచేసి, పెరుగులోవేసి మూతపెట్టాలి. కొత్తిమిర వేస్తే బాగుంటుంది.

## కాబేజీ వడలు

కావలసినవి: శెనగపప్పు పావుశేరు, కాబేజీ అర్ధపావు, తగినంతవుప్పు, చిటికెడు సోడావుప్పు, కారం చిన్నస్పూన్, పచ్చిమిరపకాయలు 8, వుల్లిగడ్డలు పెద్దవి 4, అల్లం తగినంత, కరివేపరెమ్మలు 2.

ముందు మధ్యాహ్నం చేస్తామనగా వుదయాన్న శెనగపప్పు నానబోయాలి. నానినతర్వాత వడలపిండిమాదిరి గట్టిగా రుబ్బుకోవాలి. రుబ్బినదాంట్లో చిటికెడు పసుపు వేయాలి. తర్వాత పచ్చిమిరపకాయలు, వుప్పు, అల్లం, కచ్చాపచ్చాగ దంచుకోవాలి. వులిగడ్డలు సన్నగా చక్రాల్లా తరుక్కోవాలి కాబేజీ సన్నగా తరగాలి, రుబ్బినపిండిలో

---

నిత్యము రాత్రి పరుండునపుడు దోసపండు పై తొక్కతీసి, లోపల గింజలు లేకుండా ముక్కలుగా కోసి తిన్నచో ఉదుకు మేహబాధలు తగ్గును. జీర్ణశక్తి వృద్ధి అగును. బాగా నిదురపట్టును. మరునాడు బలముగాను, ఉత్సాహముగాను వుండును. సంవత్సరమునకు 3 మాసములు నిత్యము దోసపండు తిన్నచో ఆరోగ్యము బాగా వుండును. 4 దోసకాయలు పైతొక్క తీసి ముక్కలుగా తరిగి వుంచవలెను. మినప్పప్పు, కొంత శెనగపప్పు, ఆవాలు, కరివేపాకు, 4 మిరపకాయలు, తుంపి ముక్కలు, కలిపి వేయించిన తదుపరి దోసకాయ ముక్కలు అందువేసి 15 నిమిషాలు మూతవేసి తరువాత తరువాత పది ఉప్పురాళ్లు వేసి దింపి మూత పెట్టవలెను. కూరలాగు తయారగును. రుచికి బాగుండును. సులభముగా జీర్ణమై ఆకలి గలిగించును. ఉష్ణబాధ తగ్గును.

ఇవటూరి శ్యామలాదేవి, (తెనాలి)

---

చిటికెడు సోడావుప్పు, వుల్లిగడ్డముక్కలు, కరివేపాకు, అల్లం, పచ్చిమిరపకాయలు, వుప్పు (దంచినది), కాబేజీ, అన్నీవేసి బాగా కలపాలి. కలిపినపిండి గారెలమాదిరి చేసి, బాణలిలో నూనెపోసి నూనె మరిగాక వడలు వేయించి, వేడిమీద తింటే చాల బాగుంటాయి. పిండిమాత్రం గట్టిగా గారెల పిండిమాదిరి వుండవలెను. ఈ వడలు మా ఇంట్లో కాబేజీ వున్నప్పుడల్లా చేసుకుంటాము. సమానంగా వేయించి, వేడిమీద తింటే కరకరలాడుతూ బావుంటాయి.

కె. యస్. ఆర్. రాణి (ఖోర్నకల్).

## గణుసుగడ్డతో పోళీలు

ఒకపావు గోధుమరవ్వను (సన్నరవ్వ) బాగుగ రోటిలో రుబ్బుకోవాలి. పదిలేక పండ్రెండు గణుసు గడ్డలను తీసుకొని వాటి తొట్టువొలిచి, చక్కగా ఉడికించాలి. గడ్డలు బాగుగ వుడికిన తరువాత, దీనిని కూడ రోటియందు రుబ్బుకోవాలి. బెల్లంపాకం పెట్టి, రుబ్బిన గణుసుగడ్డ పూర్ణమును పాకంలో కలపాలి. మంచి నిప్పుసెగలో 5 నిమిషాలపాటు బాగుగ కలియపెట్టి దించాలి తరువాత ఆ వచ్చిన పూర్ణమును వుంటలుగ చేసుకొని, మొదట రుబ్బిన గోధుమరవ్వపిండిని కొద్ది కొద్దిగ తీసుకొని, పూర్ణానికి కప్పాలి. అటూఇటూ నూనె పూసి, పూర్ణానికి కప్పియుండిన పిండిని తట్టుకోవాలి. అటు తరువాత పెనముపై వెచి, బాగుగ కాలిన తరువాత, దించి తినవచ్చో బహురుచిగ నుంటాయి.

కల్యాణసుందరం, (బెంగుళూరు.) ★

# బొమ్మల కొలువులు

**జి. యస్. వాణి**

మన ప్రాంతంలో చాలామంది ఈ సంక్రాంతికి బొమ్మలు పెడతారు. అనాదిగా వస్తున్నది మనకీ ఆచారం. కాని నిజానికి ఈ బొమ్మలు ప్రదర్శించటం అనే దాన్ని ఎందుకు పెట్టారూ? అంటే—చిత్రకళను అందులో అభిరుచిని పెంపొందించటానికే—అని చెప్పుకోవాలి. అంటే—కేవలం కొన్ని అచ్చు బొమ్మలేకాక చేతితో తయారు చేసినవి కూడా వుండాలి-అనేగా అర్థం మరి.

అన్ని కొతపోసిన బొమ్మలు అంతస్తుల్లో పేర్చటం చిత్రకళా ప్రదర్శనం అని అనిపించుకోదు. పోతపోసిన అచ్చుబొమ్మలు పెట్టటంవలన ప్రయోజనమేమిటి? అని అనేవాండ్లు లేకపోలేదు! నన్నడిగితే ఈ అచ్చు బొమ్మలు. కొలువు మెట్లమీద అందంగా పెట్టడంకూడా ఒక కళే అంటా. ఇందులో కూడా కొంత నేర్పు చూపగలిగితేనే ఆ కొలువు అయినా అందంగా కనబడేది. ప్రతి ఏటా పెట్టేవే అయినా బొమ్మల్ని బట్టి అందంగా అమర్చగలగాలి—ఓ పద్ధతిలో!!

ఒకసారి నేను మా అక్కగారి వూరికి వెళ్ళా సంక్రాంతికి. మా వాళ్ళింటికి పేరంటం పిలవను వెళ్లా నేను, అక్కా. ఆ ఇంటి ఆయన కూతురు-అప్పుడే బొమ్మలు పెట్టటం పూర్తి చేశారు. ఆయన అదే పనిగా "ఎలా వుంది?" అనడిగారు మమ్మల్ని—బొమ్మల వైపు చూస్తూ. "బాగున్నాయి" అన్నా నేను—అంతకన్న ఇంకేం అనలేక. కాని మా అక్కయ్య వూరుకోలే.

"అయితే బాబాయ్! ఈ బొమ్మ లేమిటి? అనడిగింది—ఓ మెట్టుమీద నాలుగు చోట్ల వున్న బొమ్మల్ని చూపించి. "అదేమిటమ్మాయ్? రాముడు, లక్ష్మణుడు..." అని చెప్పాడాయన వరుసన. "అయితే అవన్నీ ఒక సెట్ కదా! విడదీశారేమిటి? చదువుకున్న వాండ్లకన్నా..." అంతటితో ఆపేసింది దాంతో ఆయన స్కూల్ ఫైనల్ ఫెయిల్డ్ కూతురిమొహం నయాపైసా అంత అయి వూరుకుంది.

కాస్తోకూస్తో చదువుకున్న వాండ్లు ఈ 1957 లో కూడా అలా పేర్చితే ఆ బొమ్మల కొలువును చూచిన కొందరైనా నవ్వుకోక పోరు. నానాటికి పెరుగుతున్న విజ్ఞానాన్ని మన బొమ్మల కొలువులోకూడా చూపించాలి మరి.

మా అమ్మ చెబుతూంటారు—వాళ్ళ పుట్టింట్లో దశరా నెల వుండనగానే బొమ్మలకు అలంకారాలు మొదలుపెట్టేవాళ్ళట. వత్తురేకులతో, పూసలతో — రకరకాలుగా పండుగరోజుల్లో నగలన్నీ వాటికి అలంకరించే వాండ్లట. అదంతా మా కాలంలేదన్నా— అంటారామె,

అయితే అందరికీ చేతితో తయారు చేయటం రావద్దా? అనవచ్చు. ఒకఇంట్లోని ప్రతి ఒక్కరికి ఈ ఆర్టు అలవడక పోయినా ఏ ఒక్కరిలో నో వుండకపోదు—కొద్దిగా. చిక్కల్లా ఎక్కడంటే చదువుకు, సంగీతానికి—ఇచ్చినట్లుగా ప్రోత్సాహాన్ని ఈ చిత్రకళకు ఇవ్వరు. కాకపోయినా బొమ్మల కొలువులో చిన్నాపొన్నవి చేసేందుకు ఏమంత పెద్ద తెలివి తేటలు అవసరంలే—మనకు తోచింది వూహించి ప్రయత్నిస్తే ఫలితం రాకపోదు. ఎక్కడన్నా చదివిగాని, చూచిగాని, చేయవచ్చుగూడా. తెలివితేటలకన్న ముఖ్యం శ్రద్ధ—అంతకన్న ముఖ్యం ఓపిక—కావాలి. ఇంటిపనులలో సతమతమయే గృహిణులు చేయలేకపోయినా విడిగా వుండేవాళ్లు ప్రయత్నం చేయవచ్చు.

కొందరిండ్లల్లో బొమ్మల కొలువులు చూస్తుంటే వదిలిరాబుద్ధిగాదు. ప్రతి సంవత్సరం పెట్టే పాతబొమ్మలేఅయినా ఏ సంవత్సరానికా సంవత్సరం కొత్త పద్ధతిలో అమర్చి ప్రత్యేకాకర్షణ కలగచేస్తారు మరి కొందరు. ఈవిషయంలో పెద్దవాండ్లు చిన్న పిల్లలను వుత్సాహ పరచాలి. వాండ్లు చేసే చిన్న పనులను "ఆ! నీ మొహంలే!" అని దులబరిస్తే బిక్కమొహంవేసి ఇక ఎప్పుడు అలా ప్రయత్నించరు.—ఎగతాళి చేస్తారని భయంతో!! ఓ తడవ మా చిన్నచెల్లి ఏంచేసిందో తెలుసా! మేమంతా సినిమాహాలని పార్కని చేస్తున్నాం గందరగోళంగా. తనూ ఓమూల కూర్చుని చిన్నచిన్న రేకు మూతలకు, లక్కచిట్లకు—సిగరెట్ తగరాలుచుట్టింది. అవన్నీ ఓ అంతస్తులో పేర్చి, వాటివెనక బొమ్మను, అమ్ముతున్నట్లు తనే పెట్టేసింది. వచ్చినవాండ్లను మొదటిసారిగా ఆకర్షించింది—లైట్లలో మెరుస్తున్న ఆ తగరం వస్తువులు. 'ఆ వెండివి ఎప్పుడుకొన్నారండీ!' అని అగిడినవాండ్లకు చెప్పలేక మా అమ్మకని అయిపోయింది. చిన్నపిల్లల పనులను ఆక్షేపించకుండావుంటే వాండ్లే పెద్దవులే రకరకాలుగా చేయగలుగుతారు—వూహాతో.

వూహంటే నాకో సంగతి జ్ఞాపకం వస్తుంది. అప్పుడు నాకు 12 సం॥ వుంటాయేమో! ఒకరింటికి పేరంటానికి వెళ్ళాం. క్రితం రోజున లేనిది ఓ అంతస్తు చివరన ఒక మామూలు సైజు వత్తుపళ్ళెంలో నాలుగు పెద్దసైజుగారెలు, అదే సైజు మరో పళ్లెంలో నాలుగు ఆవడలు పెట్టి ఉన్నాయి. వాటి ముందు ఒక బొమ్మ నిలబెట్టి వుంది. రెండు ఎండిపోయిన వేపపుల్లలకు ఒక సన్నటి కాగితం అతికించి గేట్లాగా నిలబెట్టి వుంది. దానిమీద పెన్సిలుతో "కాఫీ హోటలు" అని వంకరటింకర అక్షరాలతో రాసివుంది. వచ్చిన వాండ్లందరితో అదేపనిగా చెప్తోంది, ఆ ఇంటి ఇల్లాలు "చూశారూ! ఇది మా చెల్లెలు చేసిపెట్టింది. దానికి ఎంత ఓపికో!! లక్షణంగా రాసి కూడా పెట్టింది" అని. ఆ గారెల సైజు, ప్లేట్ల పరిమాణం, అక్షరాలతీరు - మాకు నవ్వాగనిచ్చిందిగాదు. ఎప్పుడెప్పుడు బయట పడదామా! అనుకున్నాం. దీన్ని ఓ చిన్న పిల్ల చేస్తే ఆపిల్ల అంతమాత్రం వూహను నిజంగా అభినందించాల్సిందే. కా...నీ గుంటూరులో ఇంటరు చదువుతున్న 18 సం॥ అమ్మాయి స్వతహాగా కూడా కాకుండా మా యింట్లో క్రితం రోజున చూచినదాన్ని ఇమిటేట్ చేసిన ఆ తీరు చూస్తే – మరి నవ్వు రాక ఏం వస్తుంది కనుక!!.. ... దీన్ని ఎందుకు చెబుతున్నానంటే ఇతరులు చేసింది మక్కీకి మక్కీ కాపీ కొట్టటం నేర్చనిపించుకోదు. అలాచేయటం తప్పు అని అనను గాని అలాచేయటంలోకూడా బుద్ధిని వుపయోగించాలి కొంచెం. 'ఇతరులుచేసిందే మనంచేయాలి; అలానేవుండాలి' అని అనటం, చేయటం—అంతమంచి పద్ధతికాదు. ఇతరులుచేసిందిచూచి ఆ ఆధారంతో మనం ఇంకోదాన్ని వూహించి చేయవచ్చు.

మెట్లమీద ఎంతో ఖరీదయిన బొమ్మలు, మినమిన మెరిసేవి ఎన్ని పెట్టినా మెట్లక్రిందగా-అంటే నేలమీద-ఏవైనా ఒకటిరెండైనా చేతితో తయారుచేసి పెట్టితేనే ఆ మెట్లమీదున్న బొమ్మలకు అందం వచ్చేది. లేకపోతే అంత ఖరీదయిన బొమ్మలతో కూడిన ఆకొలువు ఏదో లోపాన్నిసూచిస్తుంటుంది. బోసి పోయుంటుంది. కూడా అట్టలు, రంగు కాగితాలు వుపయోగించి మనకు తోచిన పద్ధతుల్లో అనేక రకాలుగా వస్తువులు తయారుచేసి ప్రదర్శించవచ్చు.

ఏది ఏమైన బొమ్మలు ప్రదర్శించటం ఆదర్శప్రాయంగా వుండాలి. ఏ మాత్రం




వి. సత్యవతీదేవిగారు వ్రాసిన పిల్లలూ-చదువులూ అన్న వ్యాసం చాలాబాగుంది. పిల్లల విద్యాబుద్ధులు పూర్తిగా తల్లితండ్రుల శిక్షణబట్టే వుంటుంది. పిల్లలు పోకిరీగా తిరుగుతున్నా పూరుష పరీక్షలలో మార్కులు సున్నా వచ్చినప్పుడు వాళ్ళని చీవాట్లుపెట్టడం చాలాచోట్ల చూస్తున్నాం. పిల్లలు అప్రయోజకులయారంటే తల్లి దండ్రులే కారణం. స్లిప్పులు తీసుకువెళ్ళి పరీక్షలువ్రాసి పేసయతే అబ్బాయి పాసయాడన్న గొప్పేగాని అబ్బాయికి జ్ఞానం ఎంత వుందో చూడరు. పిల్లలు సోమరిపోతులయాలంటే దానికి పెద్దలే కారణం.

ఈ పత్రికలోనే లక్ష్మిగారు వ్రాసిన విషయాలు బాగున్నవి. నోములు, వ్రతములు, పూజలు కథలు మనకు వినడానికి ఓపిక వుండాలిగాని అమ్మమ్మలు, బామ్మలు కొల్లలుగా చెప్తారు. ఇటువంటి నోములు, పూజలు "వనితాలోకం"లో అనవసరం. "ఇంక వనితాలోకం" శీర్షికలో గృహవైద్యం వ్యాసాలు చాలా చక్కగా వుంటున్నవి. అందరికి వుపయోగపడేటట్లు వున్నాయి. ఇంకా మంచి వ్యాసాలతో "వనితాలోకం" శీర్షిక అభివృద్ధిచెందాలని ఆశిస్తాను,

కుమారి కొట్టక్కి పుష్ప పట్నాయక్.
(సాలూరు)

* * *

## బొమ్మల కొలువు

శ్రద్ధవహించినా కొంతలో కొంతయినా మనలోనికళాభిరుచిని అందమైన రూపంలో ప్రదర్శించలేకపోలేం! ఎన్నో కొన్నబొమ్మలు ఇవ్వలేని ఆనందాన్ని ఈ చేతితో తయారుచేసిన ఒకటి రెండు ఇవ్వగలుగుతాయి చేసేటప్పుడు పడిన అంత అవస్థ పండగనాటి బొమ్మల కొలువును చూడంగానే సంతోషం క్రింద మారుతుంది-మనం చేసిపెట్టినవికదా! అని.

మరి బొమ్మలు పెట్టటం అంటే...కేవలం పోతపోసిన బొమ్మలు కుప్పలుకుప్పలుగానో చీమల బారుల్లాగానో పెట్టటం కాదుకదా! బొమ్మలకొలువంటే కళాత్మకంగా వుండాలాయె; తీర్చి దిద్దినట్టుండాలి కదూ! మన బొమ్మల ప్రదర్శనం!

★

## "పిల్లల పెంపకము"

ఇదివరకు మా చిన్నతనములో మా అమ్మ అంటూవుండేది: "పిల్లల పెంపకము అంటే సామాన్యము అనుకున్నారా? వాళ్లకు ఎన్ని విధాల చేస్తే పెరిగి పెద్దవారు అవుతారు" అని. ఇప్పుడు నాదాకా వస్తేగాని తెలియలేదు పిల్లల పెంపకము అంటేఏమిటో. పసిపిల్లల అప్పటినుంచి కూడా పిల్లలకు ఏవిధంగా అలవాటు చేస్తే పెద్దవాళ్ళు అయిన తరువాత కూడా అదే విధంగా పనులన్నీ చక్కగా అలవాటు అవుతాయి. చిన్నతనం నుంచీ శుభ్రంగా వుండడము మొదలైన చక్కని అలవాట్లన్నీ కూడా తల్లి కొంచెము ఓర్పుతో నేర్పినట్లయితే పెద్దవాళ్లయిన తరువాత కూడా వాళ్ళ పనులు వాళ్ళుచేసుకోవడము శుభ్రముగా వుండడము తెలిసి మనకు కూడా చాలా సహాయముగా వుంటారు. మట్టిలో తిరగడము తొడిగిన బట్టలన్నీ మాపుకోవడము ఇవన్నీ పిల్లలకు సహజంగా వస్తువుంటాయి. ఇలా తిరగడం నో పెద్దయినా కూడా ఈ స్వభావమే అలవాటు అవుతుంది.

మా వాళ్లలోనే వొకళ్ళు వున్నారు. ఇంటికి చుట్టాలు వెళ్తే వాళ్లు వెళ్ళిపోయేంత వరకు బయటికే రారు. ఏగదిలోదో కూర్చుంటారు. పోనీ వాళ్లకు డబ్బును చూచి గర్వము ఏమో అనుకుంటే అంత జమీందార్లూ కాదు. తరువాత వాళ్ళ అమ్మను అడిగితే చెప్పింది, మా పిల్లలకు తగని భిడియము అని పెద్ద గొప్పగా చెప్పుకొచ్చింది ఆవిడ. అందుకని ఇటువంటి లోపాలు ఏమీ రాకుండా చిన్నప్పటినుంచి పిల్లలను జాగ్రత్తతో పెంచిన వాళ్లు పెద్దయి మంచిపేరు తెచ్చుకొని తల్లిదండ్రులకు కూడా మంచి పేరును తీసుకువస్తారు.

బి. రామసారథి, (బెంగుళూరు)

* * *

## "నిజమే!"

శ్రీమతి వారణాసి సుబ్బలక్ష్మిగారు 27-11-57 తేది వారపత్రికలో వ్రాసిన "తమ్ముడి స్నేహితుడు!" వ్యాసం చదివాను. అది చాలా బాగుంది. రచయిత్రిగారి ఉద్దేశములతో ఏకీభవించేవారిలో నేనొకణ్ణి. వారికి, అటువంటి వ్యాసమును వ్రాసినందుకు నా కృతజ్ఞత ఇందుమూలముగా తెలియజేయుచున్నాను. ఇటువంటి సంఘటనే నేను చదువుకొనే రోజుల్లో ఒకటి జరిగింది. మా తెలుగు మాష్టారి యింటికి 60 ఏళ్ళ వయసుగల వ్యక్తి (ఆ వ్యక్తి మా మాష్టారికి పరిచితుడే లెండి) వెళ్ళి "తెలుగు మాష్టారు (ఆయనపేరు చెప్పాడు) వెండిమరచెంబులో కాఫీ పోసి యిమ్మన్నారని అడిగాడట. కాని ఆవిడ పావుగంటముందే పిల్లవాడి చేతికిచ్చి కాఫీ పంపించిందట. ఆవిడ తెలివైనది కాబట్టి ఆ వ్యక్తిని కూర్చోపెట్టి పెరట్లో నుండి వెనకాతలవీథిలోకెళ్లి చుట్టుప్రక్కలవాళ్లతో చెప్పిందిట. దాంతో ఇరుగు పొరుగువాళ్లు వచ్చి ఈ వ్యక్తిని నానా చీవాట్లు పెట్టి (అందరు ఎరుగున్న వ్యక్తే కాబట్టి) అప్పటితో వదిలిపెట్టారట.

—పి. సుబ్రహ్మణ్యము, (తాళ్లరేవు.)

* * *

లక్ష్మిగారు చాలా నిష్కర్షగా మాకు నోములు వ్రతాలు వద్దు అని వ్రాసినారు. అది నాకు నచ్చలేదు. అట్లా రాస్తే అది రాసినవారికి చాలా నిరుత్సాహం కలుగుతుంది. మనం వనితలను ప్రోత్సహించి ముందుకు తేవాలి కాని అట్లా విమర్శించకూడదని నా వూహ. సోవియట్ ఉపగ్రహాలు రోదసిలో ప్రయాణం చేస్తున్న ఈ కాలంలో వనితలు చెప్పుకోవలసినది ఇదేనా అని ఆశ్చర్యపడవలసిన అవుసరములేదు. ఈ కాలంలో కూడా నోములూ వ్రతాలు చేసేవారు ఉన్నారు. కాబట్టే మన దేశం ఈ మాత్రంగానన్నా వున్నది. గృహనిర్వహణ, పూజలు ఇవి అన్నీ భారత స్త్రీయొక్క ముఖ్య ధర్మాలు. 'వనితాలోకం'లో చక్కని వ్యాసాల నందిస్తున్నవారికి నా హృదయపూర్వకవందనములు. ఇంకా వనితలకి విజ్ఞానప్రదమైన వ్యాసాలు మొదలైన

(48-వ పేజీ చూడండి)

# బాల సాహితి

## రాజు - రజకుడు

ఉదయసింహ మహారాజు
ఉదయముననె నిద్రలేచి,
గవాక్షంబు చెంత కరిగి
కనెను రాచవీథివంక.

అపుడే ఒక చాకివాడు
ఆదారిని పోవుచుండె,
ఆరజకుని గన్నపిదప
అవనీశుం డిటు తిరిగెను.

అటు తిరిగిన రాజుతలకు
కిటికీ ఊచ పెరిలున
తగులుటచే, జొటజొటర
క్తము ప్రవహింప సాగినది.

కోపావేశంబువలన
భూపతి యొక భటుని బిలిచి
"వడిగా జని మడివేలును
బట్టితెమ్మ"ని వచించెను.

చెప్పినంతనే వాడును
చప్పునబోయి చాకలిని
పట్టితెచ్చి రాజుగారి
యెట్టయెదుట నిలువబెట్టె.

ఉదయసింహు డా చాకలి
వదనంబును గన్నంతనె
పటపటమని పండ్లు కొరికి
యిటుల చెప్పె కోపముతో.

"ఓరీ! నీపాడు ముఖము
ఉదయంబున జూచుటచే
తగిలె నింతదెబ్బ కాన
తలతీయించెదను నీకు."

ఉర్వీశుని మాటలు విని
నిర్విణ్ణుండై రజకుడు
కొంతసేపు ఊరకుండి
కొనకిట్లని ప్రవచించెను.

"అయ్యా! నాపాడు ముఖము
నరసినందువలన నీకు
గాయము మాత్రంబు తగిలె
ఆయువేమొ దక్కిపోయె.

కానీ నీముద్దుముఖము
గాంచుటచే నాకు నేడు
ప్రాణములే పోవునట్టి
పరిస్థితి తటస్థించెను."

ఆమాటలు విని సిగ్గున
అధోవదనుడై జనపతి
చాకివాని విడిచిపుచ్చి
సత్యమును గ్రహించుకొనెను.

ఆర్. దొరస్వామి

# వెల్తమాషా

రత్నగిరి జమీందారుగారికి గుఱ్ఱాలంటే మహాసరదా. వారి సంస్థానంలోవున్న అశ్వశాలని చూడటానికి రోజూ ఎంతోమంది వస్తారు. ఆ గుఱ్ఱాలకి మంచి తరిఫీదు ఇవ్వడానికి వసంథైన వస్తాదు లున్నారు. ఈ గుఱ్ఱాలమీద స్వారిచేయడం అంటే జమీందారుగారికి ఎంతో ఆనంద వినోదం.

సంకురాత్రి పండుగ వచ్చిందంటే రత్నగిరిలో గుఱ్ఱపు పందెం చాలా హుషారుగా సాగుతుంది. జమీందారుగారే ఆ పందెం సాగిస్తారు. అంచేత నేలయీనినట్లుగా జనం తండోపతండాలుగా వస్తూంటారు.

గుఱ్ఱాలసరదా తీరాలంటే రత్నగిరి పోవాలని చుట్టుపక్కల గ్రామస్థులు చెప్పుకొనేవారు. ఏ పనైనా మానేవారు కాని - జమీందారు

## అయ్యగారి విశ్వేశ్వరరావు

గారు గుఱ్ఱాలమీద స్వారిచేయడం-గుఱ్ఱపుపందెం జరపడం మాత్రం మానేవారుకారు.

ఎన్ని గుఱ్ఱాలు వున్నప్పటికీ - కొన్ని గుఱ్ఱాలను అమ్మడం మరి కొన్ని గుఱ్ఱాలను కొనడం కూడా ఆయనకి ఎంతోసరదా. ఈ అమ్మడంగాని - కొనడంగాని తమ సొంత వ్యవహారంగా స్వయంగా చేసేవారు గాని తాబేదార్లకి పురమాయించేవారు కారు.

అంచేత గుఱ్ఱాల వ్యాపారంచేసే వర్తకులు నరానరి జమీందారుగారి దగ్గరే తమ వ్యవహారాలను ఫైనల్ చేసుకొనేవారు. ఇలావుండగా - ఒకనాడు - జమీందారుగారు తీరికగా భవనంలో ఉద్యోగస్థులతో సంప్రదిస్తున్నారు.

ఇంతలో గుఱ్ఱపుడెక్కల చప్పుడు బహు ముద్దుగా వినిపించింది.

జమీందారు తన సంభాషణ హఠాత్తుగా ఆపుచేశారు. అలా కిటికీలోంచి వీధివైపు చూశారు. ఒక గుఱ్ఱం—దాని ప్రక్కనే ఒక వర్తకుడు. ఆ గుఱ్ఱాన్ని చూసేసరికి జమీందారు గారికి ముచ్చటగానే వుంది. అమ్మకానికి వచ్చాడో-లేక ఏకబురైనా తెచ్చాడో—జమీందారుగారికి అర్థం కాలేదు.

"ఎవరోయ్ - నీవూ?" అన్నారు జమీందారుగారు వర్తకుని చూచి.

సవినయంగా - "జోహార్ జమీందార్ - జోహార్ జమీందార్" అన్నాడు ఆ ఆసామీ. "లోపలికి రా!" అని జమీందారు పిలిచిందే తడవుగా ఆ వర్తకుడు లోపలకు

వచ్చాడు. కూర్చున్నాడు. ఇలా అన్నాడు:

"నాది సింధుదేశం మహాప్రభో. గుఱ్ఱాలవర్తకం మా తాత తండ్రుల నాటినుంచీ అచ్చొచ్చిన వ్యాపారం బాబయ్యా. నెల్లాళ్లనుంచి యీ చుట్టుపక్కల ప్రభువులందరికీ పాతిక గుఱ్ఱాల్ని విక్రయించాను స్వామీ. ఇహ-యీ ఒక్క గుఱ్ఱమే మిగిలి పోయింది. దీనిని కొనే తాహత్తు ఎవరికీ లేదన్నారు. వాకబుచేయగా-చేయగా - రత్నగిరి జమీందారులే దీన్ని కొనాలి అన్నారు. అంచేత తమ దగ్గఱకే గుఱ్ఱాన్ని తెచ్చాను-దొరా! రండి-బాబయ్యా-చూడండి. నా గుఱ్ఱాన్ని చూడండి. ఎంత అందంగా వుందో చూడండి. ఇది పంచకళ్యాణిగుఱ్ఱం బాబయ్యా" - అన్నాడు వర్తకుడు.

జమీందారుగారికి గుఱ్ఱాల వ్యవహారం అంటే అంతులేని ఆనందం. గుఱ్ఱాన్ని ఎగా దిగా చూశారు. సరే—"ఎంతయ్యా దీని ఖరీదు" అన్నారు జమీందారుగారు.

"మూడువేల రూకలు మహానుభావా!" అన్నాడా వర్తకుడు. "కనీ-వినీ ఎఱుగని విపరీత ధర చెబుతున్నావే—" అన్నారు జమీందారుగారు. "అది-అంతే బాబయ్యా-ఇది అల్లాటప్పా గుఱ్ఱం కాదు. అరి తేరినజాతి బాబూ. కొంటేయిలాంటి గుఱ్ఱాన్నే కొనాలి తమరు," అన్నాడు వర్తకుడు

"వర్తకు లందరిదీ ఒక్కటేదారి, అమ్మేముందు మీరు చేసే పొగడ్తలకు అంతూ పంతూ వుండదు. ఎవరెరగరు ఈ గుఱ్ఱాలసారం. నాదగ్గర అంత పొగిడినా ప్రయోజనం లేదు. తూచినట్టు ధర కట్టగలను తెలుసునా?" అన్నారు జమీందారు.

"మీరు ఎంత తూచి ధర కట్టగలిగినవారైనా—నేను కాదనలేను గాని ఈ ధరకి తక్కువలో ఇంత పంచకళ్యాణి గుఱ్ఱాన్ని తమరు సంపాయించలేరని మాత్రం నిక్కచ్చిగా చెప్పగలను బాబయ్యా" అని తన గుఱ్ఱం గొప్ప చెప్పతున్నాడు వర్తకుడు.

"చాల్లేవయ్యా-దీని తాతలాంటి గుఱ్ఱాల్ని సంపాయించాను. ఓసారి మా అశ్వశాలకి పోయిచూడు. నీ గుఱ్ఱంకన్న నిగనిగలాడే నీకైన గుఱ్ఱాలున్నాయి—ఎఱుగుదువా? హెచ్చు ధరలు చెప్పి ఏం ప్రయోజనం. వంకాయల బేరం చేయక - రక్ మని—ఒకే ధరచెప్ప" అన్నారు జమీందారుగారు.

వర్తకుడు పైకీ - కిందకీ ఓసారి చూశాడు. చిత్తం తమరే నిర్ణయించండన్నాడు చివరకి. జమీందారు ఏదో లెక్కవేసి-" అల్లాగైతే యిలా చూడు - నీకు రెండువేల రూకలిస్తాం. ఇష్టంగావుంటే - గుఱ్ఱాన్ని యిచ్చిపో. దీని తాతల్లాంటి గుఱ్ఱాలున్నాయి మాదగ్గిర-పోనీలే-దీన్ని కూడా కొని-నీ వర్తక వ్యాపారానికి మా సహాయం చేయాలని సరదా పడుతున్నాం. ఇంతకన్న మంచి గుఱ్ఱాన్ని తీసుకొనిరా. నీ సరదా తీరుస్తాం-" అన్నారు జమీందారుగారు.

"అంటే - యీ గుఱ్ఱం అంత మంచిదికాదనా - బాబయ్యా —" అన్నాడు వర్తకుడు. నిజమేనయ్యా-ఇది అంత ధర చెయ్యదు. గుఱ్ఱాల గుణశీలాల్ని సింహావలోకనం చేయడం - యీ మొక్కకి మనదే పైచేయి-తెలుసా" అన్నారు జమీందారుగారు.

అక్కణ్ణుంచి అక్కడవున్న 'అరకప్పటీగాళ్లు' తందానతాన లంకించుకొన్నారు. అంటే ఏవిటో తెలుసా. ఈ అరకప్పటీగాళ్ళకి ఏవృత్తీ ఉద్యోగం అక్కర్లేదు. ఎప్పుడూ అరకప్పటీ సేవిస్తూ—జమీందారుగారిదగ్గఱ భళాభళీ అంటూ ఇచ్చకాలు చెబుతారు. వేస్తే పానకంలో పుడకవేస్తారు. చేస్తే-మంచి అడ్డుపుల్ల వేస్తారు. ఇహ - వీరందుకున్నారు-"ఎందుకయ్యా-ఇంకా మీనమేషాలు లెక్కపెడతావ్, మా జమీందారుగారిమాట శిలాక్షరం. ఏదేశం పోయినా - ఈయన చెప్పిన మాటలే ఖాయం. వృథాగా-ఆలోచించి ఏం ప్రయోజనం. ఇచ్చెయ్ ఆ ధరకి"-అన్నారు అరకప్పటీగాళ్లు. "ఏం-ఇష్టమేనా" - అంటున్నారు జమీందారుగారు. "చిత్తం-సమ్మతమేనండి" అన్నాడు వర్తకుడు. మరోక్షణంలోనే రెండువేలరూకలు ఇచ్చారు జమీందారుగారు. వర్తకుడు ఆ రూకల్ని లెక్కపెట్టుకున్నాడు. సంచీలో వేసుకొని మొలకి చుట్టుకున్నాడు. జమీందారుగారికి నమస్కరించాడు. గడపదాటి వెళ్ళాడు. గుఱ్ఱందగ్గరికి పోయాడు. దాన్ని నిమురుతున్నాడు.

"పాపం యెంత ప్రేమతో పెంచాడో - యెన్నాళ్ళ నుంచి పెంచాడో - పెంచిన ప్రేమ మహా గొప్పదిసుమండీ" అంటున్నారు అరకప్పటీగాళ్లు. "చూడండి-దాన్నెలా ముద్దెట్టుకుంటున్నాడో ఆహా-గుఱ్ఱంలాంటి విశ్వాసమైన జంతువు కుక్కంటే ఒప్పుకుంటాను గాని -

# న్యాయ నిర్ణయం

పి. ఆర్. గోపాల్‌రావు

పూర్వం మనదేశం అతి భాగ్యవంతమైనది. ఆ రోజుల్లో మన దేశంలో రత్నాలను, వజ్రాలను రాసులు రాసులుగా పోసి అమ్మేవారు. అందుకనే కాబోలు కవులు మనదేశాన్ని 'రత్నగర్భ' యని వర్ణించారు. ఆ కాలంలో ఇతర దేశాలనుండి అనేకమంది వర్తకులు వచ్చి రత్నాలను, వజ్రాలను ఖరీదు చేసేవారు. మన వ్యాపారం ముఖ్యంగా అరబ్బుదేశాలతో విరివిగా జరిగేది.

ఒకసారి 'సుందర్‌లాల్' అనే రత్నాల వర్తకుడు వ్యాపార నిమిత్తమై అరబ్బుదేశం వెళ్లాడు. అతడు వెళ్లడం వెళ్లడం ఒక పెద్ద పట్టణానికి వెళ్ళాడు. అది పెద్ద పట్టణమే గాని సరియైన సత్రమే లేదు. అందుకని ఆ వూరిలోకెల్ల పెద్ద ధనవంతుడని పేరుగాంచిన 'అబ్దుల్‌రషీద్'ను ఆశ్రయించాడు. ఆయన 'లాల్'కు అతిథి మర్యాదలు చేసి, ఆయన తన యింట బసచేయుటకు అంగీకరించాడు. ఈ మర్యాద లన్నీ చూసి 'సుందర్‌లాల్' 'రషీద్'ను నమ్మి ఒక రత్నాల పెట్టెను జాగ్రత్త చేయమని ఇచ్చాడు. దానికిగూడ అంగీకరించాడు 'రషీద్'.

అప్పుడే 'లాల్' వచ్చి ఒక పక్షమయింది. వ్యాపారం బాగానే సాగింది. ఇక మరొక పట్టణం వెళ్దామనే ఉద్దేశంతో రషీద్‌వద్దకు వెళ్ళి "రషీద్‌జీ! మీ దయవల్ల నా వ్యాపారం బాగానే సాగింది. ఇన్ని రోజులూ మీ అతిథిగా నన్ను భరించినందులకు నేనెంతయేని కృతజ్ఞుడను. నేనిక మరో పట్టణం వెళ్తాను. సెలవిప్పించండి.'అని కృతజ్ఞతా సూచకంగా నమస్కరిస్తూ పల్కాడు.

'అబ్దుల్‌రషీద్' గూడ చిరునవ్వుతో "అయ్యయ్యో! ఎంత మాటన్నారు! నేను మీకు చేసిందేమిటిలెండి. మీ మనస్సలాంటిది. సరే, వెళ్లిరండి. తిరుగు ప్రయాణంలో మరోమారు మా యింటికి దయచేయండి" అనుమానమేమాత్రం కలుగకుండా అన్నాడు.

"మరి మా పెట్టె దయచేయిస్తే ఇక వెళ్ళొస్తాను," నీళ్లు నముల్తూ అన్నాడు 'లాల్'.

"ఏమన్నారు?" వినపడనట్టు నటిస్తూ అన్నాడు 'అబ్దుల్'.

మా రత్నాల పెట్టెను దయ చేయిస్తే..."

"ఏమిటి మీ రంటున్నది...? రత్నాలేమిటి...? పెట్టేమిటి...?" రెచ్చిపోతూ మాట్లాడాడు 'రషీద్'.

అంతటితో 'లాల్'కు 'రషీద్' కపట వ్యవహార మంతా అవగాహనయింది. ఇక వీడితో మాట్లాడితే పోట్లాట అవుతుందని నేరుగా 'కాజీ' (న్యాయాధీశుడు) వద్దకు వెళ్ళి ఫిర్యాదు జేశాడు.

'కాజీ' పిలుపు ననుసరించి 'అబ్దుల్ రషీద్' గూడ హాజరయ్యాడు. 'కాజీ' 'అబ్దుల్ రషీద్'తో సౌమ్యంగాజెప్పి,నిజంగా పెట్టె తీసుకున్నట్లయితే, ఇప్పుడైనా సరే ఇస్తే శిక్ష ఏమాత్రం పడకుండా చూస్తాననీ, లేకపోతే తర్వాత చిక్కులలో పడవలసివస్తుందనీ హెచ్చరించాడు. 'ససేమిరా' అన్నాడు 'అబ్దుల్‌రషీద్'.

అప్పుడు 'కాజీ'కి ఎవరిమాటలు

---

## చెల్ తమాషా

ఇంకోటి ఏం వుంది చెప్పండి?" అన్నారు జమీందారుగారు.

పెంచిన ప్రేమకొద్దీ వదలలేక - వదలలేక పోవలిసిన-ఆ యజమాని-ఆ పెంపుడుగుఱ్ఱం - ఈ దృశ్యాన్ని చూస్తే "నిజంగా కూతుర్ని అత్తారింటికిపంపే-తల్లిదండ్రులబాధ జ్ఞాపకానికి వస్తోం"దంటున్నాడు మరో పెద్దమనిషి.

ఇంతమందీ ఇలా చూస్తుండగా చల్-అన్నాడు వర్తకుడు-ఆ గుఱ్ఱం మీదవాలి. బ్రహ్మాండంగా డెక్కల చప్పుడు. గుఱ్ఱంతోసహా వర్తకుడు పలాయనం. అంతా తమాషాగా జరిగిపోయింది—

(మిగతా పైవారం)

సమాన్నాలో అర్థం కాలేదు. దీర్ఘంగా ఆలోచించిన మీదట ఒక ఉపాయం తట్టింది.

“రషీద్! నీవు నీ భార్యపేర ఒక చీటీ రాసియ్యి, దానిలో “ఈ చీటి తీసుకొచ్చిన సిపాయికి ‘సుందర్ లాల్’ రత్నాల పెట్టెను ఇవ్వవలసిందిగా రాయి,” అని సలహా యిచ్చాడు ‘కాజీ’.

“అసలు పెట్టె తీసుకోనిదే ఎలా వ్రాయను?” భయపడ్తూనే అన్నాడు ‘అబ్దుల్’.

“నీ కెందుకు? ముందు నే చెప్పినట్లు రాయి. ఉంటే పెట్టె ఇస్తుంది నీభార్య. లేకపోతే లేదు. వ్రాయక పోతివా మరణదండన తప్పదు. జాగ్రత్త!”

మరణదండన మాట వినగానే భయపడ్డాడు. ఇక తప్పదురా ‘అల్లా!’ అనుకుని అల్లాగే వ్రాసి యిచ్చాడు.

ఆ చీటీని ‘కాజీ’ ఒక సిపాయి ద్వారా ‘అబ్దుల్ రషీద్’ యింటికి పంపాడు. కొద్ది సేపట్లోనే సిపాయి పెట్టెతో సహా తయారయ్యాడు.

పెట్టె జూడగానే ‘సుందర్ లాల్’ ముఖం సుందరంగా వికసించింది. ‘అబ్దుల్ రషీద్’ ముఖం అవురావురుమంది. ‘కాజీ’ మొఖం కాంతితో వెల్లివిరిసింది.

సుందర్ లాల్ పెట్టెను బీగంతో తెరిచాడు. అన్నీ లెక్క చూడగా ఎలా పెట్టిన వలాగే ఉన్నాయ్. ‘కాజీ’వద్దను అబద్ధమాడిన ‘అబ్దుల్ రషీద్’ వద్దను సెలవు తీసుకొని సుందర్ లాల్ మరోపట్టణం వెళ్లాడు.

మన ‘అబ్దుల్ రషీద్’ను మొదటి తప్పుగా క్షమించి కొద్ది జుల్మానా విధించాడు కాజీ ఇంటి కెళ్లేవరకు తలెత్తలేదు ‘రషీద్’.

తన న్యాయనిర్ణయానికి తనే మురిసిపోయాడు ‘కాజీ’. ★

[ఒక హిందీ కథ ఆధారంగా]

## న్యూఢిల్లీ లేఖ

(5-వ పేజీ తరువాయి)

వాటికి నేటికీకూడా బెంగాల్ శరణార్థుల సమస్య కేంద్ర ప్రభుత్వానికి పెద్ద బెడదగానే తయారైంది. ఎక్కడో ఒకచోట స్థిరనివాసాలు ఏర్పాటుచేసుకోడానికి వీరుససేమిరా ఒప్పుకోవడంలేదు. వీరిలో దాదాపు ఐదోవంతు స్థితిపరులు-తమంతట తామే నివాసాలు ఏర్పాటుచేసుకోగల శక్తివున్నవాళ్ళు. అయినా ప్రభుత్వం అందరికీ తగిన సదుపాయాలు చేస్తున్నది. ప్రతిశరణార్థికి ఉచిత గృహవసతి, ఉచిత విద్యాసౌకర్యం, వైద్యసదుపాయం మొదలైనవన్నీ చూపడమేగాక నెలకు రు. 60 కూడా ఇస్తున్నది.

ఇంతేగాక ప్రతికొందిశీక కుటుంబం ఒకచోట స్థిరంగా వుండిపోవడానికి ఐదారువేల రూపాయలు మంజూరు చేస్తుంది. ఇంత చేసినా, ఆ శరణార్థులు ఒకచోట వుండిపోవడానికి ఇష్టపడరు. ఈ పరిస్థితులలో ఈ బెడద ఎలా ఎప్పుడు పరిష్కారమవుతుందో తెలియదు. ★

## ★ వశీకరణం ★

(20-వ పేజీ తరువాయి)

"సిగరెట్లు ఆరోగ్యానికి చెరుపా" అనే విషయమై పాఠకులు చర్చలు జరుపుతున్నారు. ఎవరి అభిప్రాయం వారు పంపుతున్నారు. జనవాక్యం...అంటే... కాశ్మీర్‌లో జనవాక్య సేకరణను, మన వి. కె. కృష్ణమీనన్ అంగీకరించడంలేదు. మొన్న భద్రతా సమితి సెక్యూరిటీ కౌన్సిల్‌లో పన్నాలుగు గంటలు గంభీరోపన్యాసం చేశారు. ఉపన్యాసం ఒక కళ. దానికో టెక్నిక్ వుంది. ప్రతిదానికి ఒక టెక్నిక్ వుంది. మా బావమరది నాటకల్లో మంచి టెక్నిక్ వుంది. అతను రేడియో స్టేషన్‌లో పనిచేస్తున్నాడు. మీ ఇంట్లో రేడియో వుందను కొంటాను. మాఇంట్లో ఒకటుండేది. ఇప్పుడు లేదులెండి......"

మాట్లాడుతున్నాడు మహానుభావుడు. సుందరరావుకు ఏమీ తోచలేదు. ఆయన తనఎదుట ఒక 'మానవుడు' ఉన్నట్లు గూడా గమనించడంలేదు. తనమాటలు ఒకరు వింటున్నారనే ధ్యాసకూడా లేదు. ఆయన ఉపన్యాసానికి అంతూ దరీ కనిపించడంలేదు. ఆపే సూచన కనిపించడం లేదు. "ఏం చేయన్రా శ్రీహరీ" అనుకొన్నాడు సుందరరావు.

దీపాలు వెలిగాయి!

రాత్రి ఎనిమిదయింది...

తొమ్మిదయింది......

భోజనానికి పిలుపు వచ్చింది.

ఇద్దరూ భోజనం చేశారు.

వెంకట్రావుకు ఈ 'చిన్న అడ్డంకు' లేవీ ఆటంకం కలిగించలేదు. ఆయన మాట్లాడుతూనే వున్నారు. భోజనం తర్వాత మళ్ళీ కూర్చున్నారు: తాంబూలం వేసుకోవడం మాటల్లో 'మాటగా' జరిగిపోయింది. సుందరరావు నిద్రను ఆపుకోలేకపోయాడు... ఎప్పుడో నిద్రపోయాడు. కుర్చీలోనే నిద్రపోయాడు. వెంకట్రావుగారు మాట్లాడుతూనే వున్నారు. చాలసేపటి తర్వాత హఠాత్తుగా మాట్లాడుతూ...వెళ్లిపోయారు. తలుపు గొళ్లెం పెట్టడానికికూడా ఆయింట్లో ఎవరూ మేలుకొనిలేరు.

* * *

మర్నాడు సాయంకాలం మళ్లీ పిలవకుండానే వచ్చి ఇంట్లో కూర్చున్నారు వెంకట్రావుగారు. రాగానే మాట్లాడడం ప్రారంభించారు. అక్కడ వుండలేక వంటింట్లోకి వెళ్ళి, మంచినీళ్ళయినా త్రాగాలని సుందరరావు లేచాడు. ఆయన చెయ్యిలాగి కూర్చోబెట్టి అన్నారు.

"అఁ...ఇప్పుడేం కాఫీలెండి. ఏం అవసరం లేదండీ. అసలు నాకు కాఫీ అలవాటు లేదండీ. ఎప్పుడన్నా ఓవల్టిన్ త్రాగుతానంతే. అందులోనూ భోజనం వేళ దగ్గరపడుతోంది మరి. ఎప్పుడూ ఏ వేళకది భుజించాలి. ఏమంటారుక్? ఈ కాలం కుఱ్ఱవాళ్లు ఏదీ ఒప్పుకోరు. మా అబ్బాయి బియ్యే చదువుతున్నాడు. ఈ కాలంలో ఏం బియ్యేలెండి! మా కాలంలో బియ్యే అంటే బియ్యపుబస్తా అన్నమాటే. బియ్యం ఇప్పుడు మరీ ధర ఎక్కువయిపోయిం దనుకోండి..."

సుందరరావు కూలబడిపోయాడు. హఠాత్తుగా లేచాడు. ఆ లేవడంచూచి వెంకట్రావుగారు కూడా దంగయిపోయారు. సుందరరావుగారు అలమరలోంచి "మిత్ర వశీకరణము" పుస్తకాన్ని తీశాడు అగ్గిపుల్ల గీసి దానిని వెలిగించాడు. అది విచారంగా కాలిపోసాగింది.

వెంకట్రావుగారు...ఒక్కక్షణం వుండి పుస్తకాలనుగురించీ, నిప్పును గురించీ, అడవిలో 'అగ్గితోడి' గురించీ ప్రసంగం సాగించారు.

సుందరరావు ఇంక ఏవిధంగానూ వెంకట్రావును వదిలించుకోలేకపోయాడు. ఇంట్లో వీధిలో పార్కులో, ఆఫీసులో... ఎక్కడికి వెళ్ళినా...వెంబడించసాగారాయన!

ఏం చేయాలో తోచలేదు...

ఏ పనీ జరగడంలేదు...

ఎక్కడికి వెళ్ళడానికి వీలులేకుండా పోయింది.

ఇల్లుమార్చినా లాభంలేదనిపించింది.

బదిలీచేయమని ఆఫీసరుగారికి దరఖాస్తు పెట్టుకొన్నాడు!



## వనితా వాణి

(42 వ పేజీ తరువాయి)

వాటితో "వనితాలోకం" ఇంకా అభివృద్ధి పొందుతుందని ఆశిస్తున్నాను.

వి. నాగరత్నం, (శ్రీకాకుళం)

* * *

కుమారి లక్ష్మిగారు వ్రాసిన "వద్దు" అనే కలహాచూచి నేను చాలా ఆశ్చర్యపోయాను. ఎందుచేతనంటే వారికి నోములు, వ్రతాలు ఇష్టంలేనట్లు తెలుస్తున్నది. నోములకు వేరే పుస్తకాలున్నాయన్నారే. ఇక లోకంలో జరిగే సంగతులు ప్రతి దినపత్రికలోనూ చూస్తున్నాం గదా! ఇక దీంట్లో కూడా ఎందుకు? కాబట్టి వారు చెప్పింది అంతగా బాగుండని విషయం.

జె. అన్నపూర్ణ, (విజయవాడ)

* * *

నండూరి రాజలక్ష్మిగారు వ్రాసిన "శిరోజముల సంరక్షణ" చదివాను. చాలా బాగున్నది. నా అభినందనలు.

జయలక్ష్మి, (బొంబాయి)



## జంటరేడియోలు

(7-వ పేజీ తరువాయి)

కావాలంటే ఇచ్చానని నీతో చెప్పాను. అది అబద్ధం. అతనికి నా రేడియో అమ్మేశాను......

పద్మ - ఆ... అలాగా...

మధు - ఏం! అలా నిర్ఘాంతపోతున్నావు?

పద్మ - అబ్బే! మీరు మీ రేడియో ని అమ్మేస్తున్నానని నాతో ముందుగా చెబితే నేను ఆపని చేసేదాన్ని కాదు.

మధు - ఏం పని పద్మా!

పద్మ - మీ రేడియో వుందిగదా అని నా

రేడియో అమ్మేశాను.

మధు - (ఆశ్చర్యంగా) అయితే నువ్వు రిపేరుకి యివ్వలేదన్న మాట.

పద్మ - లేదు నా ఫ్రెండు విమల కావాలని చాలాసార్లు అంది నిన్న మీరు నా రేడియో అమ్మేయమని ఎలాగూ అన్నారు గదా, మీతో చిన్న పిల్లలాగా ప్రతిరోజూ వాదన ఎందుకని నా రేడియోని అమ్మేయడానికి నిశ్చయించుకున్నాను పనిమనిషి ద్వారా విమలకి ఆ రేడియో పంపేశాను. తమాషాకి మీతో రిపేరుకి పంపేనని అన్నాను

మధు - అరే! విమలకా నీవు రేడియో అమ్మింది! నేను నా రేడియో విమల భర్తకేయిస్తా బాగా నేవుంది మన రేడియోలు కాదు, వాళ్ళకిస్తా మన కీచులాటలు వాళ్ళకి అమ్మేశాం అయితే మన ఇద్దరి రేడియోలు బయటికి వెళ్ళాయన్న మాట ఇప్పుడు కాలక్షేపానికి మరి దారి ..

రంగమ్మ-ఇదిగోనండి అమ్మగారూ! విమలమ్మగారు ఈ చీటీ, రేడియో మీకిమ్మన్నారు.

పద్మ-అదేమిటే రంగమ్మా! రేడియో కావాలని పట్టుపట్టి తీసుకున్న విమల రెండు రోజులయినా కాకముందే ఎందుకు తిరిగి పంపేసిందో ~

రంగమ్మ-ఏమోనమ్మా! ఆ సంగతులన్నీ ఆవిడగారు ఆ చీటీలో రాసినారుట. అలాగని చెప్పమన్నారు.

పద్మ-అలాగా! సరేగాని నీపని చూసుకో. [చీటీ విప్పి చదువుకుంటుంది]

మధు-కొంచెం పైకి చదువు నేను కూడ వింటాను ఏమి వ్రాసిందో .

పద్మ-నాకేం భయమనుకున్నారా? చదువుతా వినండి.

పద్మా!

రేడియోని తిరిగి పంపినందుకు నువ్వు చాల ఆశ్చర్యపడుతున్నావనుకుంటాను దీనికి కారణం లేకపోలేదు నువ్వు రేడియో పని మనిషిద్వారా పంపిన వెంటనే మా వారు కూడ సరికొత్త రేడియోతో ప్రత్యక్షమయ్యారు. మీరెక్కడ కొన్నారంటే, నువ్వెక్కడ కొన్నావని నేను, ఆయన ఒకర్ని ఒకరు ప్రశ్నించుకున్నాం సరే ఇద్దరం ఎలాను కొన్నాముగదా అని ఈ రెండురోజుల్నుంచి అవి వేరువేరుగా ఉపయోగించుకుంటున్నాం. సరే! రెండురోజులు బాగా సాగడాయి కాని నిన్న రాత్రి యిద్దరిమధ్య రగడ ప్రారంభమయింది రెండు రేడియోలు కారణంగా నువ్వు గట్టిగా పెట్టావంటే, మీరు గట్టిగా పెట్టేరని యిద్దరం వాదులాడుకోవడం మొదలెట్టాము చివరికి మావారు రేడియో అమ్మేయరాదా అన్నారు. ఒకమాట అనుమానం దెబ్బతిన్నా గాని యిద్దరము ఒక చోట గదా, ఎవరి రేడియో అమ్మితే యేంఅని అనుకున్నాను వారు దీన్ని ఎంతకమ్మాలో తెలీదు. కనుక నువ్వు ఈ రేడియోని ఎవరికేనా అమ్మి దానిఖరీదు నేను ఎలాగూ నీకు యివ్వాలి కనుక ఆసొమ్ము నీవు తీసికో నీకు శ్రమ కలిగించినందుకు క్షమించు "ఎవరిదగ్గర కొన్నారండీ మీ రేడియో"కి అని మావారినడిగితే, ఆయన "ఎవరిదగ్గరయితే నీకెందుకు? నా ఫ్రెండుదగ్గర కొన్నా"నని అన్నారు "పోనీలే! ఈ రేడియో కన్నా అది అన్నివిధాల బాగుందని దీన్ని నీకు త్రిప్పి పంపుతున్నాను. మావారున్న విని నవ్వకేం.. ...

ఇట్లు
విమల.

మధు భలే! భలే! ఏ ఒక్క రేడియో లేదు. కాలక్షేపానికి ఎలాగ అని బెంగ పెట్టుకున్నాం ఏదొక్క రేడియో అయితే నేం సగం బెంగ తీరింది.

పద్మ-మా బెంగమాట అటుంచి, అటు వాళ్ళ కీచులాటలు, యిటు మన కీచులాటలు పూర్తిగా తగ్గేయి ఏమంటారు?

మధు-నేమాత్రం కాదంటానా [తెర]



విల్లివాకం (మద్రాసు) ఆంధ్రసంఘం వార్షికోత్సవ సందర్భంలో సంఘాధ్యక్షులు శ్రీ కె. వి. సోమయాజులు, ఉపన్యాసకులు శ్రీ రామకృష్ణప్రసాద్, తదితరులు.

# సినిమా

జహాంగీర్ పిక్చర్స్‌వారి కొత్త చిత్రం "మినిస్టర్"కు, బొంబాయి రెవెన్యూ మంత్రి శ్రీ రసిక్‌లాల్ పరీఖ్ డిసెంబరు 7న రంజిత్ స్టుడియోలో ప్రారంభోత్సవం జరిపారు. ఫిలిం సెట్‌పైన జాతీయ పతాకావిష్కరణతో కార్యక్రమం ఆరంభమై జాతీయగీత గానంతో పరిసమాప్తమైంది. విధ్యుక్తధర్మ పరిపాలనపట్ల, గౌరవం ఉన్న ఒక మంత్రి, వ్యక్తిగత జీవితాన్ని ఇందులో చిత్రిస్తారట. ఇటు కన్నకొడుకుపట్ల ప్రేమ, అటు ప్రజల శ్రేయస్సుకై నెరవేర్చవలసిన విధులపట్ల పట్టుదలగల ఆ మంత్రి ఒకప్పుడు హఠాత్తుగా ఇటో అటో అని తేల్చుకోవలసిన విషమ పరిస్థితి ఏర్పడుతుంది. ఆ భూమికను, ముఖ్య నటుడు ప్రజ్ఞానిధి మోతీలాల్ నిర్వహించబోతున్నాడు. ఆయనకు మొన్ననే 47వ సంవత్సరం వచ్చింది. ఈ పుట్టినరోజు పండుగ పేరిట స్వీకరించిన తొలి భూమిక ఇది. ఇతర నటులు నాట్యతార రూపమాల, భగవాన్, సులోచన, శివిరాజ్, సురేశ్. సంగీతం మదనమోహన్. దర్శకత్వం నరేంద్ర దేవ్.

## బొంబాయి సినిమా లేఖ

నటుడు మోతీలాల్ ఈనాటికి 47 ఏళ్ళ వాడనిపించుకున్నా, అతని విగ్రహస్ఫూర్తి, ఆ వ్యక్తిశక్తి, చైతన్యం పాతికేళ్ళ పడుచువాడు అనిపించే తరహాలోనే ఉన్నాయి. నేటికి పాతికేళ్ళ క్రితమే మోతీలాల్ మేటి నటుడు అయ్యాడు. అతని ప్రభ ఈసినిమ నటీమణులలా ఉజ్జ్వలంగా వెలిగింది. సబితాదేవి, మాయా బెనర్జీ, రోజ్, మాధురి, ఖుర్షీద్, వీణ, మన్వర్ సుల్తానా, నసీం, వనమాల, నర్గిస్, నిమ్మి, సురయ్యా, నూర్జహాన్, గీతానిజామీ, ముంతాజ్ శాంతి, స్నేహప్రభా ప్రధాన్, ఇప్పటి మీనాకుమారి, మధుబాల మొదలగు వారంతా మోతీలాల్‌కు నాయికలుగా నటించినవారే.

### కొత్త చిత్రం

మోతీలాల్ నటించిన ఇటీవలి చిత్రం 'అబ్ దిల్లీ దూర్ నహీ' అందులో ఉత్తమ స్థాయి నటన ప్రదర్శించాడు. మొత్తం అతడు నటించినవి 60 పై చిలుకు చిత్రాలున్నాయి.

అశోక్ పిక్చర్స్‌వారి "రాగిణి"లో పద్మిని



జాగీర్దార్, శ్రీ హంస్ డిజ్ జేన్ అండ్ ఆర్థర్, వుయ్‌త్రీ, పాడీ, పర్దేశ్, అచ్యుత్ కన్య, ఆగేకదం, దోస్త్, గజ్రే, తకదీర్, పహ్లీనజర్, బిశ్వాస్‌పాడీ, బీతే దిన్, ఏక్ దో తీన్, మిస్టర్ సంపత్, జాగ్ తేరహో మొదలైనవి మోతీలాల్ 47 వ పుట్టినరోజు పండుగ డిసెంబరు నాలుగు బుధవారంనాడు జరిగింది.

## గౌరి

గురుదత్ ఇటీవల ఆరంభించిన బెంగాలీ చిత్రం 'గౌరి' నిర్మాణం విరమించుకోవడం ఖరారని తేలిపోయింది అందులో, అతని భార్య, గాయని గీతాదత్ తొలిసారిగా నాయకపాత్ర స్వీకరించింది గురుదత్, ముఖ్యభూమిక ధరించాడు కలకత్తా పరిసరాలలో కొన్ని ఔట్‌డోర్ దృశ్యాలూ స్టూడియోలో సెట్‌లపై కొంతపనికూడా జరిగింది. అంతలో హఠాత్తుగా ఈ వార్త వచ్చింది ఫిలింవర్గాలలో అంతా ఆశ్చర్యపోయారు. ఇలా ఎందుకు మానుకున్నట్టూ అని తర్కించుకుంటున్నారు కారణం మటుకు తెలియరాలేదు పుకార్లమీద షికార్లు చేసేవాళ్లుమాత్రం కుటుంబంలో ఏవో కలతలు వచ్చాయంటున్నారు గురుదత్ హిందీచిత్రం 'రాజ్' కూడా ప్రస్తుతానికి మానుకున్నట్లే ఇపుడు మరో చిత్రం నిర్మించడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. దానికి ఆయనే దర్శకత్వం వహిస్తారు.

* * *

'రామన్ ప్రొడక్షన్స్‌వారి వర్ణచిత్రం 'జ్వాల'లో వైజయంతిమాలస్థానే మధుబాల నటిస్తోంది. మధుబాల ప్రస్తుతం పాల్గొంటున్న చిత్రాలు 21 వరకూ ఉన్నాయి. వైజయంతిమాల నటిస్తున్నవి 7 నిమ్మి పదింటిలో ఉంది. అందరికన్న ఎక్కువ చిత్రాలలో ఉన్నది నిరూపరాయ్. ఆమె చిత్రాలు 26 ఉన్నాయి.

* * *

ప్రసిద్ధ తమిళ నటుడు శివాజీగణేశన్, ఇటీవల బొంబాయి తమిళ సంఘంవారి నాటకోత్సవాలను పురస్కరించుకొని బొంబాయి వచ్చారు గణేశన్ ఇపుడు 'అమర్ దీప్' అనే హిందీ చిత్రం నిర్మిస్తూఉన్న విషయం విదితమే. దీంతోపాటు, ఇక్కడ ఒక తమిళ చిత్రాన్నికూడా నిర్మిస్తున్నారు ఆ చిత్రం నటబృందం, అంతా మొన్న ఆయనవెంట ఇక్కడికి వచ్చింది ఒకరిద్దరు మిత్రులతో కలసి, గణేశన్ ఒకరోజున బొంబాయి నగరమంతా తిరిగి చూడతగ్గవన్నీ చూచారు. ఒక లాంచి అద్దెకు తీసుకొని, ఎలిఫెంటా గుహలకు వెళ్లిచూచివచ్చారు నటుడు దేవానంద్, అతడి భార్య కల్పన, ప్రభృతులు గణేశన్ గౌరవార్థం నగరంలో చాలా విందులు చేశారు.

★



'పరదేశి' చిత్రంలో సోవియట్-నటుడు ఆలెగ్ స్ట్రిజనోవ్, నర్గీస్

చిత్ర సమీక్ష :

# ★ 'పరదేశి' ★

అందరూ ఎదురు చూచిన 'పరదేశి' చిత్రం గతవారం బొంబాయిలో విడుదలఅయింది. భారతీయ సంస్థ నయా సన్సార్ ఇంటర్నేషనల్, మాస్ ఫిలిం స్టుడియో (మాస్కో)లు కలసి, మనోహరమైన సోవ్ కలర్ లో, సోవ్ స్కోప్ (సినిమా స్కోప్‌కు సోవియట్ పేరు) చిత్రంగా రూపొందించిన 'పరదేశి' నిర్మాణంలో ఉభయదేశాల నటీనటులూ, టెక్నిషియన్లూ కూడా పాల్గొన్నారు. భారతీయ సంస్థ తరఫున క్వాజా అహమద్

# 'పరదేశి'

అబ్బాస్, సోవియట్ సంస్థ తరఫున వి. ప్రొనిన్ దర్శకత్వం నిర్వహించారు. బొంబాయి రీగల్ సినిమాలో జరిగిన ప్రారంభోత్సవ ప్రదర్శనానికి రాష్ట్ర గవర్నరు అధ్యక్షత వహించారు. భారతదేశంలోని సోవియట్ రాయబారి మాస్కోనుండి వచ్చిన కళాకారుల ప్రతినిధివర్గం ఈ ఉత్సవానికి హాజరయ్యారు.

15వ శతాబ్దంలో తొలిసారిగా మన భూమిపై కాలుమోపిన రష్యన్ యాత్రికుడు అఫనాసీ నికితిన్, పర్యటన విశేషాలను ఇందులో చిత్రించారు. అతడు ఆనాడు సందర్శించిన భారతదేశాన్ని ఈనాడు మనకు చూపించారు. నికితిన్ భారతదేశ సందర్శనాభిలాషతో ఓల్గానది వెంబడి బయలుదేరాడు. దారిలో, పెద్ద పెద్ద మంచు తుపానులను, ఇసుకతుపానులనూ నిభాయించుకున్నాడు. బందిపోటు దొంగల ముఠాలను, సముద్రపు దొంగల దారుణాలను తట్టుకొన్నాడు. తోటిప్రయాణికులు తలపెట్టిన అఘాయిత్యాలుతప్పించుకున్నాడు చివరకు భారతదేశపు పశ్చిమ పశ్చిమకోస్తాపై మహారాష్ట్రసీమలో కాలుమోపాడు. అక్కడి పల్లెప్రజల ఆతిథ్యం, వారి ఆపేక్ష, ఆదరణ చూచి ముగ్ధుడైపోయాడు. అప్పటి దక్కన్ రాజ్యం ప్రధాని మహమద్ గవాన్‌ను, నికితిన్ కలుసుకోవడంతో కథ ఆరంభమవుతుంది. రాజనర్తకి, ఒకగ్రామీణగాయకుడు, ఆవక ఒక చక్కని చుక్క అతనికి పరిచితులవుతారు. ఆ పల్లెపడతి చూపే నిర్మలమైన ప్రేమ, నిరాడంబరమైన ఆమె తరహా అతన్ని ముగ్ధుణ్ణి చేస్తాయి. ఆమెపట్ల అపారమైన అనురాగం కలుగుతుంది. అక్కడనుండి నికితిన్, ఆ పిమ నలుమూలలా తిరుగుతాడు. పల్లెటూరి సంబరాలు, సంతలూ చూస్తాడు. రాజదర్బారును, అక్కడి భవనాల శిల్పవిభవాన్ని చూచి ఆనందిస్తాడు. భారతీయ సంస్కృతికి, నాగరికతకు చిహ్నాలయిన శిల్ప, చిత్రకళా ఖండాలనుచూచి, తెలుసుకొంటాడు. ఈ ఘట్టాలలో మహాబలిపురం శిల్పాలు, అజంతా ఎల్లోరా గుహాలయాలు, జైపూర్‌లోని జంతర్ మంతర్ గ్రహ పరిశీలనా నిలయం, కొచ్చిన్, మహారాష్ట్ర సీమలలోని రమణీయ దృశ్యాలను, ఛాయాగ్రహణ దర్శకులు మనోహరంగా, మరుత రావంతి అందంగా తెరమీద చిత్రించారు. ఇదేకాక, మొటమొదటి 'షాట్'నుండి చిట్టచివరివరకూ సోవిట్ ఛాయాగ్రాహకులు శోవకోవ్, ఎ. కనీజ్‌లు, భారతీయఛాయాగ్రాహకుడు రామచంద్ర సహకారంతో, అద్భుతం అనిపించే రీతిన ప్రతిసన్నివేశాన్ని దృశ్యాన్నీ చిత్రించారు. ఉత్తమోత్తమమైన ఈ ఛాయాగ్రహణ శిల్పంవల్ల ఈ చిత్రం యావత్తూ ఒక మనోహరమైన గేయంలా సాగిపోయింది. ప్రకృతి సౌందర్యాన్ని, భీభత్సాలనుకూడా, ప్రేక్షకుడికి అత్యంత సన్నిహితంచేసి, మహత్తరమైన అనుభూతి కలిగించేవిధంగా వీరు 'కామెరా'ను నడిపి, ఛాయాగ్రహణశిల్పంలో అధిక్యత తమదేనని నిరూపించుకున్నారు. ఈ 'పరదేశి' చిత్రంలో మీరు చూడగల స్థాయి ఛాయాగ్రహణం, ఈ సాంకేతిక ప్రగతి చలనచిత్ర చరిత్రలోనే అపూర్వం అనతగినది. సహజత్వానికి భంగంలేకుండా, దర్శకులు అబ్బాస్, ప్రొనిన్‌లు, కథను కట్టడంలో, చెప్పడంలో చూపినప్రజ్ఞ కూడా పీటికిదీటుగాఉంది. చిత్రం పూర్తిఅవుతున్నపుడు ప్రశాంత ప్రకృతిని మీరు సందర్శిస్తారు. సాయంవేళ, సముద్రతీరాన సూర్యాస్తమయదృశ్యాన్ని చూస్తున్నామన్న మధురానుభూతి కలుగుతుంది.



శ్రీ కృష్ణాఫిలింస్‌వారి "ఉస్తాద్"లో అశోక్‌కుమార్

'పరదేశి' చిత్రానికి మరొక అలంకారం మధురమైన సంగీతం. అనిల్ బిశ్వాస్, వీణ సితార్, సరోద్, వేణువు, మృదంగం, వంటి భారతీయ వాద్యాలనే ఇందులో ఉపయోగించారు. కొన్ని పాటలకు మన శాస్త్రీయ సంగీతాన్ని వాడుకొన్నారు. మరికొన్నిటికి తీయని జానపద గేయాల బాణీలను తీసుకొన్నారు. ఈ పాటలన్నీ, విన్నతరువాత చాలరోజులు మనసులో మెదులుతూనే ఉంటాయి.

ముఖ్యభూమిక (నికితిన్)ను సోవియట్ నటుడు అలెగ్ స్ట్రిజనోవ్ నిర్వహించాడు. పూటిగా, సుందరంగా నడిచెకథకు తగిన

విధంగా, అనవసరపు నగిషీలు లేకుండా, అభినయపాత్రం కాగల విధాన రూపొందించిన నికితన్ పాత్రను స్ట్రిజనోవ్ మంచి ఉత్సాహంతో, చైతన్యవంతంగా పోషించి నడిపాడు. ఉద్వేగ ప్రధానమైన సన్నివేశాలలో అతడి నటన ఉత్తమంగా ఉంది. ఇతరత్రా కొన్ని సందర్భాలలో నటుడు, కొంత తెచ్చిపెట్టుకున్న తరహా నటన ఛాయలు గోచరిస్తాయి. అక్కడ అది ఎబ్బెట్టుగా ఉండడానికి కారణం డబ్బింగ్ లోపం అని చెప్పుకోవచ్చు. ఆ పాత్రకు తగని కాఠిన్యం ఉన్న కంఠస్వరాన్ని, హిందీ సంభాషణలకై డబ్ చేశారు. నిజానికి ఈ డబింగ్ చాల చోట్ల లోపభూయిష్టంగా ఉంది. చిత్రం తొలి సన్నివేశాలలో (నికితన్ ఇంట్లో) ఈ లోపం కొట్టొచ్చినట్టు కనబడుతుంది.

మొత్తంమీద నటనకు అగ్రతాంబూలం పల్లెటూరి యువతిగా నటించిన నర్గిస్ కే చెందుతుంది. ఈ చిత్రంఆమెసొంతం చేసివేసుకొంది. ఛాయాగ్రహణం చేకూర్చిన శక్తులతో, నర్గిస్, మహారాష్ట్రదేశపు సౌందర్యాన్ని అంతటినీ తనలో నిలుపుకొన్నదనిపించింది.

తరువాత చెప్పుకోతగ్గ నటుడు బల్ రాజ్ సాహ్నీ. నికితన్ సహచరుడుగా ఉండి, అతడి భారతీయతత్వాన్ని బోధపరచిన గాయకుడి భూమికను బల్ రాజ్ నిర్వహించాడు. ఇతడి నటనలో చెప్పుకోతగ్గ సౌలభ్యం ఒప్పింది.

రాజనర్తకిగా పద్మిని చాలా అందంగా, ఆకర్షణీయంగా ఉంది. రంగురంగుల, రకరకాల ఆభరణాలతో, అలంకారాలతో, ఆమె నృత్యం చేస్తున్నప్పుడు, రాజనర్తకి గురించిన మా ఊహాచిత్రం రూపుధరించి



జలరుహావారి 'రాజనందిని'లో
గిరిజ

నట్టనిపిస్తుంది. ఆమె నృత్యం కన్నుల పండుగగా ఉంది. నటనమటుకు, రాజనర్తకి నిత్యజీవితంలో ఎంత కృత్రిమంగా ఉంటుందో, అంత ఎబ్బెట్టుగానూ ఉంది. పృథ్వీరాజ్ కపూర్, డేవిడ్, అచలా సచ్ దేవ్, మనోమోహనకృష్ణ మంచి నటన ప్రదర్శించారు.

సాంకేతికంగా ఈ చిత్రం ఇంతవరకూ వచ్చిన చిత్రాలన్నిటినీ మించిన స్థాయిలో ఉంది. ఒక విషయం. భారతదేశంలోని వివిధ ప్రాంతాలను చూపడంలో, ముఖ్యంగా దక్షిణభారతాన్ని చిత్రించడంలో, దర్శకుడు భౌగోళికంగా మన దేశస్వరూపం గురించి అట్టే పట్టించుకోనట్టు కనబడుతుంది.

మొత్తంమీద, తరచు సినిమాకి వెళ్ళే అలవాటు లేనివారుకూడా తప్పకుండా చూడతగిన చిత్రం 'పరదేశి.' ★

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)



రవీ ఫిలింస్‌వారి 'కొండవీటిదొంగ'లో రంజన్, అంజలీదేవి

చిత్రసమీక్ష:



# 'దుష్మన్'



దొంగలతల్లికి ఏడవభయం అన్నారు. పిల్లడు చిట్టిపొట్టిదొంగతనాలు చేస్తున్నప్పుడు, గుట్టుగానే అయినా కొస్త గట్టిగా కొప్పడకపోతే, ఆనక కథ ముదిరాక పట్టీకున ఏడవడానికికూడా పదుపాయం ఉండదు తల్లి భరోసా చూసుకుని, పొరుగింట తోటకూర దొంగతనంతో మొదలెట్టి, ముదిరిపోయిన ఒక గజదొంగని కొఱతవేయించారు రాజుగారు. కొస్త ఆసింటా నిల్చుని గుట్టుగా దుఃఖపడుతున్న తల్లిని దగ్గిరపొ రమ్మని, చెవి యిమ్మని కటుక్కున కరిచేశాడువాడు నీ కిదేం పొయ్యేకాలంరా దొంగవెధవా అని ఆవిడ కుయ్యో మొఱ్ఱోమంది. "తోటకూర నాడే చెప్పకపోతివిగదమ్మా ఈ మాట" అని వాపోయాడు కొడుకు.

క్వాత్రా ఆర్ ప్రొడక్షన్స్ వారి 'దుష్మన్' చిత్రంలో మాస్టర్ రోమీ బల్లో వేషం చూసు, పొరుగింటి పిల్లలబంతి చెక్కెయ్యడంలో తప్పేంలేదని తల్లి మప్పి పెడుతుంది అదే బాగుందని ఆతగాడు పర్సులూ అవీ దొంగిలించడం మరుగుతాడు. తీరా, పిల్లడు చెడిపోయాడని తల్లి గ్రహించే



ఆర్. ఎల్. అరోరాచిత్రం 'భక్త ధ్రువ'లో ధ్రువుడుగా నటిస్తున్న వినోద్ కుమార్



'లాల్ బత్తీ' చిత్రంలో బల్ రాజ్ సాహ్నీ, శశికళ

వరకు, పరిస్థితి చెయిదాటిపోయింది. వాడు దేవానంద్ సైజుకి పెరిగిపోయి, హాలీవుడ్ గాంగ్ స్టర్ ఫిలిం పద్ధతిలో ఒక ముఠా కట్టుకుని, దానికి ఒక హెడ్డాఫీసు పెట్టుకుని నవ్వుతూ పేలుతూ, ఆడుతూ పాడుతూ చిన్నా పెద్దా దొంగతనాలు చేస్తూ ఉంటాడు. అవన్నీ చూట్టానికిబావుంటాయి హుషారుగా ఉంటాయి.

అయితే, ఒకవిషయం గుర్తుకువచ్చి వెక్కిరిస్తుంది. 'సినిమాలు చిన్న పిల్లల్ని పాడు చేస్తున్నా'యని ఏణ్ణర్ధంక్రితం ఢిల్లీలోని 13 వేలమంది తల్లులు ప్రభుత్వానికి ఫిర్యాదు చేశారు. అది తప్పనీ, పిల్లలు పాడవడానికి కారకులు తల్లులేననీ, వాళ్ళ ఫిర్యాదుకు ఈ కథ, ఈ చిత్రం ఒక సవాలు అనీ చెప్పి ఇందుకుపూనుకున్న రచయిత ముఖ్ రాంశర్మ, దర్శకుడు రాజ్ రిషి, నిర్మాత హెచ్.ఎస్. క్వాత్రా, ఈ దొంగ జీవితాన్ని ఇలా హులాసాగా, చూడ ముచ్చటగా చిత్రించడం చిత్రంగా కనబడుతుంది. "ఈ ముచ్చట మూడునాళ్ళసుమీ" అని బెదరించే నీతి వాక్యం లేకపోలేదు. కాని, అది ఉండకపోతే, సెన్సారువాళ్ళేమనుకుంటారో అని ఆ ఏర్పాటుచేశారనిపిస్తుంది. గంపెడు బెల్లంలో ఒక వడ్లగింజవలెనుగా, అనీఅనపట్టుంది. అయితే, ఇందుకు బాధ్యులు కొంతవాయి నిర్మాతలుకారు. హాలీవుడ్ వాళ్ళు...

కొన్ని రీళ్ళపాటు ఇలా దొంగతనాలు చేశాక, రామూ (ఆ దొంగపేరు) ఉన్న ఊరునుండి పారిపోవాల్సి వస్తుంది. అలా పారిపోయినవాడు, సరాసరి, తననుు తరుముతున్న పోలీసుఅధికారి ఇంటికే అల్లుడవు

తాడు. ఆ అధికారి చెల్లెలును ప్రేమించి, మారుపేరుతో వంచించి వెళ్లాడుతాడు. ఆపైన అతనికి ఓ కొడుకు పుడతాడు. ఆ ఊళ్లోనే, బావగారి పలుకుబడి అడ్డుపెట్టుకొని, చెలరేగి ఒక నగలదుకాణంకూడా పెడతాడు. చివరకు బావకు, భార్యకూ కూడా తెలిసిపోతుంది. బావబంధుత్వానికి అతీతుడు, ధర్మనిరతుడూ కాబట్టి ఇతగాడు పారిపోతాడు. భార్యకూడా అతన్ని అసహ్యించుకొంటుంది. ఆమె, తన బిడ్డని పెంచుతున్న విధం చూసేసరికి, రామూకు తన చిన్నతనం, తనతల్లి తనకు దుర్బుద్ధులు మప్పడం గుర్తుకువస్తుంది. అప్పటికి, కాలాతీతమై, పైమీది కోటుసహా బీదలకు దానం ఇచ్చేసి, గడ్డంపెంచి విచారంనటించి తనంతటతనే పోలీసులకు దొరికిపోతాడు. అంతలోకే వాళ్ళు అతన్ని పట్టుకుంటారు. తనజీవితం ఇలాఅవడానికి కారకురాలు తల్లేకదా అని విచారించి, జైలుకువెళ్తాడు.

ఊహ మంచిదైనా మొదలూ చివరా మటుకే దాని ప్రస్తావన ఉంది. ఈ రెండింటి మధ్యనా, కథ నడచిన విధం ఉండతగినంత గొప్పగా లేదు. ప్రేక్షకులను అట్టే నిలబెట్టే శక్తి లేదు. కారణం, ఈ భాగంలోవచ్చే సంఘటనలు, సన్నివేశాలూ చాలవరకూ ఇంతకుముందు వచ్చిన చిత్రాలలో వాటిని పోలిఉండడమే ననిపిస్తుంది. ఈ భాగంలో, ఎప్పటికిమల్లేనే దేవానంద్, హుషారుగా అల్లరిచెయ్యడం, 'పేయింగ్ గెస్టు' ఫక్కీలో 'పేయింగెస్ట్' వేషాలు వెయ్యడం మొదలైనవన్నీ ఉన్నాయి. రామూ ఇల్లాలుగా ఉషాకిరణ్, అతగాడి తోడుదొంగగా రాధాకిషన్, పోలీసు అధికారిగా ప్రభుదయాళ్ బాగా నటించారు. చిన్న రాముగా మాస్టర్ రోమీ, కనబడ్డది కాస్సేపే అయినా, ఈ కథలో ముఖ్యాంశానికి బలం చేకూర్చేవిధంగా నటించాడు. హుసన్‌లాల్ భగత్‌రాం సంగీతం మరపురానంత మనోహరంగా లేదుగాని, రఫీ, ఆశాభోస్లే పాడిన పాటలు రెండు బాగున్నాయి. కుంకుం చేసిన నృత్యం ఒకటి చాలా బాగుంది. అదికాక నాయికచేత రెండు నృత్యాలు చేయించారు. గృహిణి వేషాలకు తగ విగ్రహం, నిండుతనం ఉన్న ఉషాకిరణ్ వల్లెవాటు వేసుకుని నృత్యాలు చేయడం ఏమంతఅమోఘంగా లేదు. ఛాయాగ్రహణం-ముఖ్యంగా ఔట్‌డోర్ దృశ్యాల చిత్రణ రమణీయంగా ఉంది. ★

## సినిమా వార్తలు

“ఇంతకీ...మావాడెక్కడెక్కడా కనబడడే” అన్నారు కాబోయే వియ్యంకుడు, అందంగా అలంకరించి ఉన్న ఆ సెట్టు చూట్టూ పరకాయించి చూసి.

“అబ్బాయా...అతనూ, ఇందాకే సైలుకి వెళ్లాడు...” అన్నాడు కాదలచుకొన్న వియ్యంకుడు. ఆయన పోలీసు అధికారి.

“ఝ్యువింటే! నేను వస్తానని తెలిసికూడా వెళ్ళాడేం?” అన్నాడు మొదటాయన కాస్తంత విసుపోయి.

“ఎబ్బెబ్బే...మీరు వస్తారని తెలిస్తే అలా వెళ్ళనిస్తామా...” అంటూ సర్దిచెప్పే తరహాలో నవ్వాడు ఆయన ఉజ్జీ.

‘ఝువిటో’ అన్నాయన సి. ఎస్. ఆర్. అని పసిగట్టేసి ఉంటారుకాబట్టి, ఈ చిత్రం పేరు రిపబ్లిక్ వారి ‘పెళ్లిసందడి’ అని చెప్పగానే, రెండో ఆసామి గుమ్మడి అని ఊహించవచ్చును.

“సి. ఎస్. ఆర్.” గారి కుమారుడు పెళ్ళికొడుకు. “గుమ్మడి” కుమార్తె పెళ్లికూతురు అవునో కాదో తెలీలేదు కాని, పెళ్ళి వ్యవహారం నానా హడావుడిగా ఉంది. అబ్బాయిలూ అమ్మాయిలూ స్వయంవరాల ‘మూడ్’లో ఉన్న రోజులుకాబట్టి పెద్దలు నిర్ణయించిన జోడాలలో సర్దుబాట్లు, పరటాలూ జరుపడం ఎలాగా అని సతమతమవుతున్నారు. ఆ యింటి అమ్మాయి మహా కొంటె రకం. రెండుజడలు వేసుకొని అంజలీదేవిలా అందంగా, చలాకీగా ఉంటుంది. అయితేనేం,



శ్రీ సారథి స్టూడియోస్‌వారి “ఎత్తుకు పైఎత్తు”లో సి. యస్. ఆర్, కుమారి బాల, లక్ష్మీరాజ్యం, వల్లం నరసింహారావు.



బ్లాక్ అండ్ వైట్ మువీస్‌వారి 'మరాబీ'లో దేవానంద్

# సినిమా వార్తలు

ఇప్పుడు అవసరాన్ని బట్టి కొంతంత కడుపు నొప్పిని అభినయిస్తోంది. ఈ వార్త రైలు దిగివచ్చిన సి. ఎస్. ఆర్.కు కూడా అందింది కాబోలు. అందుకని, ఆయన మీ అమ్మాయికి ఒంట్లో బాగు లేదన్నారు— అంటూ కొంతంత సందేహంగా వసిగే వరకూ 'అమ్మాయే' వచ్చి నమస్కరించింది. పెద్దాయన దీవించాడు.

"నాన్నా. వీరినిలా కబుర్లతో కూర్చో బెట్టేశావే. భోజనాలకి లేవరాదూ" అంది అమ్మాయి.

'భోజనం రెడీసార్' అన్నాడు ఆ డైలాగు కోసం రెడీగా నిల్చున్న, బట్లర్ వేషంలో ఉన్న వేళంగి.

'అమ్మడూ. నువ్వూ రా మాతో కూర్చుందువుగాని' అన్నారు సి. ఎస్. ఆర్. తిన్నగా ఉండక.

అమ్మడు ఇరకాటంలో పడ్డా, కడుపు నొప్పి ట్రిక్కు చటుక్కున గుర్తుకొచ్చి, "అబ్బెబ్బె. వద్దండి. నాకు ఒంట్లో బాపు లేదు—" అంది. డాక్టర్ 'రమణారెడ్డి'కి, రవ్వంత అనుమానం తగిలిందో ఏమో, "లంకణం పరమౌషధం అన్నారు... కొంత కషాయం తాగేస్తుంది లెండి. మీరు భోజనానికి లెండి' అన్నాడు తను లేస్తూ.

అమ్మడు మళ్లీ గుటకమింగింది. "కషాయమే" అంటూ—

అందరూ భోజనాల హాలుకు బయల్దేరారు. వెనక నిల్చుని ఈ సన్నివేశాన్ని చూచి ఆనందిస్తున్న బి. సరోజను (రెండో అమ్మాయి) చూచి ఆనందిస్తూ అన్నం తినవలసుకొన్న డాక్టర్ రమణారెడ్డి "నీకేం. నువ్వు పద" అన్నాడు.

అంతా వెళ్లిపోయాక అంజలీదేవి అటూ ఇటూ చూసి, అమ్మయ్య అనుకుని, హడావుడిగా మేడమీదికి పరుగెత్తింది. సి. ఎస్. ఆర్. ఆందోళనకూ, అమ్మాయి అబద్ధాలకూ హడావుడికీ ఇంకా భోలెడంత కథకూ కారకుడైన, స్థానిక జగన్నాటక సూత్రధారి, ఈ చలనచిత్ర నాయక పాత్రధారి, నాగేశ్వరరావు, మేడమీద గదిలో దాగి ఉన్నాడు!

* * *

తరవాత ఏమయిందో తెలుసుకోవాలనిపించే, ఈ తరహా సన్నివేశాలతో, హాస్యరస ప్రధానంగా ఈ చిత్రం రూపొందుతోంది. దీనికి కథ, మాటలూ పాటలూ సముద్రాల జూనియర్ వ్రాశారు. నటులు: నాగేశ్వరరావు, అంజలీదేవి, బి. సరోజ, చలం, రమణారెడ్డి, సి. ఎస్. ఆర్. గుమ్మడి వేళంగి మొదలుగువారు. దర్శకుడు డి. యోగానంద్ నిర్మాత సి. సీతారాం.★



దర్శకనిర్మాత శ్రీ వి. శాంతారాం బొంబాయిలో నిర్మిస్తున్న ఒక తెలుగు చిత్రానికి పాటలు వ్రాయడానికై శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరిని ఆహ్వానించారు. ఈ సందర్భంలో శంభు ఫిలింస్ వారు, ఆయన గౌరవార్థం విందుచేశారు. కుడివైపు చివర ఉన్నవారు శ్రీ కొసరాజు. వారి వెనుక శ్రీ తాపీనర్మారావు.

Printer and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



దయాల్ బాగ్ మఠము
[ఆగ్రాకు 8 మైళ్ల దూరాన ఉన్నది]

ఫోటో : పి. వి. నారాయణ—రాజమండ్రి.

Regd. No. M. 4479 Andhra Patrika Illustrated Weekly